Telugu Dialect Bulletin Series : ౬

# తెలుగు మాండలికాలు

## (విశాఖపట్టణం జిల్లా)

సంపాదకుడు

డా. బూదరాజు రాధాకృష్ణ




తెలుగు అకాడమి

హైదరాబాదు

1972

మాగధి, అవంతిజ (ఆవంతి), ప్రాచ్య, అర్ధమాగధి (ఆంధ్రమాగధి?), బాహ్లీక దాక్షిణాత్య [1] అనేవి ఏడు భాషలు; శాకారి, ఆభీరి, చాండాలి, శాబరి, ద్రామిడి, ఆంధ్రి, వనౌకసి అనేవి ఏడు విభాషలు.

అంటే సంస్కృతాపభ్రంశాలై, ఆయా మండలాలలో సామాన్యజన వ్యవహారంలో కన్పట్టే శౌరసేన్యాది ప్రాకృతభేదాలే భాషలు. ఈ భాషాపభ్రంశాలై, వన - పర్వతసంచారుల వ్యవహారంలో ఉన్న శాకార్యాదులే విభాషలు. భరతముని రూపకరచనలో ఉపయుక్తాలయ్యే భాషా - విభాషలలో ఏడేసి భేదాలను మాత్రమే చెప్పగా[2] సింగభూపాలుడు ఆయాదేశస్థులకు ఉచితాలయిన భాషా విభాషలు ఇంకా చాలా ఉన్నవనీ, అయితే నాటకంలో వాటికి ఉపయోగం లేకపోవడంచేత లక్షణము చెప్పబడలేదని పేర్కొన్నాడు[3].

భరతముని చేసిన వివరణను పరిశీలించగా, భాషలు సంస్కృతాపభ్రంశాలనీ, విభాషలు భాషాపభ్రంశాలనీ స్పష్టమవుతున్నది. అయితే, ఇవి అన్నీ ఆదిలో మాండలికభేదాలే అనడం సమంజసంగా తోస్తుంది. అంటే ఒకేభాష దేశ - పాత్ర భేదాలవల్ల కాలక్రమాన ఇన్ని భాషలుగా విలసిల్లినదన్నమాట.

మరి నేటి తెలుగుభాషలోకూడా అనేక మాండలికాలున్నాయి. అనేక కారణాలవల్ల తెలుగుదేశము కొంతకాలం మూడు ప్రధానమండలాలుగా విభక్తమై ఉంది. ఈ మూడు మండలాల వ్యవహారంలోను కొన్ని భేదాలు కానవస్తున్నాయి. అంతేకాదు, పలుకుబడిలో మండలానికీ మండలానికీ మాత్రమే కాక జిల్లాకు జిల్లాకు కూడా కొంత భేదము కనిపిస్తున్నది. ఇది ఇట్లా చాలాకాలం కొనసాగి ఉంటే తెలుగుభాషకూడా అనేక భాషలుగానో, విభాషలుగానో, విభక్తమయి ఉండేది. అదృష్టవశాన, అట్లా జరగలేదు.

ఈ మాండలికాల పరిశోధనలవల్ల మూడు ప్రధాన ప్రయోజనాలు సిద్ధిస్తాయి -

1. తెలుగు మాండలికాల వైవిధ్యంలోని ఏకత్వాన్ని నిరూపించడం.
2. ఈ ఏకత్వాన్ని వర్ణనాత్మకవ్యాకరణంగా రూపొందించడం.
3. పుంఖానుపుంఖాలుగా వెలువడుతున్న కావ్య నాటకాలలో దేశ-పాత్రలకు అనుగుణంగా వ్యవహారభాషాప్రయోగానికి వీలుకలిగించడం.

తెలుగు అకాడమి చేసే ఈ కృషి సహృదయుల ఆదరాభిమానాలను చూరగొంటుందని విశ్వసిస్తున్నాము.

—పోణంగి శ్రీరామ అప్పారావు

డైరక్టర్, తెలుగు అకాడమి

---

1. ఆధునిక భాషాశాస్త్రజ్ఞులు పేర్కొనే 'మూలద్రావిడభాష' ఇదేకావచ్చు.

2. కావ్య - నాటకాలలో ఉపయోగించబడేవి అష్ట భాషలని అప్పకవి పేర్కొనడం ఇప్పట్ల స్మరణార్హము - అప్పకవీయము-I-83.

3. రసార్ణవ సుధాకరము — శ్రీ బులుసు వేంకటరమణయ్యగారి అనువాదము - పుటలు 267-69.

# సంపాదకీయం

— డా. బూదరాజు రాధాకృష్ణ

భాషాధ్యయనం నిన్న మొన్నటివరకూ కావ్యభాషను పరిశీలించి వ్యాకరణ గ్రంథాలు రచించటంతో ఆగిపొయ్యేది. ఏవో కొన్ని ప్రమాణాలను నిర్ణయించుకొని వాటికి అనుకూలపడ్డ భాషాలక్షణాలను సూత్రీకరించిన మన లాక్షణికులు ఆ సూత్రాలకు సరిపడని భాషను 'అలాక్షణిక' మని, 'గ్రామ్య' మని, నిరసించేవారు. లక్షణగ్రంథాలు అంగీకరించకపోయినా శిష్టవ్యవహారంలో ఉన్న భాషారూపాన్ని గౌరవించాలనే వాదం పందొమ్మిదో శతాబ్దం ఆరంభంలో తెలుగుదేశంలో వచ్చింది. ఆ కొత్తల్లో కవిప్రయోగాలను గాలించటం, విద్యావంతుల భాషలో కావ్యభాషకు సన్నిహితంగా ఉన్న రూపాలు ఏమున్నాయో క్రోడీకరించటం, జరుగుతుండేది. కాని ప్రజాసామాన్యవ్యవహారంలో ఉన్న భాషాస్వరూపాన్ని గురించి ఎవరూ అంతగా పట్టించుకోలేదు. కావ్యభాషను సరిగా అధ్యయనం చేయనందువల్ల, ఉచ్చరించక పోయినందువల్ల, వ్యవహారభాష ఏర్పడిందనీ దానికొక వ్యవస్థలేదనీ చారిత్రకంగా వ్యవహారభాష అర్వాచీనమనీ దాన్ని అధ్యయనం చేసినందువల్ల కొత్తగా వచ్చే భాషాస్వరూపస్వభావపరిజ్ఞానం ఏమీలేదనీ విశ్వసించటమే అందుకు ప్రధానకారణం.

ఆధునికభాషాశాస్త్రజ్ఞులు బహుభాషాపరిశీలనఫలితంగా, భాషాతత్త్వపరిశోధనద్వారా, పై అభిప్రాయాలు నిజంకావని గ్రహించారు. చారిత్రకంగా ప్రాచీనతరమైన రూపాలెన్నో వ్యవహారంలో నిలిచాయని, కావ్యభాషలో లేని అనేక విశిష్టలక్షణాలు వ్యవహారభాషలో ఉన్నాయని, అది భ్రష్టమూ గ్రామ్యమూ కాక భాషాసహజపరిణామాన్ని నిర్దేశించే రూపభేదమేనని, దానికి వ్యవస్థ లేదనటం అసందర్భమని, అప్రామాణికరూపాలు కావ్యభాషలోకూడా కనిపిస్తాయని, ప్రమాణాల నిర్ణయం సాంఘికస్థితిగతులమీదనేగాని లాక్షణికుల అభిరుచుల మీద ఆధారపడ్డది కాదని, తెలుసుకున్నారు. భాషలో - అది ఏరూపంలో ఉన్నా-అంతర్గతంగా ఉన్న ఏ కారణమూ దానికి అప్రామాణికత్వం తెచ్చిపెట్టదని గుర్తించారు.

తత్ఫలితంగా కుల, మత, వృత్తి, ప్రాంత, భేదాలవల్ల భాషలో వచ్చే మార్పులను శాస్త్రీయంగా పరిశోధించటం ఇటీవల ఆరంభమయింది. రాష్ట్ర వ్యాప్తంగా కొన్ని ముఖ్యవృత్తులవారి వర్గ మాండలికపదాలను (class dialect words) సేకరించటం కొంతవరకు జరిగింది. అయితే, సేకరించిన పదజాలాన్నయినా పూర్తిగా పరిశీలించటం, ఫలితాలను ప్రకటించటం, పెద్దయెత్తున జరగలేదు. ఇప్పటికి జరిగింది చాలదు. పెద్దయెత్తున పరిశోధన జరిపి భాషాసమష్టికి సమగ్రమైన వర్ణనాత్మక వ్యాకరణగ్రంథాలను నిర్మింపజేయగల సాధనసంపత్తిగల మహాసంస్థ తెలుగు అకాడమిని స్థాపించేదాకా ఏర్పడలేదు.

లిఖితవాగ్రూపాల్లో ఉన్న తెలుగుభాషకు సమగ్రవ్యాకరణగ్రంథాన్ని నిర్మింపజేయటం తెలుగు అకాడమి ప్రధానలక్ష్యాల్లో ఒకటి. భిన్నసాంఘిక విద్యాస్థాయులకు చెందిన వ్యవహర్తలు భిన్నప్రాంతాల్లో ఎన్నిరకాల భాషాభేదాలను ఉపయోగిస్తున్నారో వాటన్నిటినీ అకాడమి సేకరిస్తున్నది. భాషలో ఏకత్వ వైవిధ్యాలు ఎంతగా ఉన్నాయో పరిశీలించటానికి సువిచారితమైన ప్రశ్నావళి రూపొందించి భాషాశాస్త్ర నిపుణులు పర్యటించి విషయసేకరణ చేశారు. ఈ సందర్భంలో అవసరమని తోచినంతవరకూ కర్చువెచ్చాలను పరిగణించక టేప్ రికార్డింగ్ కూడా చేశారు. వ్యవహర్తలు చెప్పిన మాటలనూ వాక్యాలనూ ఉచ్చారణ విధేయంగా రాసుకున్న తరవాత పరిశీలన ఆరంభమవుతుంది.

అన్యభాషాప్రాంతాల సరిహద్దులకు దూరంగానో ఆయాప్రాంతాల నడిబొడ్డునో ఉన్న నాలుగుజిల్లాల్లో ఇప్పటికి పర్యటనపరిశోధన పూర్తి అయింది. అవి కరీంనగర్, కడప, విశాఖ, గుంటూరు జిల్లాలు. ఇంతకుముందే తెలంగాణా రాయలసీమప్రాంతాల మధ్యనున్న కరీంనగర్, కడప జిల్లాల్లోని మాండలిక స్వరూపస్వభావాలను స్థూలంగా వివరిస్తూ రెండు చిన్నగ్రంథాల్ని ప్రచురించాం. ఇప్పుడు కళింగాంధ్రలోని విశాఖపట్టణంజిల్లా మాండలికలక్షణాలు స్థూలంగా విశదీకరిస్తూ ఈగ్రంథం ప్రచురిస్తున్నాం. గుంటూరు మాండలికం గురించి యథాక్రమంలో ప్రచురించబోతున్నాం. ఇందులో ఎనభై యెనిమిదిమంది వ్యవహర్తల నుండి సేకరించి ఉచ్చారణవిధేయంగా రాసిన వ్యవహారఖండికల్లో పదిహేడింటిని లఘువ్యాఖ్యలతోసహా ప్రచురిస్తున్నాం. విషయసేకరణ సమయంలో మేముపయోగించిన ప్రశ్నావళి ఆధారంగా లభించిన కొన్ని ముఖ్యవిషయాలనుగురించిన నా వ్యాసాన్ని. విశాఖపట్టణంజిల్లా భాషావిశేషాన్ని గురించి వ్యవహారఖండికలు ఆధా

రంగా అక్కడ పర్యటనపరిశోధన చేసిన శ్రీ ఎ. శ్రీహరిగారు రచించిన మరో వ్యాసాన్ని, కరీంనగర్, విశాఖజిల్లాల భాషలను తులనాత్మకంగా అధ్యయనం చేస్తూ శ్రీ పులిగడ్డ శివానందశర్మగారు రాసిన మరోవ్యాసాన్ని ఇందులో చూడవచ్చు. విశాఖపట్టణంజిల్లా మాండలికంలోని కొన్ని ప్రత్యేకతలను సూచన ప్రాయంగా వివరించటమే ప్రస్తుతకర్తవ్యం. ఈ భాషాభేదానికి ఒక సంక్షిప్త వర్ణనాత్మక వ్యాసాన్ని కొన్ని మాసాల్లో ప్రకటిస్తాం.

ఈ ప్రయత్నంలోని ప్రధానోద్దేశాలు నాలుగు. వాటిలో మొదటిది, తెలుగుభాషలోని ప్రాంతీయ, సాంఘిక, భేదాలను సాధ్యమయినంత విపులంగా సేకరించి గ్రంథస్థంచేయటం; రెండోది, స్థానికంగా భిన్నవిధాలుగా ఉన్న భాషా ప్రమాణాలు రాష్ట్రవ్యాప్తమైన ప్రామాణికభాషగా పొందుతున్న నిరంతరపరిణామక్రమాన్ని నిరూపించటం; మూడోది, వాగ్రూపంలో ఉన్న భాషకూ లిఖిత రూపంలోని భాషకూ ఎటువంటి అన్యోన్యసంబంధముందో నిర్ణయించటం; నాలుగోది, లిఖితవాగ్రూపాలు రెంటిలోనూ ఉన్న ఆధునిక ప్రామాణికభాషకు సమగ్రమైన వర్ణనాత్మకవ్యాకరణాన్ని ఆధునికపద్ధతుల్లో రచించటం. ఈ ఉద్దేశాల మేరకు ప్రచురిస్తున్న ఈపత్రిక తెలుగులో భాషావిషయకంగాఉన్న వైవిధ్యంలోని ఏకత్వాన్ని, ప్రమాణీకరణంలో భాషాసాంఘికవ్యవస్థలకున్న పరస్పరసంబంధాన్ని, స్థూలంగా నిరూపించటంతోబాటు ఆధునికరచయితలకు పనికివచ్చే పాత్రోచిత భాషాభేదాలనుగూడా సంతరిస్తుంది.

విశాఖపట్టణం జిల్లాలో భాషావిషయ సేకరణ చేసినవారు శ్రీ ఎ. శ్రీహరి గారు. ఆజిల్లా భౌగోళికస్వరూపాన్ని నిర్దేశిస్తూ రేఖాపటం గీసినవారు శ్రీ పి. సి. నరసింహారెడ్డిగారు. వీరికి మా ప్రత్యేకకృతజ్ఞతలు. మాయీప్రయత్నసాఫల్యానికి తోడ్పడ్డ ఆయావ్యవహర్తలకూ, నీటుగా ముద్రించి ఇచ్చిన శ్రీ జ్యోతి ప్రెస్, హైదరాబాద్, వారికి మా ప్రత్యేక కృతజ్ఞతలు.

ఈపత్రికలో కొన్ని మార్పులు చేయవలసివచ్చింది. తొలి ప్రచురణలో వ్యవహారఖండికలను ఉచ్చారణవిధేయంగా తెలుగులిపిలో ముద్రించటంలో కొన్ని ప్రత్యేకచిహ్నాలను ఉపయోగించవలసి వచ్చింది. త్వరత్వరగా అప్రయత్నంగా వ్యవహర్తలు మాట్లాడినప్పుడు ఏయే సూక్ష్మోచ్చారణభేదాలు వినిపించాయో వీలయినంత విపులంగా ప్రదర్శిద్దామని అప్పట్లో భావించాం. నిజానికి అనేక సూక్ష్మభేదాలను అప్పుడుకూడా ప్రదర్శించలేదు. కానీ ఆఖండికలను చదవ

టంలో పాఠకలోకానికి కలిగే ప్రయాసను, సౌలభ్యరాహిత్యాన్ని, అప్పుడు మేమంతగా గమనించలేదు. ధ్వనివిధేయలేఖనం (phonetic writing) కన్నా వర్ణవిధేయలేఖనమే (phonemic writing) పఠనసౌలభ్యానికి తోడ్పడుతుందనే దృష్టితో ఈమారు వ్యవహారఖండికలను వర్ణవిధేయతకు దాపులో ఉండే విధంగా ముద్రిస్తున్నాం. వ్యాసాల్లో, వ్యాకరణరచనల్లో ఆయాసూక్ష్మభేదాలను గుర్తించవచ్చు కాబట్టి ప్రస్తుతావసరానికి ఈమార్పు చాలునని భావిస్తున్నాం.

ఈరకం పరిశోధనపత్రిక లన్నింటిలో లాగానే ఇందులోనూ వ్యవహర్తల పేర్లను ఉద్దేశపూర్వకంగానే బయటపెట్టలేదు. వ్యవహారఖండికల్లోని అభిప్రాయాలతో భావాలతో అకాడమీకి ఏలాటి సంబంధమూలేదు; వాటి బాధ్యత ఆయా వ్యవహర్తలదే.

కేంద్రప్రభుత్వం సహాయంచేసి నెలకొల్పిన రాష్ట్రభాషాసంస్థల్లో ఇప్పటి వరకూ తెలుగుఅకాడమి తప్ప మరేదీ ఇంత విస్తృతప్రణాళికతో భాషా పరిశీలన ఆరంభించలేదు. మాకున్నా ఇది తొలి ప్రయత్నం. ఇకముందు ఇతోధికసుందరంగా శాస్త్రీయంగా ఈ మహాప్రయత్నాన్ని నెరవేర్చగలమని ఆశిస్తున్నాం. భాషాభిమానులు మాకు తగినంత ప్రోత్సాహమిస్తారని విశ్వసిస్తున్నాం.

# విషయసూచిక

# ముఖ్య సవరణలు

| పేజీ | పంక్తి | తప్పు | సవరణ |
|---|---|---|---|
| 1 | 13 | వ్రహించే | ప్రవహించే |
| 9 | 5 | అంధ్రవ్రదేశ్ | ఆంధ్రప్రదేశ్ |
| | 9 | వ్రధాన | ప్రధాన |
| | 16 | సమంగా | సమగ్రంగా |
| 10 | 18 | చకారోచ్చారణ | చకారోచ్చారణ |
| | 22 | కొద్ధి | కొద్ది |
| | 30 | శబ్ధానికి | శబ్దానికి |
| 11 | 26 | శబ్ధాన్ని | శబ్దాన్ని |
| 12 | 10 | దంత | దంత్య |
| 13 | 33 | భవిష్యద్ధర్ధకం | భవిష్యదర్థకం |
| | 35 | ధ్వనిని | ధ్వనికి |
| 15 | 2 | బాషనుంచి | భాషనుంచి |
| 52 | 3 | వస్తది | వస్తుంది |
| | 4 | వుంటది | వుంటుంది |
| 60 | 11 | ఆపాదిస్తున్నాయని | ఆపాదిస్తున్నారని |
| 74 | 23 | 'వ'కార | 'ద'కార |
| 79 | 7 | వష్టేతర | శిష్టేతర |
| 103 | 27 | పాటంచిన | పాటించిన |
| 104 | 22 | ఒస్తుంది | ఒస్తంది |
| 111 | 2 | 'ప', 'ప'లు | 'ప', 'ప'లు |
| 120 | 25 | సం→చ | స→చ |
| 121 | 8 | కోల్పోయింది | కోల్పోయి |
| | 10 | విశేషంగా కనిపించేది | విశేషం |
| 133 | 30 | 'న' ప్రత్యయాన్ని | 'ఇన' ప్రత్యయాన్ని |
| 159 | 27 | ప్రభావం | ప్రభావాన్ని |

# 1

# విశాఖపట్టణం జిల్లా

ఉత్తర అక్షాంశం 17° 10′ నుంచి 18° 25′ వరకు, తూర్పు రేఖాంశం 81° 50′ నుంచి 83° 55′ వరకు 13, 403 చదరపు కిలోమీటర్లు విస్తరించిన విశాఖ పట్టణం జిల్లా జనసంఖ్య 1971 లెక్కల ప్రకారం 27, 91, 000. జిల్లా వైశాల్యంలో ఇంచు మించు 29 శాతం అరణ్యాలే. జన సాంద్రత చదరపు కిలోమీటరుకు 203. జిల్లామొత్తాన్ని రెండు సహజభాగాలుగా విభజిస్తూ తూర్పుకనుమలు నైరృతి - ఈశాన్యాలుగా వ్యాపించి వున్నాయి. ఈ కొండల సగటు ఎత్తు 900 మీటర్లు. శృంగవరపు కోట తాలూకాలోని శంకరం శిఖరం ఎత్తు సుమారు 1590 మీటర్లు. గూడెం తాలూకాలోని మాడుగుల (మధుగుల) కొండల్లో మాచ్ ఖండ్ నది పుట్టున్నది. శృంగవరపు కోట, విజయనగరం, భీమునిపట్నం తాలూకాల ద్వారా ప్రవహిస్తున్న చంపావతి, మాడుగుల కొండల్లో పుట్టి వీరవల్లి, అనకాపల్లి, సర్వసిద్ధి తాలూకాల ద్వారా ప్రవహించే శారద, గోలుగొండ కొండల్లో పుట్టి సర్వసిద్ధి తాలూకాలో ప్రవహించే వరాహా, ఈ జిల్లాలోని ముఖ్యనదులు.

ఈ జిల్లా రాజకీయపాలన కోసం విజయనగరం, విశాఖపట్టణం, నర్సీపట్నం అనే మూడు రెవిన్యూ డివిజన్లుగా తొమ్మిది తాలూకాలుగా విభక్త మయింది. విజయనగరం డివిజన్‌లో విజయనగరం, శృంగవరపుకోట, వీరవల్లి (ముఖ్యపట్టణం చోడవరం) తాలూకాలు, విశాఖ డివిజన్లో విశాఖపట్నం, అనకాపల్లి, భీమునిపట్నం (భీమ్లీ) తాలూకాలు, నర్సీపట్నం డివిజన్లో నర్సీపట్నం, గూడెం (ముఖ్యపట్టణం చింతలపల్లి), సర్వసిద్ధి (ఎలమంచిలి ముఖ్యపట్టణం) తాలూకాలు చేరివున్నాయి.

ఈ జిల్లాలో సుమారు 1766 కిలో మీటర్ల రోడ్డుమార్గం ఉంది; అందులో సగభాగం జాతీయ రహదారి. 204 కిలోమీటర్ల పొడవైన బ్రాడ్ గేజ్ రైలు మార్గంకూడా ఉంది. చిన్నా పెద్దా పరిశ్రమలు 261 దాకా ఉన్నాయి. తలసరి బేంక్ డిపాజిట్లు రు 54లు. అంటే హైదరాబాద్ జిల్లా తరవాత ఇదే రాష్ట్రం మొత్తంలో అత్యంత ధనవంతమైన జిల్లా. అయితే ఈ ఐశ్వర్యానికి సామాన్య ప్రజల సంపాదనగాక భారీ పరిశ్రమలే కారణం. ఈ జిల్లాలో నాలుగే పురపాలక సంఘాలున్నాయి. 1961 లెక్కల ప్రకారం వాటి జనసంఖ్య : విశాఖపట్టణం : 1,81,683; విజయనగరం: 76,903; అనకాపల్లి: 46,408; భీమునిపట్నం: 9,871. పట్టణాల్లో నూటికి 18 మంది మాత్రమే నివసిస్తున్నారు. అక్షరాస్యత 1961 లెక్కల ప్రకారం పురుషుల్లో 24.73 శాతం; స్త్రీలలో 9.01 శాతం; మొత్తం

16.85 శాతం. 1971 లెక్కల ప్రకారం మొత్తం అక్షరాస్యత 21.3 శాతానికి పెరిగింది. 1 విశ్వవిద్యాలయమూ, 12 కళాశాలలూ ఉన్నాయి.

అత్యంత ప్రాచీనకాలంలోనూ అత్యాధునిక కాలంలోనూ తప్ప ఈ జిల్లాకు చరిత్ర ప్రసిద్ధిలేదు. బహుప్రాచీనకాలంలో ఇది కళింగరాజ్యంలో భాగంగా ఉండేది. అనకాపల్లికి రెండున్నర కిలోమీటర్ల దూరంలోని 'శంకరం' గ్రామం దగ్గరి బొజ్జన్నకొండలో బౌద్ధుల ఆరామగుహాలయాలున్నాయి. విజయనగ రానికి సుమారు 12, 13 కిలోమీటర్ల దూరంలో ఉన్న రామతీర్థం జైనబౌద్ధ క్షేత్రం. ఈ జిల్లా శాతవాహన సామ్రాజ్యంలో భాగంగా ఉండేది. తరవాత మాఠర, వాసిష్ఠీ, విష్ణుకుండిన వంశాల పరిపాలనలో ఉండి క్రీ. శ. 5 వ శతాబ్ది చివర తూర్పుగాంగరాజుల వశమయింది. తూర్పుచాళుక్యుల శాసనాల్లో సర్వసిద్ధి తాలూకాలోని ఎలమంచిలికి 4 కిలోమీటర్ల దూరంలో ఉన్న 'దిమిల' పెద్ద ఓడరేవుగా ఉండేది.

అనంతవర్మ చోడగంగు అనే గాంగరాజు (1078-1150) కాలంలో మొదటి కుళోత్తుంగ చోళుడు రెండుసార్లు దండయాత్ర చేశాడు. 1213లో కాకతి గణపతిదేవుడు కోస్తాప్రాంతంమీద దండెత్తినప్పుడు నేటి ఒరిస్సారాష్ట్రం లోని గంజాం జిల్లాలోని ఆస్కావరకున్న ప్రాంతాన్ని జయించాడుగాని సింహాచలానికి ఉత్తరాన కాకతీయుల అధికారం నామమాత్రంగానే ఉండేది. గాంగ రాజులకాలంలో ఈ ప్రాంతం అనేక సామంతరాజ్యాలుగా విడివడి ఉండేది. కొండ వీటిరాజు అనవేమారెడ్డి 1372 లో ఈ ప్రాంతానికి తన రాజ్యాన్ని విస్తరించాడు. కొండవీడు రాజ్యం పతనంకాగానే ఈ జిల్లా గజపతి రాజుల పాలన కిందికి వచ్చింది. 1515లో శ్రీకృష్ణదేవరాయలు గజపతులమీద దండయాత్ర చేస్తూ పొట్నూరులో విజయస్తంభం ఎత్తించాడు. కృష్ణరాయల అనంతరం ఈ ప్రాంతలో గజపతుల పాలన పునరుద్ధరణకు వచ్చింది అయితే ఈ స్థితి కొద్దికాలం లోనే మారిపోయింది. 1568 లో గోల్కొండ నవాబులు దండెత్తి ఆక్రమించి విశాఖజిల్లాను శ్రీకాకుళం సర్కారులో కలిపివేశారు. అనకాపల్లిలో వాళ్ళ ఫౌజ్దార్ కార్యాలయం ఉండేది.

ఈ కాలంలోనే డచ్చి, ఇంగ్లీషు, ఫ్రెంచి వ్యాపారస్థులు ఈ ప్రాంతానికి రావడం మొదలయింది. 1628 లో డచ్చివాళ్ళు ఒక కర్మాగారం స్థాపించి కోట కట్టుకున్నారు. 1682 అక్టోబరులో తూర్పుఇండియా కంపెనీవాళ్ళు విశాఖలోని కొంత ప్రాంతాన్ని కౌలుకు తీసుకున్నారు; 1685లో కర్మాగారం స్థాపించారు. 1721-1824 మధ్యకాలంలో డచ్చివారికీ ఇగ్లీషువారికీ జరిగిన సంగ్రామంలో భీమ్లీ చాలాసార్లు చేతులుమారింది. 1824 మార్చి నెలలో జరిగిన ఒడంబడిక ప్రకారం భీమ్లీ ఇంగ్లీషువారి పరమయింది. 1936 లో విశాఖ విభజన జరిగింది. 1950 లో విశాఖపట్టణంజిల్లాను పునర్విభజించి శ్రీకాకుళంజిల్లాను ప్రత్యేకంగా ఏర్పాటుచేశారు.

అతి ప్రాచీనకాలంలో అత్యాధునిక కాలంలోనూ తప్ప ఈ జిల్లా ఏదో ఒక గొడుగుకింద ఎక్కువకాలం రాజకీయ సుస్థిరత్వంలో లేదు. పయిగా నైసర్గికంగా జిల్లా రెండుభాగాలుగా ఉంటుంది. తెలుగు రాజ్యాల్లో భాగంగా ఎక్కువకాలం లేదు. అందువల్ల విశాఖ శ్రీకాకుళంజిల్లాల భాషావిశేషం ప్రత్యేక ప్రాంతీయ మాండలికత్వం సంపాదించింది.

# 2

# విషయ సేకరణ : ప్రచురణ

విశాఖపట్టణం జిల్లా వ్యవహారంలోని భాషాస్వరూప స్వభావాలను గుర్తించటానికి ఇంతకుముందు లాగానే ఒక పరిశోధన ప్రణాళికను ఉపయోగించాం. తెలుగుభాషలో భౌగోళిక సామాజిక విద్యాదిభేదాలవల్ల మరోవిధంగా వినిపిస్తాయని భావించిన పదజాలాన్ని, ఉచ్చారణత్వరవల్ల భాషలో వచ్చే మార్పులను సూచిస్తాయని ఊహించిన కొన్ని పదాలనూ వాక్యాలనూ, క్రియాపద స్వరూపాదుల్లో భేదాలు వినిపిస్తాయని ఆశించిన కొన్ని ఆరోపాలను, పరిశోధన ప్రణాళికలో చేర్చాం. వ్యవహర్తలతో సంభాషిస్తూ పర్యటన పరిశోధకులు ఆ యా విషయాలను సేకరించి ఉచ్చారణవిధేయంగా రాసుకుంటారు. మొదటి ప్రణాళికను అనంతపురం జిల్లా తాడిపత్రి గ్రామంలో భిన్నవ్యవహర్తలను తొలిసారి కలిసినప్పుడు ఉపయోగించాం. ఆ అనుభవంవల్ల కొన్ని మార్పులూ చేర్పులూ చేసి ప్రణాళికను పునారచించి కరీంనగర్, కడప, విశాఖ జిల్లాల పర్యటనలో ఉపయోగించాం. ఆ యా వ్యవహర్తలు త్వరత్వరగా అప్రయత్నంగా అనేక విషయాల మీద ప్రసంగించగా ఆ యా వ్యవహార ఖండికలను టేప్ రికార్డ్ చేసి ఉచ్చారణానుగుణంగా రాసుకున్నాం.

వ్యవహర్తల ఎన్నికలో కొన్ని నిశ్చిత నియమాలు పాటించాం. జిల్లాలోని ప్రతి తాలూకానుంచీ ప్రతి ప్రధాన నగరంనుంచీ వాళ్ళను ఎన్నుకోవాలి. ఆ వ్యక్తి ఆ పట్టణంలోనే పుట్టి పెరిగి ఉండాలి. భిన్న వ్యవహర్తలు భిన్న కులాలకు, వృత్తులకు, వయస్సులకు, సాంఘిక స్థితిగతులకు, విద్యాస్థాయులకు చెందిన వాళ్లు కావాలి. రకరకాల అభిరుచులున్న భిన్నవ్యక్తులు కావాలి. ఈ లక్షణాలున్న వ్యవహర్తలను పది విధాలుగా విభజించి, ప్రతి కేంద్రంలోనూ సాధ్యమయినంత వరకు అన్నిరకాల వ్యక్తులనూ కలుసుకొని వారి సంభాషణలను ప్రసంగాలనూ రాసుకోవటంతోబాటు టేప్ రికార్డింగ్ కూడా చేశాం.

భాషాప్రామాణ్య నిర్ధారణకు ముఖ్యంగా తోడ్పడే విద్యా సాంఘిక సంబంధాలను ప్రమాణంగా తీసుకొని వ్యవహర్తలను మూడు తరగతులుగా విభజించాం :

*మొదటి తరగతి* వాళ్లు విద్యాధికులు, అత్యంత సాంఘిక సంబంధాలున్న వాళ్లు : 1. రచయిత(/ త్రు)లు, 2. ఉపాధ్యాయులు, 3. వృత్తి విద్యలవారు (వైద్యులు, న్యాయవాదులు, సాంకేతిక నిపుణులు, మొ.)

*రెండో తరగతికి* చెందినవాళ్లు విద్యావంతులు గాని, విద్యార్జనపరులు గాని కావచ్చు. సామాజిక విద్యావిషయక ప్రభావాలకూ సంబంధాలకూ నిరంతరం లోనయ్యేవాళ్లు: 1. ఉద్యోగులు 2. విద్యార్థులు 3. రాజకీయ కార్యకర్తలు 4. వ్యాపారస్థులు.

*మూడో తరగతిలో* అత్యల్ప విద్యా సాంఘిక సంబంధా లున్నవాళ్ళు చేర్తారు: 1. కార్మికులు 2. రైతులు 3. కులవృత్తులవాళ్ళు, మొ.

ముఖ్య వ్యవహర్తలనుంచి (విద్యావంతులనుంచి) మా ప్రణాళికలోని పదాల, వాక్యాల, క్రియారూపాల ఉచ్చారణతోబాటు ప్రసంగ పాఠాలనుగూడా సేకరించాం. ఇతరులనుంచి వ్యవహారఖండికలను మాత్రమే రికార్డ్ చేశాం. ఈ ఖండికలు కథల రూపంలో, జీవితానుభవాల రూపంలో, అభిప్రాయ ప్రకటనల రూపంలో, విషయ వివరణాద్యనేక రూపాల్లో ఉండవచ్చు. వాటిలో కొన్నిటిని మాత్రమే ప్రచురిస్తున్నాం.

విషయ సేకరణ ప్రణాళికలోని ప్రధాన విషయా లివి:

*ధ్వని విభాగంలో* ఉచ్చారణలోని సూక్ష్మభేదాలను గుర్తించటానికి తోడ్పడే కనిష్ఠ భేదకాంశాలున్న జంటపదాలు కొన్ని ఉన్నాయి. ఆ యా ధ్వనులు పదాది, పదమధ్య, పదాంతాల్లో ఏ యే సూక్ష్మభేదాలను సూచిస్తాయో వీటివల్ల తెలుస్తుంది. పదబంధ భాగాలుగా వాక్యగతంగా ఆ యా ధ్వనుల ఉచ్చారణలో వచ్చే చిన్న చిన్న మార్పులను గుర్తించటానికి ఆ యా ధ్వనులున్న పదాలతో కూర్చిన ఒక రచనకూడా ఉంది. దాన్ని వ్యవహర్త త్వరత్వరగా చదివేటప్పుడు రికార్డ్ చేస్తాం.

*పద విభాగంలో* విభక్తులు చేరినప్పుడు నామక్రియాపదాల్లో కన్పించే భిన్నరూపాలను, ప్రకృతి ప్రత్యయాల్లో పదమధ్య సంధివల్ల వచ్చే మార్పులను, గుర్తించటానికి వీలుంది. ఇందులో ఎన్నికచేసిన ఇరవై క్రియల రూపభేదాలను సేకరించే ఏర్పాటుంది.

*సంధి విభాగంలో* ఆ యా ప్రాంతాలవారు భిన్నార్థాల్లో ఏ యే విభక్తి ప్రత్యయాలనూ అనుబంధాలనూ చేరుస్తారో, భిన్నహల్సంయోగంవల్ల ఎన్నెన్ని రూపా లేర్పడతాయో గుర్తించటానికి వీలుగా కొన్ని వాక్యాలున్నాయి. వీటిని త్వరితోచ్చారణలో వ్యవహర్త ఏ యే మార్పులతో పలుకుతాడో గుర్తిస్తాం; రికార్డ్ చేస్తాం.

ఇవిగాక సంఖ్యావాచకాలు వ్యస్తంగాను సమస్తంగాను ఏ ప్రాంతీయ భేదాలతో వ్యవహృత మౌతాయో గమనించటానికి, బంధుత్వ బోధకాలవంటి ప్రాథమిక శబ్దాల వాడుకలోని భేదాలను గుర్తించటానికి, ప్రణాళికలో ఏర్పాట్లున్నాయి.

ఈ ప్రణాళిక ఆధారంగా శ్రీ ఎ. శ్రీహరిగా రొక్కరే పర్యటనపరిశోధన చేసి విశాఖపట్టణం జిల్లాలోని పది కేంద్రాలనుంచి 88 మంది (ముఖ్యవ్యవహర్తలు 78 మంది + 10 మంది అనుబంధ వ్యవహర్తలు) వ్యవహర్తలనుంచి భాషా

రూపాలను సేకరించారు. పదకొండో కేంద్రం కొత్త వలసలో టేప్ రికార్డింగ్ మాత్రమే చేశారు. వివరాలు కింది పట్టికలో చూడవచ్చు :

| కేంద్రం పేరు | ముఖ్య వ్యవహర్తల సంఖ్య | అనుబంధ వ్యవహర్తల సంఖ్య | ప్రచురిత వ్యవహార ఖండికల సంఖ్య |
|---|---|---|---|
| విజయనగరం | 9 | 2 | 3 |
| భీమునిపట్నం | 8 | — | — |
| విశాఖపట్టణం | 10 | — | 4 |
| అనకాపల్లి | 7 | — | 2 |
| నర్సీపట్నం | 8 | 3 | 2 |
| మాడుగుల | 7 | 1 | 2 |
| శృంగవరపుకోట | 7 | 3 | — |
| ఎలమంచిలి | 8 | — | — |
| చోడవరం | 8 | 1 | 4 |
| అరకు | 5 | 1 | — |

ఈ పరిశోధన పత్రికలో ప్రచురిస్తున్న పదిహేడు వ్యవహార ఖండికలనూ ఏ యే తరగతులకు చెందిన వ్యవహర్తలనుంచి సేకరించామో వారికి సంబంధించిన ముఖ్య వివరాలను (పేర్లు మినహాగా) కింది పట్టికలో చూడవచ్చు.

| కేంద్రం పేరు | ప్రధాన వృత్తి/ తరగతి | కులం | వయస్సు | చదువు |
|---|---|---|---|---|
| విజయనగరం | (గ్రామీణ) విద్యార్థి | తెలగ | 22 | బి. ఏ. (3) |
| ,, | రాజకీయ కార్యకర్త | క్షత్రియ | 45 | మెట్రిక్ |
| ,, | రైతు | నాగవంశం | 50 | 5 |
| విశాఖపట్టణం | వ్యాపారస్థుడు | వైశ్య | 25 | 8 |
| ,, | ఉపన్యాసకుడు | తెలగ | 28 | ఎం. ఏ; ఎల్. ఎల్. బి. |
| ,, | రచయిత | వైశ్య | 39 | బి. ఏ., బి. ఎల్. |
| ,, | కార్మికుడు | హరిజన్ | 50 | — |
| అనకాపల్లి | పెద్ద వ్యాపారస్థుడు | వైశ్య | 40 | బి. కాం., బి. ఎల్. |
| ,, | ఉద్యోగి | బ్రాహ్మణ | 35 | ఎస్. ఎల్. సి. |
| నర్సీపట్నం | ఉపాధ్యాయుడు | శిష్టుకరణం | 47 | బి. ఏ., బి. ఇడి. |
| ,, | పాలమ్మకం | గొల్ల | 70 | — |
| మాడుగుల | ఉద్యోగి | కాపు | 27 | పి. యూ. సి. |
| ,, | రైతు, చిన్న వ్యాపారం | వెలమ | 30 | 10 |
| చోడవరం | (గ్రామీణ) విద్యార్థి | కాపు | 17 | ఇంటర్ II |
| ,, | ఉద్యోగి | హరిజన్ | 24 | 12 |
| ,, | విద్యార్థిని | బ్రాహ్మణ | 19 | బి. ఎ. I |
| ,, | మేస్త్రి | కాపు | 27 | — |

# 3

# విశాఖ మాండలిక భాష

— డా. బూదరాజు రాధాకృష్ణ

వృత్తి పదాలను సేకరించి మాండలిక వృత్తిపదకోశం నిర్మించినప్పుడు ఆంధ్రప్రదేశ్‌లోని తెలుగు భాషకు ప్రధానంగా నాలుగు ప్రాంతీయ మాండలిక రూపాలున్నాయని స్థూలంగా తెలిసింది. తెలంగాణా, రాయలసీమ, కోస్తా లనే మూడు ప్రధాన ప్రాంతీయ మాండలికాలే కాక కళింగాంధ్ర మనే మరో మాండలికం విశిష్టలక్షణాలతో ఉందని బయటపడ్డది. ఒరియా భాషా ప్రభావ మొకటి, అధికకాలం ఆంధ్రేతరుల పాలనలో ఉండట మొకటి, ప్రధానకారణాలుగా ఈ ప్రాంతీయ మాండలికం ప్రత్యేకలక్షణాలు సంతరించుకోవటం జరిగింది. అయితే శ్రీకాకుళం, విశాఖపట్టణం జిల్లాలతో కూడిన కళింగాంధ్రలోని వ్యవహారపద్ధతులు కొన్ని రాయలసీమ మాండలిక లక్షణాలను, కొన్ని తెలంగాణా మాండలికలక్షణాలను ప్రతిబింబిస్తాయి; కాని ఇతర తీరాంధ్ర లక్షణాలు ఎక్కువగానే కనిపిస్తుంటాయి.

ఈ ప్రాంతీయ మాండలిక లక్షణాలను విపులంగా పరిశీలించి, ఈ రెండు జిల్లాల భాషాభేదాలను సమంగా వివరిస్తూ వర్ణనాత్మక వ్యాకరణం రాయాలనే సంకల్పంతో మొదట విశాఖజిల్లా భాషా రూపాలను కొందరు ప్రతినిధి వ్యవహర్తలతో సంభాషించి, వారి ప్రసంగాలను టేప్ రికార్డ్ చేసి, సేకరించాం. ఈ విధానాన్ని, పరిశోధన ప్రణాళికను, ఇంతకు ముందే స్థూలంగా వివరించాం. ప్రణాళిక ద్వారా సేకరించిన విశేషాల్లో కొన్నిటిని మాత్రం స్థాలీపులాక న్యాయంతో ఇక్కడ చర్చిద్దాం. ఈ చర్చద్వారా విశాఖమండల వ్యవహారంలోని ముఖ్య విశేషాలు కొన్ని నిరూపించవచ్చు.

సాధారణంగా ఏ భాషాప్రాంతంలో నయినా అక్కడి విద్యావంతుల భాషాభేదమే ప్రామాణిక రూపంగా పరిగణింపబడుతుంది. అయితే కులాన్ని బట్టి, స్థలాన్నిబట్టి వృత్తినిబట్టి, వయస్సునుబట్టి, కాలాన్నిబట్టి అనేక విధాలయిన రూపభేదాలు ఆ ప్రామాణికంలో కనిపిస్తుంటాయి. కనిపించే వినిపించే భేదాలన్నీ ముఖ్యంకావు; వాటిలో ఏకత్వం ఎక్కువ పాళ్ళలో ఉంటుంది. భౌగోళిక దూరాలనుబట్టి కొన్ని రకాల పలుకుబళ్లు భిన్నప్రాంతాల్లో భిన్నవిధాలుగా ఉంటాయి; వాటిలో గూడా సామ్యం లేక పోలేదు. కాని విభిన్న రాజకీయ చారిత్రక కారణాలవల్ల రాకపోకలు, ఆదానప్రదానాలు తక్కువైతే భేదాలు ఎక్కువగా

ఉంటాయి. వార్తా సౌకర్యాలు తక్కువగా ఉన్నచోట్ల అనేకస్థానిక మాండలికాలు (Local dialects) ఏర్పడతాయి. నూటికి నూరు పాళ్లు విద్యావంతులూ వార్తా సౌకర్యాలూ ఉన్న ఆదర్శరాజ్యంలోకూడా స్థానిక మాండలికాలు, ప్రాంతీయ మాండలికాలు, వర్గమాండలికాలు ఉండకపోవు గాని అక్కడ రాష్ట్ర వ్యాప్తమైన ప్రామాణిక భాషారూప మొకటి ఏర్పడి బోధనమాధ్యంగా పరిపాలన మాధ్యంగా పరిణమిస్తుంది. ప్రామాణిక భాష ఏర్పడటానికి సాంఘిక రాజకీయ చారిత్రక కారణాలే ప్రధాన సాధనాలు. విద్యావంతుల భాషకే ఈ గౌరవసంపాదనకు అవకాశం ఎక్కువ. తక్కిన ప్రజలు విద్యార్జనద్వారా, విద్యావంతులను ఉచ్చారణలో, పదబంధకల్పనలో, వాక్యనిర్మాణంలో అనుకరించి అనుసరించటం ద్వారా భాషలో ఐక్యాన్ని సాధించుకుంటారు. అందువల్ల విద్యావంతుల భాషను మొదట పరిశీలించి కొన్ని కొన్ని రూపాలద్వారా వారి వ్యవహార లక్షణాలను నిర్దేశించటం మంచిది. మొదటి పట్టికలోని 16 పదాలను ముందు చూద్దాం.

మొదటి రెండు శబ్దాలనూ పోల్చి చూస్తే పదాది చకారం రెండు రకాలుగా ఉచ్చరిత మవుతున్నట్లు తెలుస్తుంది. తరవాతి అచ్చు తాలవ్యమైతే తాలవ్యంగాను, తాలవ్యేతరమైతే దంతమూలీయంగాను. మన సంప్రదాయ వ్యాకరణాల లెక్కలో చకారం దంత్యమేగాని దంతమూలీయం కాదు. చకారోచ్చారణ తీరాంధ్రంలోనే ఎక్కువ. కొన్ని మాటల్లో దంతమూలీయ తాలవ్యోచ్చారణలు పర్యాయ ప్రవృత్తిలో ఉంటాయి. ఉదా : పచ్చడి : పచ్చడి; రాజు : రాజు, మొ. తెలంగాణాలో, రాయలసీమలో ఈ దంతమూలీయోచ్చారణ ఎక్కడో గాని వినిపించదు. ఆధునిక ప్రచార సాధనాల ప్రభావంవల్ల కొద్దిమంది వాడుకలో ఈ ఉచ్చారణభేదం ఇతరప్రాంతాల్లో కూడా వాడుకలోకి వస్తున్నది. పై రెండు శబ్దాల్లోనూ కనిపించే మరో ప్రత్యేకత పదాంత పదమధ్య మకారం 'వఁ' గా - అంటే ఆనునాసిక్యంతో కూడిన వకార ధ్వనిగా ఉచ్చరింపబడటం. ఈ పర్యాయ రూపత పాక్షికం, అనియతం. 'దేవ' శబ్ద సమమైన రూపాలు 'దేముడు, దేవుఁడు' అని వాడుకలో ఉన్నాయి; ఇక్కడ మూల వకారం మకారంగా వఁకారంగా ఉచ్చరిత మవుతున్నది. 'మామ' అనేది 'మాఁవఁ'గా నిత్యోచ్చారణలో వినిపిస్తుంది; ఇక్కడ మూల మకారం 'వఁ'కారంగా వాడుకలో ఉంది. కాని, 'సమయ' శబ్దానికి *'సవఁయ' మనే ఉచ్చారణగాని, '*బావ' శబ్దానికి '*బామ, *బాఁవఁ' అనే ఉచ్చారణగాని వినిపించవు. అంటే 'వ, వఁ, మ' లకు మారుపాటు అనియతంగా వికల్పంగా భాషలో ఉందనాలి. ఈ పర్యాయ ప్రవృత్తి తెలంగాణా రాయలసీమల వ్యవహారంలో చాలా తక్కువ; కోస్తావాడుకలో కళింగాంధ్రంలో చాలా ఎక్కువ.

'అర్థ'శబ్దరూపాంతరాల విషయంలో రెండు మూడు ప్రత్యేకతలున్నాయి. మొదటిది నేటి వాడుకలో-విద్యావంతుల వాడుకలో కూడా- 'థ' కారం ప్రత్యేకవర్ణత్వం కోల్పోయి 'ధ' కారంతో మేళనం పొందటం. ఇది కోస్తా

వాడుకలో తెలంగాణా వ్యవహారంలో అధికాధికంగా వినవచ్చే లక్షణం. రాయల సీమలో ఇంకా కొందరు విద్యావంతుల వాడుకలో 'థ, ధ' లు ప్రత్యేకవర్ణాలుగానే ఉన్నాయి. సంస్కృతభాషా పరిచయాధిక్యం ఉన్నవారిలో రాష్ట్రవ్యాప్తంగా థకారోచ్చారణ వినిపిస్తుందిగాని అది నియతంకాదు. రెండో విలక్షణత పదాంత మకారం వఁకారంగా మారటం. మూడోది చోడవరం వాడుకలో రేఫకు బదులు అకార వినించటం. స్పష్టంగా నొక్కిచెప్పే ప్రయత్నంలో (ముఖ్యంగా నాట కాల్లో) శకటరేఫ ఇంకా వినిపిస్తూనే ఉందిగాని అర్థభేదకమై ప్రత్యేకవర్ణంగా ఇది ఇప్పటి భాషా వ్యవహారంలో లేనేలేదు. నాలుగో విశేషం మహాప్రాణత్వం (ఒత్తు) నర్సీపట్నం వ్యవహర్త భాషలో పాక్షికంగా లోపించటం. శిష్టశిష్టేతర భాషాభేదాలు విశదీకరించే ప్రధానలక్షణాల్లో మహాప్రాణోచ్చారణ మొట్టమొద టిది. విద్యావంతుడైన ఒక బ్రాహ్మణ వ్యవహర్త వాడుకలో ఒత్తులు సరిగా పలకటం లేదంటే ఇది ఎంతో కష్టసాధ్యమైన ఉచ్చారణప్రయత్నమని చెప్పాలి.

కావ్యభాషలో 'ముత్తియము / ముత్తెము' అనే రెండు శబ్దరూపా లున్నాయి. వాటిలో మొదటిది ప్రాచీనతరం. చివరి- ము అమహదేకవచనప్రత్య యం. ముత్తియ- వరకు ప్రాతిపదిక. దాని చివరి '-ఇయ' కాలక్రమాన '-ఎ'గా మారింది; 'ముత్తెము' ఏర్పడింది. 'ఇ,ఎ' అనే అచ్చులు, యకారమనే హల్లు- ఈ మూడూ తాలవ్యధ్వనులు. వీటి ముందున్న తకారం దంత్యధ్వని. తాలవ్య ధ్వనుల ప్రభావంవల్ల దంత్యతకారం తాలవ్యీకరణం చెంది చకారంగా మారింది. ఈ మార్పు కోస్తావాడుకలో చాలా ఎక్కువ; రాయలసీమ, తెలంగా ణాలలో చాలా తక్కువ. ఎలమంచిలి, చోడవరాల వ్యవహారంలో ఇది పాక్షికంగా ఉండగా (తకారం ఇంకా నిలిచినందువల్ల), నర్సీపట్నం, శృంగరవరపు కోటల వాడుకలో ఈ తాలవ్యీకరణం సంపూర్ణమే (-చ్చె- రూపాలుండటంవల్ల). అంటే ఈ మార్పు పశ్చిమ విశాఖ, ప్రాగ్విశాఖ అనే రెండు స్థానిక మాండలికాల వాడుక భిన్నంగా ఉన్నట్లు నిరూపిస్తున్నది.

'Fail' అనే ఆంగ్ల శబ్దాన్ని ఉచ్చరించటంలో రెండురకాల ఉచ్చారణ ఈ మండలంలో వినిపిస్తున్నది. ఫేల్ అనే ఉచ్చారణ ఆర్యభాషా ప్రభావం (ఒరియా వంటివి) ఎక్కువగా ఉన్నచోట్ల, ఉరుదూ ప్రభావం అధికంగా ఉన్న తెలంగాణాలో, సర్వసాధారణం; ఫెయిల్ అనేది ఆంగ్లభాషాప్రభావం ఎక్కువగా ఉన్న కోస్తా, రాయలసీమల్లో మామూలు ఉచ్చారణ.

కుందేలు, చెవులపిల్లి అనే రెండుపదాలూ తెలుగుమాటలే. మొదటిది ఏక శబ్దమయితే రెండోది వర్ణనాత్మకమైన పదబంధం. విజయనగరం, భీమునిపట్నాల వాడుకలో రెండోదానికే వాడుక. ఈ రెండురకాల వ్యవహారాలూ ఈ మాండ లికాన్ని రెండు ప్రాదేశికస్థానికమాండలికాలుగా పునర్విభజిస్తున్నాయి. అంటే ఒకదాన్ని మరొకటి ఖండిస్తుండే విభిన్న స్థానికమాండలికాలు కళింగాంధ్ర ప్రాంతీయ మాండలికంలో అంతర్భాగాలుగా ఉన్నాయన్నమాట. విద్యా సౌకర్యాలు, వార్తాప్రసారాలూ తక్కువగా ఉన్నప్రాంతంలో ఇటువంటి వైవి

ధ్యం ఏ భాషలోనైనా కనిపిస్తుంది.

'కొడవలి, కన్ను' అనే రెండు శబ్దాల బహువచన రూపాలు పరిశీలిస్తే విశాఖ మండలంలోని విద్యావంతుల్లో అత్యధికభాగం ఇతర తీరాంధ్రమండలాల్లో లాగానే ద్విరుక్త మూర్ధన్యళకారాన్నే బహువచనంలో ఉచ్చరిస్తున్నారని తెలుస్తుంది. రాయలసీమలో తెలంగాణాలో క్రమంగా పర్యాప్తంగాను క్వాచిత్కంగాను ద్విరుక్తలకారోచ్చారణమే వినిపిస్తుంది. విజయనగరవాస్తవ్యుడి ఉచ్చారణలో మూర్ధన్యలకారానికి బదులు దంతమూలీయలకారమే వాడుకలోఉంది. *కల్లు* శబ్దం తెలంగాణా విద్యావంతుల భాషలోకూడా వినిపిస్తుంది. రాయలసీమలో దంతలకారోచ్చారణంగల 'కల్లు', 'కొడవల్లు' అనే శబ్దాలకు వాడుక ఎక్కువ. భీమునిపట్నం వాడుకలోని *కండ్లు* ప్రాచీనకావ్యభాషలోను, రాయలసీమ తెలంగాణా వాడుకల్లోను, వినిపిస్తుంది. అయితే ఇదే వ్యావహార్త సప్తమీ బహువచనంలో "*కళ్ళల్లో*" అని పలికినప్పుడు కళ్ళు అనే రూపభేదంకూడా పర్యాయోపయోగంలో ఉందని చెప్పాలి. 'కొడవలి' శబ్దంలోని డకారాన్ని ఈషత్స్పృష్టంగా (హిందీలోని లడ్కా, సడక్ శబ్దాల్లోని డకారంలాగా) పలకటం కోస్తాలో, తెలంగాణాలో సాధారణం. ఇదేలక్షణం విశాఖమండలంలో ఎక్కువగా ఉంది. విజయనగరం, భీమ్లిలలో ఈ ఉచ్చారణ లేకపోవటం విశేషమే.

పంచమీవిభక్తి ప్రత్యయమైన *కంటె(న్)* కావ్యభాషలో ఎక్కువ వాడుకలోఉంది. విశాఖమండలంలో దాని రూపాంతరాలకే ఇతరప్రాంతాల్లోలాగా వాడుక ఎక్కువగా కనిపిస్తుంది. గోదావరికి దక్షిణాన ఉన్న తీరాంధ్రంలో-కన్నా అనే ఆధునికరూపానికే ఎక్కువ వ్యాప్తి. నర్సీపట్నంలో నిత్యంగాను, శృంగవరపుకోటలో పర్యాయోపయోగంలోనూ ఈ రూపం వినిపించటం బహుశా ఆధునిక ప్రచారసాధనాల ప్రభావంవల్లనే అయివుంటుంది.

*ఎవమండుగురు* శబ్దం కావ్యభాషలో వికల్పంగాను, నేటి గోదావరి మండలంలో నిత్యంగాను వ్యవహృత మవుతున్నది. ఇతరప్రాంతాల్లో దీనికి పర్యాయపదం 'ఎనిమిదిమంది'. కొన్నిచోట్ల 'ఎనిమిదిగురు' అనేవాళ్ళూ లేకపోలేదు. ఎనమ-అనే ప్రాతిపదిక మాత్రం 'ఎనమన్నూరు' (=800) అనే సంఖ్యావాచకంలో రాయలసీమలో ప్రచారంలో ఉంది. సమీపప్రాంతవ్యవహారం ఇక్కడ కూడా వాడుకలోకి వచ్చివుండవచ్చు. నర్సీపట్నం, చోడవరం వాడుకలో పదాది ఎకారం ఏకారంగా (ε గా) మారటం గమనార్హం.

ఈ మండలభాషాభేదంలో 18కి సూచకంగా పద్ధెమ్మిది/పద్దెమ్మిది అనేవి వాడుకలో ఉన్నాయి. తీరాంధ్రంలో ఎనిమిది శబ్దంలోని తొలియచ్చు ప్రభావంవల్ల పది శబ్దంలోని దకారం తాలవ్యీకరణం చెందిన 'పజ్జైనిమిది'లాంటి రూపాలకే బహుళప్రచారముంది. 'ముత్యం' అనే శబ్దం విషయంలో తాలవ్యీకరణం వినిపించే పట్టణాల్లో మరోశబ్దం విషయంలో అది వినిపించటం లేదంటే ఈ మార్పు ఈ మాండలికంలో ఇప్పుడిప్పుడే వస్తున్నదని చెప్పాలి. రాయలసీమలో తెలంగాణాలో తాలవ్యీకరణం కొద్దిమందికి మాత్రమే పరిమితం.

కళింగాంధ్రంలోని బంధుత్వబోధకపదాలు (Kinship terms) కొన్ని ఇతరప్రాంతాల్లో లాగాను, కొన్ని విలక్షణంగాను, ఉంటాయి. 'తండ్రి తల్లి' అనే అర్థంలో నాయనమ్మ, బామ్మ శబ్దాలు కొద్దిపాటి ఉచ్చారణభేదాలతో ఇతర ప్రాంతాల్లో ఉండగా, ఇతరప్రాంతాల్లో 'తల్లితల్లి' అనే అర్థాన్ని ఇచ్చే మామ్మ శబ్దం పర్యాయపదంగా భీమునిపట్నంలో నిత్యంగా, ఎలమంచిలిలో వికల్పంగా వినిపిస్తున్నది. పట్టికలో ఇవ్వలేదుగాని విశాఖపట్టణంలో ఇందుకు పర్యాయ పదాలుగా బొప్ప, నానక్క, నానమ్మ, నాన్నమ్మ అనే పదాలూ, అనకాపల్లిలో నాయినమ్మ/నానమ్మ (రెండోది ఈతరంవాళ్ళ వాడుకలో ఎక్కువని వ్యవహర్త చెప్పటం) అనే రూపాంతరాలూ, అరకులో నాన్నమ్మ అనే రూపభేదం, వాడుకలో ఉన్నాయి. ఇట్లాగే 'తండ్రి అన్న' అనే అర్థంలో పెదనాన్న శబ్దం కొన్ని చిన్న చిన్న రూపభేదాలతో ఎక్కువ వాడుకలో ఉండగా, విజయనగరంలో బావాజీ, విశాఖపట్టణంలో పెదబావాజీ, అనకాపల్లిలో అయ్యా / పెద్దాయ్యా, అరకులో ఆయగారు అనేవి పర్యాయోపయోగంలో ఉన్న శబ్దాలు. 'బావాజీ' శబ్దంలోని వకారం 'బాబా' శబ్దంలోని బకారంనుంచి ఏర్పడ్డదని '-జీ' అనే గౌరవవాచక ప్రత్యయం ఆర్యభాషాప్రభావం (ముఖ్యంగా ఒరియా ప్రభావం) వల్ల వాడుకలోకి వచ్చిందని గమనించాలి.

క్రియాపదస్వరూపంలో ఈ మండలభాష కోస్తాభాషకే సన్నిహితంగా ఉంటుందిగాని రాయలసీమ ప్రాంతీయ లక్షణాలు కొన్ని ఇక్కడకూడా కనిపిస్తుంటాయి. 'కలియు' ధాతువు భూతకాలిక ఉత్తమ పురుషైక వచన రూపం ఉదాహరణగా తీసుకుందాం. విశాఖమండలంలో దీనికి రొండు రూపాంతరాలున్నాయి: *కలిసేను*, *కలిసైను*-అనేవి. వీటిలో మొదటిది పశ్చిమ విశాఖ మండలంలో వినిపిస్తుంది. ఈ రెంటికీ మూలరూపం 'కలిసినాను' అనేది; దానికి రాయలసీమలో ప్రయోగబాహుళ్యముంది. '-నాను'లోని నకారం లోపించగా 'కలిసి-' చివరి ఇకారంతో 'అను' లోని 'అ' సన్నికృష్ట సంహితలో (close juncture) ఉండి '-ఏను' (-ఇ + -అ) అనే ధ్వని విశేషం ఏర్పడ్డది. ఈ మార్పుతో *కలిసైను* అనే రూప మేర్పడి కోస్తాలో వాడుకకు ఎక్కింది. తెలంగాణా వ్యవహారంలో '-నాను' లోని మొదటి అచ్చుతోబాటు పురుషబోధకమయిన -నుప్రత్యయంకూడా లోపించి *కలిసిన* అనే వాడుక ఏర్పడింది. అయితే కళింగాంధ్ర వ్యవహారంలో కొన్నిచోట్ల ఏ కారానికి బదులు ఏకారమే ఏర్పడ్డ రూపాలున్నాయి (ఉదా. కలిసేను). ఈ మార్పు కోస్తాలో అసాధ్యం. ఎందుకంటే భాషలో ఏకకాలిక వ్యవహారంలో భిన్నార్థకాలుగా ఏకరూపశబ్దాలుండటం జరగదు. "*కలిసేను*" అనే రూపం భవిష్యదర్థకం; *కలిసైను* అనేది భూతార్థకం, ఈ జంట మాటల్లో ఏ, ఏ లు కనిష్ఠభేదకాంశాలు. కాని లేఖనంలో ఏ (ɛ) ధ్వనిని ప్రత్యేకచిహ్నం లేనందువల్ల కొందరు 'కలిసాను' అని అకారమధ్యంగాను మరికొందరు 'కలిసేను' అని ఏకారమధ్యంగాను రాస్తూవున్నారు. ఈ భేదం గుర్తించినవాళ్ళు భూతార్థకంగా 'కలిశాను, చెప్పాను' మొదలుగా రాస్తు

న్నారు. ఇందువల్ల ఈ అర్థభేదంలేని తావుల్లో - ముఖ్యంగా కోస్తాభాషా రీతిని అనుకరిస్తున్న తెలంగాణా వ్యవహర్తల్లో - లిప్యనుసారి ఉచ్చారణ (spelling pronounciation) రీతులు వినిపిస్తున్నాయి. ఆ ప్రాంతీయుల రేడియో ప్రసంగాల్లో ఈ తీరును గమనించవచ్చు. కళింగాంధ్రంలో ఏకారం మాత్రమే ఉచ్చరించేచోట్ల (కలిసేను అని పలికేచోట్ల) భవిష్యదర్థంలో ఇదే క్రియాపదానికి వాడుకలేదు- ఉండదు. 'పిలుచు' ధాతువులోని చివరి చకారం అజాది ప్రత్యయాలకుముందు వకారంగా మారటం కోస్తా, తెలంగాణాల్లో క్రమంగా నిత్యబహుళాలుగా ఉంటే, రాయలసీమ వాడుకలో ఈ మార్పు రాక పోవటమే అధికాధికం. అందువల్ల రాయలసీమలో *పిలచండి* అనే రూపమే వినిపిస్తుంది. తెలంగాణాలో కొన్నిచోట్ల ధాతుగత చకారం లోపించిన 'పిలుండ్రి' మొదలైన రూపాలు వినిపిస్తాయి. తులనాత్మకదృష్టిలో 'పిలుచు' అనే తెలుగు ధాతువును సజాతీయధాతువులతో పోల్చిచూస్తే మూలద్రావిడంలో *పిల్-అనే దీని రూపమని, అప్పటి-*చు ప్రత్యయం మధ్యకాలంలోవచ్చి చేరి తెలుగు ప్రత్యేక భాషగా ఏర్పడే నాటికి ధాతువులో భాగమైపోయిందని గుర్తించగలం. *పిలండి, పిలువుండ్రి* మొదలైన రూపాల్లోని ధాతువు అత్యంత ప్రాచీనమైనా ఆయా ప్రాంతాల వ్యవహారంలో మూలరూపంలో ఇంకా నిలిచి వుందని చెప్పాలి. కావ్య భాషలో నేటి రూపాలకు పర్యాయంగా 'పిలువుండు/°వుండి' అనేవి వాడుకలో ఉన్నాయి. 'చేసెడు/°డి' మొదలైన పదాల్లోలాగానే ఇక్కడకూడా పర్యాయ రూపత కనిపిస్తుంది. 'ఇచ్చు' ధాతుప్రార్థనాద్యర్థక బహువచనరూపాల్లో రాష్ట్రం మొత్తంలో రెండురకాల రూపాలు వినిపిస్తాయి. ఒక రకంలో ప్రాతిపదికకు 'ఇయ్య్యి-' అనే రూపమూ మరోరకంలో 'ఇవ్వ్వి-' అనే రూపమూ పర్యాయ ప్రవృత్తిలో కనిపిస్తాయి· ఇది ప్రాంతీయభేద రూపకంగా కాని వర్గమాండలికభేద రూపంలోగాని స్పష్టంగా నిర్దేశించదగ్గ భేదంకాదు.

మొత్తంమీద విశాఖపట్టణ మాండలికంలోని విద్యావంతులభాషాభేదమనే అవాంతరభేదంలో ఇతరతీరాంధ్రభాషా లక్షణాలే ఎక్కువగా కనిపిస్తున్నాయి. స్థానికమాండలికభేదాలు వీరిలో తక్కువ. కొన్ని కళింగాంధ్ర ప్రత్యేకతలు లేక పోలేదు. అంతగా చదువుకోని రాజకీయకార్యకర్తల వ్యవహారంలోనుంచి (పట్టిక2) కొన్ని ప్రతినిధిపదాలు తీసుకోని పరిశీలిస్తే మరికొన్ని విశేషాలు తెలుస్తాయి. ఈ భాషాభేదంలో సుదూరంలోని రాయలసీమ పలుకుబడి కొన్ని సందర్భాల్లో కొట్టొచ్చినట్లు కనిపిస్తుంది. వైవిధ్యంలోని ఈ ఏకత్వమే తెలుగు ఒకే భాష అనటానికి పెద్ద నిదర్శనం. రెండో పట్టికలోని పదిమాటలనూ ఒక్కొక్కటిగా పరిశీలిద్దాం.

కొన్ని తెలుగుమాటలకు నామ విభక్తిప్రత్యయాలు చేరేటప్పుడు 'ఇ,టి,తి' అనే ఉపవిభక్తులు చేర్తాయని కావ్యభాషావ్యాకరణాలు వర్ణిస్తుంటాయి. తులనాత్మక వ్యాకరణాలుకూడా ఈ పరిస్థితి ద్రావిడభాషా సాధారణలక్షణమని గుర్తించాయి. సంప్రదాయవ్యాకరణాలు ఆయాగణాలకు చెందిన పదాలకు ఈ చేర్పు నిత్యంగా

జరుగుతుందంటాయి. కానీ అత్యంతప్రాచీనమైన శాసనాంధ్రభాషనుంచి ఇప్పటి వాడుకవరకూ పరిశీలిస్తే ఈ చేర్పు వైకల్పిక మనే అనిపిస్తుంది. 'రోలు' శబ్దానికి టివర్ణం చేరటమే కావ్యభాషామర్యాద. కానీ నర్సీపట్నం, శృంగవరపుకోట, ఎలమంచిలి, చోడవరం వ్యవహారంలో ఇది చేరదు. విజయనగరం (సప్తమీవిభక్తిలో ఔపవిభక్తికమైన రోట్లో అనే రూపం; ద్వితీయా-చతుర్థిలో అనౌపవిభక్తికంగా రోలికి అనే రూపం), మాడుగుల (పై విధంగానే) వాడుకలో ఉపవిభక్తులు చేరటం, చేరకపోవటం పర్యాయప్రవృత్తిలో ఉన్నాయి. ఒక్క భీమ్లిలోనే కావ్య భాషలోలాగా టివర్ణకం చేరిన రూపాలు వాడుకలో ఉన్నాయి. మరో విశేషం రోలు శబ్దానికి బదులు రుబ్బురోలు అనే పదబంధం కొన్ని తెలంగాణా స్థలాల్లో లాగా నర్సీపటం, మాడుగుల, ఎలమంచిలి, చోడవరాల్లో పర్యాయపదంగా వాడుకలో ఉండటం. అంటే ఇంచుమించు పశ్చిమవిశాఖలో ఈ వ్యవహారం స్థానిక మాండలికంగా ఉందన్నమాట. 'రాయి' శబ్దానికి తివర్ణకం చేరటం కూడా వైకల్పికంగానే ఉంది. అయితే ఈ విషయంలో వ్యవహృత పట్టణాల విభజన వేరు. భీమునిపట్నం, నరసీపట్నం, మాడుగుల, చోడవరాల్లో తివర్ణాదేశం నిత్యం; ఎలమంచిలిలో లుప్తం; ఇతరపట్టణాల్లో వైకల్పికం. "రాయి" శబ్దానికి తెలంగాణా వ్యవహారంలో పర్యాయపదం రౌతు.

స్వల్పోచ్చారణభేదాలు మినహాయిస్తే, విశాఖజిల్లాలో కాడి, పూజు/పూదు, లంకె* అనే మూడు మాటలు పర్యాయ పదాలుగావాడుకలో ఉన్నాయి. వీటిలో మొదటిది అనకాపల్లి, ఎలమంచిలి, నరసీపట్నం తాలూకాల్లోను, చివరిది బహువచనంలో మాత్రమే చోడవరం తాలూకాలోను, రెండోది తక్కిన భాగాల్లోను, వినిపిస్తున్నాయి. ఇది రాజకీయ కార్యకర్తల వ్యవహారంలో. ఇంతకు రమారమి ఇరవై సంవత్సరాల పూర్వం వ్యవసాయ వృత్తి పదకోశం కోసం భద్రిరాజు కృష్ణమూర్తిగారు పర్యటనపరిశోధన చేయించినప్పుడు ఎలమంచిలిలో 'కాడి' శబ్దమూ, నర్సీపట్నంలో 'కాడి/పూజు' అనే పర్యాయ రూపాలూ, వాడుకలో ఉన్నట్లు తెలిసింది. అప్పట్లో చోడవరంలో దకార యుక్త రూపాన్నే వాడుతున్నట్లు, లంకెలు అనే బహువచన రూపం (దానికే ఏకవచనంలో పూజ అనే రూపం) వాడనట్లు, తెలిసింది. మొత్తంమీద '-ద-/-జ-'ల వ్యవహారం ఎట్లా ఉన్నా పూదు/పూజు అనే రూపాంతరాలు రెండూ కళింగాంధ్ర వ్యవహారంలో మాత్రమే కనిపిస్తాయి. రాష్ట్రంలోని ఇతరప్రాంతాల్లో 'కాడి, కాని, కాడిమాకు, కాడిమాను, కాండి, కాణి, కావడి' అనేవి పర్యాయ పదాలుగా వ్యవహారంలో ఉన్నాయి. తీరాంధ్రంలో 'కాడి'; మెదక్, వరంగల్, నల్గొండ, ఖమ్మంజిల్లాల్లో 'కాని'; తుంగభద్రానదికి ఉత్తరాన 'కాడిమాకు', దక్షిణాన 'కాడిమాను'; అదిలాబాద్, నిజామాబాద్ జిల్లాల్లో పూర్తిగాను మెదక్, ఖమ్మం జిల్లాల్లో చాలా ప్రాంతాల్లోను 'కాండి'; కరీంనగర్ జిల్లాలో అధికాధికంగా 'కాణి', అనంతపురం జిల్లాలోని హిందూపూర్, కళ్యాణదుర్గం తాలూకాల్లో 'కావడి'; వ్యవహారంలో ఉన్నాయి (వివరాలకు 'మాండలికవృత్తి

మాండలిక ప్రభావంవల్లనే.

పై విధంగా భిన్నవృత్తులకు, భిన్న సాంఘిక స్థాయులకు, భిన్నపట్టణాలకూ చెందిన వ్యవహర్తల భాషావిశేషాలను పరిశీలిస్తే కొన్ని సామ్యాలు, కొన్ని వైషమ్యాలు కనిపిస్తాయి. అయితే మొత్తంమీద విశాఖమండలభాష తీరాంధ్ర భాషకు అత్యంత సన్నిహితంగా ఉండి కొన్ని ఆర్యభాషాప్రభావాలను ప్రదర్శిస్తుందని చెప్పాలి. కొన్ని సందర్భాల్లో ఈ భాషావిశేషం రాయలసీమ లక్షణాలను ఎక్కువగా తెలంగాణా లక్షణాలను కొంచెం తక్కువగా ప్రతిబింబిస్తుంటుంది. ఈ విషయం స్థూలదృష్టికే గోచరిస్తుంది. విశాఖమండలభాషకు వర్ణనాత్మక వ్యాకరణం రాసినప్పుడుగాని దాని విలక్షణతలను, ఇతరమండలభాషా సమానలక్షణాలను విపులంగా చర్చించటం సాధ్యంకాదు. కొన్ని మాసాల్లో అట్లాంటి వ్యాకరణం వెలుగు చూస్తుంది.

## పట్టిక 1 (విద్యావంతుల వ్యవహారం)

| విజయనగరం | భీమునిపట్నం | నర్సీపట్నం | శృంగవరపుకోట | ఎలమంచిలి | చోడవరం |
| --- | --- | --- | --- | --- | --- |
| చెట్టవ్‌‹ | చెట్టము | చెట్టవ్‌‹ | చెట్టవ్‌‹ | చెట్టవ్‌‹ | చెట్టవ్‌‹ |
| చీమ | చీమ | చీవ‹ | చీమ | చీవ‹ | చీమ / ఛీమ |
| అర్ధవ్‌‹ | అర్ధవ్‌‹ | అర్ధవ్‌‹ / అర్దవ్‌‹ | — | — | అఢ్ఢము |
| ముత్యవ్‌‹ / ముచ్యెము | ముచ్యవ్‌‹ | ముచ్చెవ్‌‹ | ముచ్చెవ్‌‹ | ముత్యెవ్‌‹ | ముత్యెవ్‌‹ (బ. ముచ్యాలు) |
| ఫేల్‌ | ఫెయ్ల్ | ఫేల్‌ / ఫెయిల్‌ | ఫేల్‌ | ఫేల్‌ | ఫెయిల్‌ |
| చెవలపిల్లి | చెవలపిల్లి | కుందేలు | కుందేలు | కుందేల్‌ | కుందేలు |
| కొడవళ్ళు | కొడవళ్ళు | కొడ̣వళ్ళు | కొడ̣వళ్ళు | కొడ̣వళ్ళు | కొడ̣వళ్ళు |
| కల్లు | కండ్లు (కళ్ళల్లో) | కళ్ళు | కళ్ళు | కళ్ళు | కళ్ళు |
| -కంటే | -కంటే | -కన్నా | -కంటే / -కన్నా | -కంటా / -కంటె | -కంటే / -కంటె |
| ఎనమండుగురు | — | ఎనమండ్గురు | ఎనమండుగురు | ఎనమండుగురు | ఎనమండుగురు |
| పద్దెమ్ది | పద్దెనమిది | పద్దెనిమిది | పద్ధెమ్ది | పద్దెమ్ది | పద్ధెమ్ది |
| నాయనమ్మ | మామ్మ | నాయ్నమ్మ | బామ్మ | నాయ్నమ్మ / మామ్మ | నాన్నమ్మ |
| పెదనాన్న ; బావాజీ | పెదనాన్న | పెదనాన్న ; పె$^{V}$దనాన్న | పెద్నాన్న | బాబు / పెదనాన్న | పెదనాన్న / అయగారు |
| కలిసేను | — | కలిసేను | కల్సేను | కల్సేను | కలిసేను |
| పిలండి | — | పిలవండి | పిలవండి | పిలవండి | పిలండి |
| ఇయ్యండి | ఇ$^{V}$వ్వండి | ఇవ్వండి | ఇవ్వండి | ఇవండి | ఇవ్వండి |

పట్టిక 2 (రాజకీయ కార్యకర్తల వ్యవహారం)

| విజయనగరం | భీమునిపట్నం | అనకాపల్లి | నర్సీపట్నం | మాడుగుల | శృంగవరపుకోట | ఎలమంచిలి | చోడవరం |
|---|---|---|---|---|---|---|---|
| రోట్లో; రోలికి | రోట్లో; రోటికి | రోట్లో; రోటికి రోల్లో; రోలికి | రుబ్బురోల్లో; °రోల్కి | రోట్లో; రుబ్బురోలికి | రోల్లో; రోలికి | రుబ్బు రోల్లో; °రోలికి | రుబ్బురోల్లో; °రోలికి |
| రాయిమీద/ రాతి- | రాతిమీద | రాతిమీద; రాయిమీద/°రాతి- | రాతిమీద | రాతిమీద | రాతిపై/°మీద; రాయిమీద | రాయిపై/°మీద | రాతిమీద |
| పూజులు | — | కాల్లు/కాడిలు | కాళ్ళు<sup>v</sup> | పూదులు | పూజులు | కాడిలు | లంకెలు (ఏక. పూజ) |
| మట్లు | — | కుదుర్లు | కు<sup>v</sup>దుళ్ళు (ఏక. మట్టు) | కుదుర్లు | కుదుళ్ళు | కుదుర్లు | కు<sup>v</sup>దుళ్ళు |
| వియ్యంకుడు | వియ్యంకుడు | వియ్యంకుడు | వియ్యంకుడు | ఈరకాడు | వియ్యంకుడు | ఈరకాడు/ వియ్యంకుడు | ఈరకాడు |
| వియ్యపురాలు | వియ్యంకురాలు | వే<sup>v</sup>పరాలు/ వియ్యపురాలు | వీపరాలు | యీారకత్తె | వియ్యపురాలు; వియ్యంకురాలు | ఈరకత్తె/ వియ్యంకురాలు | ఈరకత్తె |
| వలం | వలవ్( | వలం; స్థూలం | వలం; బడ్డు | లావు; వలం; లంబు | వలం | వలం | వలం |
| అయ్యాను | అయ్యేను/అయ్తిని | అయ్యేను | — | — | అయ్యే<sup>v</sup>ను | అయా<ను | అయ్యేను |
| అవకుండ | అవకుండా | అవకుండా | — | అవకుంటా | అవకుండా | అవకుంటా | అవ్కుంట |
| లెగుస్తా | లేస్తూ | లేస్తూ | లెగిస్తూ | లెగుస్తూ | లేస్తో; లెగిస్తూ | లేస్తా | లేస్తూ |

# 4

# విశాఖ విశేషాలు

ఎ. శ్రీహరి

తెలుగును సుమారు నాలుకోట్లమంది మాతృభాషగా మాట్లాడుతుంటారు. వీరందరిలోనూ భాష ఒక్కలాగ ఉండదు. వ్యక్తిగత భేదాలను తీసేస్తే ఈ నాలుకోట్లల్లోనూ భాషా వ్యవహారం సమూహాల వారిగా జరుగుతుందని చెప్పచ్చు. రెండు భిన్న సమూహాల మధ్యకన్నా ఒకే సమూహంలో వ్యక్తుల మధ్య సాంఘికభాషా వ్యవహారాలు ఎక్కువగా జరుగుతై కాబట్టి ఒక సమూహానికి ఇంకోసమూహానికి భాషా వ్యవహారంలో భేదాలు ఏర్పడతాయి. ఈ భేదాలు పదజాలంనుంచి వాక్య నిర్మాణం వరకూ 'విలోమక్రమం'లో కనిపిస్తాయి. భాషా సమాజంలో భేదాలు భాషాసమ్మంధాల సాంద్రతమీద ఆధారపడి ఉంటాయి. అంటే వివిధ సమూహాలమధ్య భాషావ్యవహారానికి అవరోధం కలిగినప్పుడు ఈ భేదాలు ఉత్పన్నమౌతాయి. ఈ భేదాలు రెండు రకాలు-ఒకటి భౌగోళికం, రెండు సాంఘికం. ఒకే భాషా సమాజంలో భౌగోళిక పరిస్తితులవల్ల పరస్పర సమ్మంధాలకి అవకాశం లేనప్పుడు ఏర్పడిన భాషా భేదాలన్నీ భౌగోళికభేదాల కింద వస్తాయి. సాంఘికంగా ఏర్పడిన భేదాలన్నీ-అంటే చదువురీత్యా, వృత్తిరీత్యా, కులంరీత్యా ఏర్పడిన సాంఘిక భేదాలను ప్రతిబింబించే భాషాభేదాలను-సాంఘిక భేదాలకింద జమకడ్తాం.

భౌగోళిక భేదాలవల్ల ఏర్పడిన భాషాస్వరూపాలన్నీ 'ప్రాంతీయ మాండలికాలనీ' సాంఘిక భేదాలవల్ల ఏర్పడినవి 'సాంఘిక వ్యవహార భేదాలనీ' స్థూలంగా చెప్పుకోవచ్చు. తెలుగులో నాలుగు ప్రాంతీయ మాండలికాలని గుర్తించచ్చు - 1) తెలంగాణా 2) రాయలసీమ 3) కోస్తా 4) కళింగం (ఈ విభజన వృత్తి పదాధ్యయనం ఆధారంగా చేసింది). మళ్ళీ ఆయా ప్రాంతాల్లో 'చదువుకోని వాళ్ళ భాష'అనీ 'చదువుకున్నవాళ్ళభాష'అని రెండు సాంఘిక వ్యవహార భేదాలు స్థూలంగా ఏర్పడి ఉన్నాయి.

**భాష - సమాజం :** సంఘం ఏ విధంగా ఐతే వ్యవస్థీకృతమై ఉందో అదేవిధంగా భాషలోకూడా ఒక వ్యవస్థ అనేది ఏర్పడి ఉంటుంది. సంఘంలోనూ భాషలోనూ అలవాట్లు అజ్ఞాతంగా ఏర్పడతాయి. సమాజంలో జరిగే వ్యవహారాలకు భాష మూలం కాబట్టి భాష, సమాజం 'అన్యోన్యసమ్మంధం' తో ఉంటాయి. సమాజంలోని చేష్టలని (processes) భాష

ప్రతిబింబిస్తుంటుంది. అందువల్ల భాషలో సామాజిక ప్రమాణాలు వ్యవస్థీకృత మౌతుంటాయి. ఈ ప్రణాళిక ముఖ్యోద్దేశాల్లో భాషా సామాజిక వ్యవస్థల మధ్యఉన్న 'సహరూపాంతరత' (covariation)ను నిరూపించడం; సమాజంలో భాషేతర కారణాలవల్ల ఏర్పడిన వర్గాల విభజనని భాషావ్యవహారం ఎంతవరకు ప్రతిబింబిస్తున్నాదో తెలుసుకోడం; భాషలో ప్రామాణికత ఏ సామాజిక ధర్మాల వల్ల ఏర్పడుతుందో-అంటే, ఏ సామాజిక అంశాలు భాషలో వ్యవహారప్రమాణాన్నినిర్దేశిస్తాయో - తెలుసుకోడం, అనేవి కొన్ని. వ్యవహర్త సాంఘిక స్థాయి మారేకొద్దీ, భాషా వ్యవహారం దానికనుగుణంగా మార్తూ ఉంటుంది. స్టేజిమీదా, ఇంటిదెగ్గిరా ఒక మనిషి భాషా వ్యవహారం ఒక్కలాగ ఉండదు. అదే విధంగా అధికవిద్యా సాంఘిక సమ్మంధాలున్నవారికీ అల్పసమ్మంధాలున్నవారికీ భాషలో అనేక భేదాలు కనిపిస్తాయి. ఈ భేదాలు కేవలభేదాలు కావనీ ఇవి ఒక "నిర్మాణ క్రమంలో" ఉంటాయని నిరూపించడం కూడా ప్రణాళికాంశాలలో ఒకటి.

*విశాఖ వ్యవహారం : ముఖ్యాంశాలు*

(1) అక్షరాల్లో (Syllables) అచ్చుల మార్పులు : మొదటి రెండు అక్షరాల్లో అ, ఇ, ఉ, ఎ, ఒ, లు కింద సూచించిన క్రమంలో మార్పు చెందుతాయి.

మొదటి అక్షరంలో మార్పులు :

1. అ ⟶ ఎ, ఒ
2. ఇ ⟶ ఉ;
3. ఉ ⟶ ఇ, ఒ;
4. ఎ ⟶ అ, ఒ.
5. ఒ ⟶ ఉ, అ.

ఉదాహరణలు :

1. సెంపాంచ్ కుంటొవ్ (సంపాదించుకుంటాం)
   గొట్కుంతాఉ (కట్టుకుంటారు)
   పొన్లు (పన్లు).
2. ఉప్పళ్ళేదు (ఇప్పుడులేదు).
3. నివ్వేదో (నువ్వుఏదో)
   మొగవ్ (ముఖం)
4. చప్పలేదు (చెప్పలేదు)
   రొండు (రెండు)
5. ఉకెక్రన్నర (ఒక ఎకరన్నర)
   పలవ్‌లో (పొలంలో)

పై మార్పులన్నింట్లోనూ 'అ'కారం 'ఒ'కారం కావడం వ్యవస్థితంగా కనబడుతున్నాది. అక్షరంలో ఓష్ఠ్యాల (labials) తరవాత 'అ'కారం 'ఒ'కారంగా మార్తుందని స్థూలంగా సూత్రించచ్చు. ఇతరత్రా పరాక్షరంలో 'ఉ'కారం

ఉన్నప్పుడు పూర్వాక్షరంలోని 'అ'కారం 'ఒ'కారంగా మార్తుంది. పై సూత్రాల్నిబట్టి -

పన్లు ⟶ పొన్లు (ప-)
పట్టుచీర ⟶ పొట్టుజీర (ప-)
బళ్ళు ⟶ బొళ్ళు (బ-)
వరిఆకు ⟶ వొరాగు (వ-)
కబురు ⟶ కొబురు (-ఉ)
ఖర్చు ⟶ కొర్సు (-ఉ)
కండువా ⟶ కొండువా (ఉ)

రెండో అక్షరంలో మార్పులు :

1. అ ⟶ ఇ, ఉ, ఒ
2. ఇ ⟶ ఉ
3. ఎ ⟶ ఇ
4. ఒ ⟶ ఎ

ఉదాహరణలు :

1. సవ్యింగా (సవ్యంగా)
   బయ్యూవ్ (భయం)
   మాత్రువ్ (మాత్రం)
   కొంచువ్ (కొంచం)
   అర్థున్చేసోక (అర్థంచేసోక)
   ముఖోవ్ (ముఖం)
2. ఇంగ్లూష్లో (ఇంగ్లీష్లో)
   కోరుక (కోరిక)
3. వుద్దీశన్చేత (ఉద్దేశంచేత)
4. పొటేదీశేశేర్ (ఫోటో తీసేసేరు)

'మ'కారం పరమైనప్పుడు 'అ'కారం 'ఉ'కార 'ఒ'కారాలుగా మారుతున్నదని చెప్పచ్చు. ఇతరత్రా ఈ మార్పు వికల్పం.

ఉదాహరణలు :

అందం ⟶ అందుఁవ్
నిజం ⟶ నిజువ్
ముఖం ⟶ ముఖోవ్
మొత్తం ⟶ మొత్తువ్
కొంచం ⟶ కొంచువ్

పరాక్షరంలో 'అ'కారం పరమైనప్పుడు పూర్వాక్షరంలోని సంవృతాచ్చులైన ఇ, ఉ, ఎ, ఒ లు వివృతి (lowering) చెందుతాయి. ఈ మార్పు ఈ ప్రాంతంలో నిత్యం. ఇది కోస్తా మాండలిక సాధారణ లక్షణం.

పిల్ల ⟶ ప్లిల్ల
పేపరు ⟶ ప్యేపరు
ముక్కు ⟶ మ్యుక్కు
గోడ ⟶ గ్యోడ

తాలవ్యాలకు పరంగా ఒచ్చినప్పుడు 'అ', 'ఎ'లు పర్యాయ రూపతలో ఉంటాయి.

ఉదాహరణలు :

చప్పలేదు < చెప్పలేదు
జెచ్‌పోండ్‌గనీ < చచ్చిపోయినాడుకానీ ...

'ల'కారానికి 'న'కారోచ్చారణ ఇక్కడి వాడుకలో ఒక విశేషం. పదాదినా పదమధ్యానా ఈ పరిణామం ఎరువుమాటల్లోకూడా కనిపిస్తుంది.

ఉదాహరణ :

నంచవ్‌ లేకుంట .... (లంచం లేకుండా)
నైట్లూ (లైట్లు)
మినీమీటర్లంతె...(మిలీమీటర్లంతె)

'ల'కార 'న'కార పర్యాయరూపత ప్రత్యయాదుల్లో కూడా ఉండడం ఈ పరిణామ విస్తృతిని తెలుపుతుంది.

ఉదాహరణ :

మల్లిపువ్‌నా (మల్లిపువ్వులా)
యెండకాలువ్‌నో (ఎండకాలంలో)
నోనికి ఎలిపోయింది (లోనికి వెళ్ళిపోయింది)

అదేవిధంగా క్రియాపదాల్లో -

అవనేదు (అవలేదు)
బయింపడవల్సిన్నేదండి (భయంపడవల్సింది లేదండి)

కానీ ఈ పర్యాయ రూపత జానపద వ్యవహారలక్షణం అనే చెప్పాలి. శిష్ట వ్యవహార్తల్లో ఈ భాషావ్యవహారం లేదని వ్యవహారఖండికలు తెలుపుతున్నాయి.

*క్రియా రూపాలు :*

భూతకాలం : భూతకాలిక ప్రత్యయాలు - 'ఏ', 'ఏ̤'. అక్కడక్కడా 'ఇన' రూపాలుకూడా వినిపిస్తాయి -

'తిట్టేరు', 'బలవంత్ పెట్టేడు'; 'చేస్నేరు', 'ఒగ్గేశేరు', 'రాశేడు'; 'అడిగినారు'. 'ఏ'కారోచ్చారణ స్థానికోచ్చారణ. 'ఏ̤'కారం ( ɛ̄ ) కోస్తా మాండలిక ప్రభావంవల్ల కావచ్చు. అక్కడక్కడా 'అ'కారం కూడా వినిపించింది. కానీ అందుకు నిదర్శనాలు అంత గట్టివి కావు.

భూతకాలిక ప్రత్యయానికి ముందున్న ప్రాతిపదిక చివరి 'స'కారం 'శ'కారంగా మార్తుంది. ఈ మార్పు వికల్పం.

ఉదా:-"చేశేర్", "గట్టేశేరు", "తగిలీశేరు", "తీశ్శారు", "మానేశేను", "రాశేడు", "పాశెయ్", "ఇచిశేరు".

తద్ధర్మార్థకం :- దీన్ని ఇక్కడి వాడుకలో కింది ప్రత్యయాల ద్వారా సూచిస్తున్నారు.

ఈ ప్రత్యయాలు :- "తున్", "త", "తా".

అమహత్ ప్రథమపురుష ఏకవచన ప్రత్యయం ముందు వచ్చే ప్రత్యయాలు "తున్; "త".

ఉంటుంది : బస్తా లవ్‌తది.
బాదపడుతుంది : కడుప్ నిండ్‌తది
చెప్తుంది : తీస్కెల్తది : అడుతది

కొందరు వ్యవహర్తల్లో 'తా' కూడా వినిపించింది - అంటే, "...నాగే వుంటాది", "అనడూతాది", "ఉంటాది" వంటి రూపాలన్నమాట. ఈ రూపాలు మిగతా పురుష ప్రత్యయాల ముందు ఒచ్చే 'తా' ప్రత్యయ రూపాలైన

రశీటిస్తాడు(-...ఇస్ + తా + డు)
చూస్తాడు-(చూస్ + తా + డు)
డెయ్‌లిస్సదువ్‌తాను - (....స్సదువ్ + తా + ను)

ఒస్తాయి - (ఒస్ + తా + యి) రూపాల సామ్యం (analogy) మీద ఏర్పడి ఉండొచ్చు. అట్లాగే హ్రస్వ 'త'కార రూపాలు ("చేస్తరు") కూడా అక్కడక్కడ వినిపించేయి.

'త'కార రూపాలు (వస్తది, చేస్తది) శిష్టుల్లోనూ, శిష్టేతరుల్లోనూ కనిపించడం విశేషం. కానీ 'తున్', 'త'కార రూపాలు బ్రాహ్మణ బ్రాహ్మణేతర భేదాన్ని స్పష్టంగా చూపిస్తున్నాయి.

వర్తమాన కాలం :

ఉదా : "చూవ్‌స్తున్నాను" (చూస్తున్నాను).
"చూస్తునోవ్ఁ" (చూస్తున్నాం)
"చూస్తున్నారు" (చూస్తున్నారు)

ఈ రకమైన క్రియల నిర్మాణ క్రమం (pattern) శిష్టభాషా వ్యవహార లక్షణంగా ఉంది. శిష్టేతర భాషలో ఇంకోరకమైన నిర్మాణక్రమం కనిపిస్తుంది. వర్తమాన కాలిక రూపాలు శత్రర్థక ప్రత్యయమైన 'తూ' మీద 'ఉన్-క్రియా రూపాలతో ఏర్పడతాయి. అయితే ఈ 'తూ' ప్రత్యయం 'తా'గా కూడా కనిపిస్తుంది. అంటే "వస్తా, చేస్తా, ఇస్తా" వంటి రూపాలమీద ఉన్నాడు, ఉన్నారు మొదలైనవి చేరి దీర్ఘాచ్చుమీది 'ఉ'కారం లోపిస్తుంది.* రెండు దీర్ఘాచ్చులు ఒకదాని

* భద్రిరాజు కృష్ణమూర్తి : తెలుగు మాండలికాలు; కరీంనగర్ వాడుక - తెలుగు మాండలికాలు, కరీంనగర్ జిల్లా.

వెంట ఒకటి ఒచ్చినప్పుడు వాటిల్లో ఒకటి హ్రస్వం అవుతుంది. పైసూత్రాలవల్ల

అడుగుతా + ఉన్నావు—→*అడుగుతానా్నవు—→"అడుగుతౌన్నవు" -

ప్రయత్నంచేస్తా + ఉన్నాను—→*ప్రయత్నం చేస్తానా్నను—→
"ప్రయత్నం జే స్తన్నాను"

అమ్ముకుంటా + ఉన్నాను—→*అమ్ముకుంటానా్నను—→
"అమ్కుంతన్న"

అతను తీస్తా + ఉన్నాడు—→*అతను తీస్తానా్నడు—→"అతన్దీ స్తన్నాడు"

కష్టపడ్తా + ఉన్నాం—→*కష్టపడ్తానా్నం—→"కట్టపడ్తాన్నం"

పురుష ప్రత్యయం ముందు దీర్ఘాచ్చు వికల్పంగా హ్రస్వం కావటంవల్ల కింది రూపాలు ఏర్పడుతున్నాయి.

ఒస్తా + ఉంది—→ఒస్తాంది—→ఒ స్తంది.

ఉదా :- "షిప్పొ్వ స్తంది; మజ్జిగ పట్కొ్క స్తంది; పిండవే స్తంది".

ఇంకొక మార్పు ద్విరుక్త 'న'కారం అద్విరుక్తమై పురుష ప్రత్యయం ముందున్న అచ్చు లోపించడంవల్ల కింది రూపాలు సిద్ధిస్తున్నాయి -

అంటా + ఉన్నాడు—→*అంటానా్నడు—→అంటాన్నడు
—→*అండానడు—→ అంటాండు.

అట్లాగే - లేస్తా్రను; అంతా్రను.

సమస్త క్రియలు : పూర్ణార్థకాన్ని సూచించడానికి ఉపయోగించే ప్రత్యయాలు "-ఏస్", "-పో". ఇక్కడి వాడుకలోని "-ఈస్", - ఏస్ కి పర్యాయ రూపం.

| | | | |
|---|---|---|---|
| ఉదా :- | ఇచ్చే శేను | దెర్ కొచిస్సెడు | అయ్ పెంది |
| | బేగొచ్ సేవ్ | చేశీశేరు | దిగ్ పేనండి |
| | తీశేశ్ కోన్ | ఇచిశేరు | జరిగిపోతంది |
| | మార్చేసేరు | మానిశెల్లెండి | ఎండిపేంది |
| | దిగబెట్టేశ్నేడు | ఒచ్చిశెవ్ | తేగ్గిపొయెండి |
| | కట్టిశేరు | చెప్పేసి | పెల్లెయ్ పోతుంది |
| | పడెశ్ శేరు | ఒగ్గేశేరు | |
| | కొటిశేరండి | తగిలీశేరు | |

నామ విభక్తులు :-

నించి :- జిల్లా నించి; వేరుసెనగ జ్యూలయ్ నించీ నొంబర్ వర్కూ పంట.

నుంచి :- ఏటిండయ్న వాళ్ళొకుడా ముందు నుంచి చివరొర్కూ చాలా జేగ ర్తగ వింఢవ్.

కాడకి :- మైంవ్ వ్హావ్‌మంతుడిచ్చిన్ కాడ్‌కి మంవూ పుట్టిన్ కాడ్‌నించీ యేంవూ...

కాడనించి :- కాశీ కాణ్ణించి ఇయన్నీ తిరిగ్‌నాను

కాడ :- ఆ గంంగ తిటేగే కాడ చూడాల

దగ్గిరలో :- కనీ మాకు దగ్గిర్లో వేర్సెనగ లేండ్సేవిం లేవు

మీదన :- యెనకాల్ రొండుగదుల్దోక్కోస్స మీందనీ అ అది అంతస్తు అద్దో రొండు గదులు

న :- తెలుగున్వ్‌తాయ్ (తెలుగులో అవుతాయ్)

తెలుగవ్‌తాయ్ (తెలుగులో అవుతాయ్)

ఇంగ్లీషోతయ్ (ఇంగ్లీష్లో అవుతాయ్)

లోపుని:- కేవలం కాలార్థకంలోనే వాడుతున్నట్టు కనిపిస్తున్నాది.

''అతనికిచ్చి నన్ను పెళ్లిచేసేవా సరే, నేక్కోపోతె తెల్లవారిలోపునీ నానువ్వ్యా ఏ నూతులో గోతులో పడక తీర్దన్నా --''

కంటా :- ''మిగతా డయ్‌లెక్ట్సంటే అవన్నీ కొంచువ్ం దీర్గంగా ఉంటాయ్ మాదానికంటా --''

తాలూకా :- నీ తాలుకా ఆ వుద్ఉకాన్ని ఆ స్తాయిని నీను ఆపలేను, అనపగించలేను

క్రియావిశేషణం ఐన '-ఏ' ఇక్కడి వాడుకలో 'ఈ' గా కూడా వినిపిస్తుంది :

''మామ్మూల్‌గా ఫీ శిక్స్ వర్కూ చదివే నొయ్‌తె మామ్మూల్‌గా ఇచ్చేవారు''

''తగుల్‌కుండీలా ఉంటి''; ''నువ్వుండీలా వుంటి''; నష్టంవొడ్డీలా ఉంటి'' మొదలైనవి.

అపదాది వర్ణాల లోపాలు : అపదాదిన 'క, ఖ, గ, వ' తరుచుగా ఈ ప్రాంతపు వాడుకలో లోపిస్తుంటాయి. కింది ఉదాహరణాల్లో ఈ లోపాలవల్ల సిద్ధించిన కొన్ని మాటలను చూడొచ్చు.

'క'కార లోపం :

లేకపోతే ⟶ లేపొతె

కాకపోతే ⟶ కాపొతే

పట్టుకపోయినం ⟶ బట్టూపోనవ్ం

సంపాదించలేకపొయేను ⟶ సంపాదించలేపొయేను

మరొకటి ఒస్తుందో ⟶ మరోటొస్తుందో

రాకపోతే ⟶ రాపోతే

'క'కారం 'హ'కారంగా మారిన సందర్భాలు కూడా కొన్ని కనిపిస్తాయి. వాటిట్లో కొన్ని :

రొం౦డెహ్‌రాల (రెండు ఎకరాల)

ఒహానాడు (ఒకనాడు)

'ఖ' కారంలోని మహాప్రాణత్వం లోపించి 'క' కారంగా మారి తరవాత లోపించడం ఊరిపేరైన 'విశాఖపట్టణం'లో కనిపిస్తుంది.

విశాఖపట్టణం—>విశాకపట్టణం—>విశాపట్టణం.

'శ' కారానికి పరంగా - అంటే తాలవ్యాలకి పరంగా - 'అ', 'ఇ' ల పర్యాయ రూపత ఉందికాబట్టి 'ఇశేపట్టఁదాకానూ'...వంటివి కూడా వినిపిస్తాయి.

'గ' కారలోపం: 'గ' కార లోపంమీదసిద్ధించిన కొన్ని పదాలు కింది విధంగా ఉంటాయి :

| | |
|---|---|
| యెవర్నడూతాడు (ఎవర్ని అడుగుతాడు) | అడితే (అడిగితే) |
| అకిడేంజరూతుందో (అక్కడ పంజరుగుతుందో) | బోలేదా (బాగులేదా) |
| పెరిపోతుంటాయ్ (పెరిగిపోతుంటాయి) | బ్రోఉంది (బ్రాగుంది) |
| ఎలూబంటి (ఎలుగుబంటి) | ఆపిస్‌దైర (ఆఫ్ఫిస్ దగ్గర) |

'వ' కారం 'ఒ' కారం కావడం: అపదాదిన 'వ' కారం 'ఒ' కారం కావడానికి కొన్ని ఉదాహరణాలు :

ఉండోడు (ఉండేవాడు), కట్టోరండి (కట్టేవారండి), మంచోడని (మంచి వాడని)

చిన్నోళ్ళు (చిన్నవాళ్ళు), చోడోరొంౘ (చోడవరం).

'చిన్నవాళ్ళు' లో 'వ' కారానికి పరంగాఉన్న 'అ' అచ్చు సంవృతమై 'ఒ' కారంగామారి, సంధి సూత్రాధారంగా 'చిన్నోళ్ళు' సిద్ధిస్తుంది. ఇదే పరిమణామం మిగతా పదాల్లోకూడా కనిపిస్తుంది. ఈ పరిణామానికి లోనవని పదాలు కొన్ని ఈ విధంగా ఉంటాయి : నడాల (నడవాల), తర్త (తరవాత), పిల్లడ్‌కి (పిల్లవాడికి)

వాఁన్‌గుఱాలా పండాలా (వానకురవాలి. పండాలి).

పదం చివరి అక్షరలోపంవల్ల ఉత్పన్నమైన కొన్నిపదాలు కిందివి-

అందుచేత—>అంద్‌చేత—>*అంచ్చేత—>అంచేత

అట్లాగే- ఎంచేత (ఎందుచేత)

*సాంఘికవ్యవస్థ-భాషాంశాలు:* భాషలో ప్రాంతీయ భేదాలే కాకుండా సాంఘిక భేదాలు కూడా ఉంటాయని మనం ముందే అనుకున్నాం. అంటే భాషావ్యవహారంలో భేదాలుండడానికి ఆ సమాజవ్యవస్థే కారణం. సామాజిక కారణాలవల్ల ఏర్పడిన సమూహాలమధ్య భాషావ్యవహారానికి అవరోధం కలిగినప్పుడు ఏర్పడే భేదాలకి సాధారణంగా మూడుకారణాలు కనిపిస్తాయి. అవి చదువు, వృత్తి, కులం. ఈ మూడు సామాజిక అంశాలూ భాషా వ్యవహారాన్ని అనేక విధాలుగా ప్రభావితంచేస్తాయి. ఒకొక్కక్క భాషా సమాజంలో ఒకొక్కక్క అంశం భాషా భేదాలను నిరూపిస్తుంది. అంటే ప్రతిభాషా సమాజంలోను ఒకే అంశం భాషా భేదాలకి కారణంగా ఉండదు. కొన్ని భేదాలు అంశసంయోగం వల్లనే సాధ్య

పడ్తాయి. అట్లాగే భాషా భేదాలన్నీ వ్యవహ_ర్త సాంఘికస్థితిని తెలియపర్చేవిగా ఉండవు. ఈ విషయాల్ని పరిశోధించడానికే విశాఖపట్టణంజిల్లా పర్యటన జరిగి నప్పుడు కింది సామాజిక తరగతులు ఎన్నుకున్నాం :

1. రచయిత
2. టీచరైనా, లెక్చరర్ అయినా;
3. ఉద్యోగి (బేంక్, పంచాయత్ ఆఫీస్)
4. రాజకీయ కార్యక_ర్త
5. స్టూడెంట్లు
6. వ్యాపారి (వ్యాపారంలో పెద్ద, చిన్న)
7. రైతులు (చదువుకున్నవారూ, చదువులేనివారు)
8. కులవృత్తి వాళ్ళు.

సాధ్యమైనంతవరకూ భిన్నకులాలనుంచీ భిన్నవయఃపరిమితులనుంచీ తీసుకున్నాం. వ్యవహార ఖండికలను పరిశీలిస్తే కొన్ని ఆసక్తికరమైన విషయాలు తెలుస్తాయి.

మొదట రచయిత వ్యవహారాన్ని పాలమ్మి వాడుకతో పోల్చినప్పుడు కింది లక్షణాలు తెలిసేయి :

పాలమ్మివాడుకలో 'ట' కారం 'త' కారం కావటం - "పెదప్పిలకీ ఒక నలపైయ్ ఏళ్ళుంతయ్"

సంయుక్తాక్షరమైన 'స్త' 'త్త' కావటం- "ఇల్లిగో చూడికడ డబ్బాల్ జేత్తడు..."

ఈ రెండు లక్షణాలూ రచయిత వ్యవహారంలో లేవు. అంటె శిష్ట వ్యవహారానికీ జానపద వ్యవహారానికీ కొట్టొచ్చినట్లుగా ఈ రెండు లక్షణాల్లో భేదం కనిపిస్తుంది.

35 ఏళ్ళ ఉద్యోగి వాడుకను 50 ఏళ్ళ రైతు వ్యవహారంతో పోల్చినప్పుడు-

'చ' కారం 'స' కారం కావటం: 'సాకరిసేస్కొపోతే

'స' కారం 'చ' కారం కావటం:'వేరిచెనక్కాయల'

'ట' కారం 'త' కారం కావటం : 'కూచుంతడు'

పదాది 'వ' కారం లోపించడం : "ఆళ్ళు, ఆడు, ఈడొచ్చి" వంటి లక్షణాలు రైతు వ్యవహారంలో కనిపించేయి. ఈ పై లక్షణాలన్నీ ఉద్యోగి వ్యవహారంలో లేవు. అట్లాగే 'స్త' కారం 'త్త' కారం కావటం రైతు వ్యవహారంలో కనిపించదు.

నడివయసువాడైన రైతు (చిన్న వ్యాపారి : కొంచెం చదువున్నవాడు) వ్యవహారాన్ని అనుభవంగల రాజకీయ కార్యక_ర్త వాడుకతో సరిచూసినప్పుడు రైతువాడుకలో 'స్త' కారం 'త్త' కారం కావటంకానీ, 'ట' కారం 'త' కారం కానీ, 'స' కారం 'చ' కారం కావటం కానీ కనపడవు. కానీ పదాది 'వ' కారలోపం ఈలు (వీళ్ళు), అల్లకీ ఈల్లకీ (వాళ్ళకీ వీళ్ళకీ); 'చ' కారం 'స' కారం కావటం

టం కొడిసంపేర్ (కొట్టిచంపేరు), సంపియమన్నారు (చంపెయ్యమన్నారు) వంటి లక్షణాలు మాత్రం కనిపిస్తాయి. ఈ లక్షణాలేవీ రాజకీయ కార్యకర్తలో కనిపించవు.

ఈ పోలికలవల్ల 'స్త' → 'త్త'; 'ట' → 'త'; 'చ' → 'స', పదాది 'వ' - కారలోపాలు జానపద (అంటే చదువులేని వాళ్ళ) వ్యవహార లక్షణాలనీ ఇవిలేని వాడుకంతా ప్రామాణికం/శిష్ట వ్యవహారం అనీ అనుకోవచ్చు.

కానీ సమాజంలో నడిమితరగతి వ్యవహర్తలని పరిగణింప బడుతున్న వ్యాపారుల, విద్యార్థుల వ్యవహారాన్ని అటు శిష్టులతోనూ ఇటు జానపదుల తోనూ పోల్చి చూసినప్పుడు ఒక రకమైన ద్విముఖ పరిణామం ఉన్నట్టు కనిపిస్తు న్నాది. వీళ్ళల్లో అటు శిష్టుల లక్షణాలూ ఇటు జానపదుల లక్షణాలూ కనిపిస్తాయి.

నలభై ఏళ్ళ పెద్దవ్యాపారిని ఇరవై ఏళ్ళ స్టూడెంట్‌తో పోల్చినప్పుడు పదాది వ- కార లోపం, 'న' కారం 'ల' కారంగా పలకడం, 'ట' కారం 'త' కారం కావటం మొదలైన లక్షణాలు విద్యార్థి వాడుకలో కనిపించేయి. ఈ లక్షణాలు పెద్దవ్యాపారి వాడుకలో లేవు.

ఇరవై అయిదేళ్ళ చిన్న వ్యాపారి వాడుకను ఉద్యోగి (35 సం॥-బ్రాహ్మడు) వ్యవహారంతో పోల్చినప్పుడు మూర్ధన్యతాలోపం (ళ→ల), ఒత్తులు లేకపోవడం వంటి లక్షణాలు చిన్నవ్యాపారిలో కనిపించేయి. కానీ ఉద్యోగి వాడుకలో ఇవి కనిపించవు.

అదేవిధంగా రచయిత, రాజకీయ కార్యకర్త భాషాభేదాలను పరిశీలించి నప్పుడు ఒత్తులు లేకపోవడం మినహా వీళ్ళిద్దర్లో ఉచ్చారణ పరంగా అంతగా పెద్దభేదాలు కనపడవు. అక్కడక్కడా మూర్ధన్యతాలోపం (వెళ్లు క్రియలో) కని పించినా మొత్తంమీద మూర్ధన్యోచ్చారణను పాటించడం జరిగింది. మహా ప్రాణాలు రచయితలో ఎక్కువగా ఉన్నట్టు కనిపిస్తుంది.

పై పోలికలు చదువు రీత్యా జరిగిన సామాజిక విభజనని సమర్థిస్తున్నాయి. అంటే వ్యవహర్తల విద్యాభ్యాసం పెరిగిన కొద్దీ వాళ్ళ భాషలో 'సమరూపత' అనేది ఒరవడ్తున్నాది అని చెప్పాలి. భాషలోని 'నాజూకుతనం' విద్యాభ్యాసం వల్ల ఒస్తుందని స్థూలంగా పైలక్షణాలు నిర్ణయిస్తున్నాయి.

వ్యవహర్తల చదువు ప్రాతిపదిగా తీస్కున్నప్పుడు పైన అనుకున్నవి సమర్థంగా కనిపిస్తాయి. కానీ కొన్ని లక్షణాలు-ముఖ్యంగా 'ఉంటది', 'చేస్తది', 'తీస్కెల్తది', 'రయ్యెనెల్పోద్ది' వంటి పదాల్లో తద్ధర్మార్థక ప్రత్యయం వంటివి విద్యాభ్యాసానికి అతీతంగా ఉన్నట్టుంది. అట్లాగే శత్రర్థకరూపాలైన 'చూస్తంది', 'ఒస్తోంటయ్', 'చేస్తనార్' 'ఉంటాండ్', 'పోడుజేస్తనారు' వంటి రూపాలు రాజ కీయకార్యకర్తలోనూ ఉద్యోగి (కాపు; మాడుగుల) లోనూ కనిపిస్తాయి. కానీ బ్రాహ్మణ కులానికి చెందిన ఏ వ్యవహర్తలోనూ ఈ రూపాలు అసలు కనిపించవు. కాబట్టి కొన్ని లక్షణాలను కులం ప్రాతిపదిక మీద కూడా ఆధారపడి చెప్పాల్సిన అవసరం కలుగుతున్నది. ఈ రెండు అంశాలు (చదువు, కులం) భాష, భాష

లోని అనుకరణయత్నాన్ని ప్రభావితం జేస్తున్నాయి. ఈ రెండిట్లో 'చదువు' 'కులం' కంటే 'ఇన్ఫ్లుయెన్షల్గా' ఉంది అని అనడానికి ''రచయిత, టీచర్, లెక్చెరర్ల '(బ్రాహ్మణేతర్లు) వ్యవహారఖండికలు ఒక నిదర్శనం. వీళ్ళ వాడుకలో పైన చెప్పిన క్రియారూపాలు కనిపించవు. కాబట్టి విశాఖ వాడుకలో ఒక వ్యవహార్త వాడుక తను పొందిన విద్యాభ్యాసాన్ని ప్రతిబింబిస్తున్నదని పైన జరిగిన ఆలోచనకు సారాంశంగా చెప్పచ్చు.

# 5

# కరీంనగర్ - విశాఖ జిల్లాల భాషలు

## (ఒక తులనాత్మక పరిశీలన)

**పులిగడ్డ శివానంద శర్మ**

ఈ పరిశీలన నిమిత్తం కళింగ మండలంలో వున్న విశాఖ జిల్లాలోని చోడవరంనుండి ఒక వ్యవహర్తనూ, తెలంగాణాలో వున్న కరీంనగర్ జిల్లాలోని వేములవాడనుండి ఒక వ్యవహర్తనూ ఎన్నుకోటం జరిగింది. వీళ్లిద్దరూ కాపు కులానికి చెందినవాళ్లు. ఇద్దరూ కూడా మేస్త్రీ పని చేస్తున్నవాళ్లు. ఇద్దరికీ చదువురాదు. ఇద్దరి వయస్సులూ దాదాపు సమానం—ఒకరి వయస్సు 27 సం॥లు, మరొకరిది 30 సం॥లు. వీరిలో వేములవాడ వ్యవహర్త ప్రధానవృత్తి వ్యవసాయం అయినప్పటికీ పది సంవత్సరాల నుండి మేస్త్రీ పని కూడా చేస్తున్నాడు.

భిన్నకులాల వారి మధ్య, భిన్నవృత్తుల వారి మధ్య, భిన్నవయస్కుల మధ్య, భిన్న విద్యాస్థాయులుగలవారి మధ్య వారు మాట్లాడే భాషల్లో భేదాలుంటాయ్. అటువంటి భేదాలను తొలగించి, ఒక్క ప్రాంతీయతే ప్రాతిపదికగా శిష్టేతరభాషల్లో వున్న వైవిధ్యాలను పరిశీలించే దృక్పథంతో ఈ ఎన్నిక చేయటం జరిగింది.

వేములవాడ వ్యవహర్త ''వ్యవసాయం, ఇళ్లు కట్టడం'' అనే విషయాల మీద మాట్లాడాడు. చోడవరం వ్యవహర్త ఒక జానపదగాథను చెప్పాడు. ఈ వీరి రెండు పాఠాలే యీ పరిశీలన కాధారాలు.

### A. వ్యవహర్త లిద్దరిలోవున్న సామ్యాలు

#### 1. వర్ణనిర్మాణానికి సంబంధించినవి

*1. అ కారం ఒ కారంగా మారటం :*

పదాదిలోనూ, పదమధ్యంలోనూ కూడా యీ మార్పు గోచరిస్తుంది.

(a) పదాదిలో - (వే)* : తొవ్తమ్ (తవ్వుతాం)

(చో)* : బోబు (బాబు), మొనుశులు (మనుషులు), పోలు (పాలు), కొబురు (కబురు), బోవుంటుంది (బాగుంటుంది), డొబ్బు (డబ్బు).

(b) పదమధ్యంలో - (వే) : అడొవ్ (అడవి)

(చో) : మొకొం (మొఖం)

---

* వే = వేములవాడ; చో = చోడవరం.

2. పదమధ్యంలో అ కారం ఉ కారంగా మారటం :

(వే) : ఎకురం (ఎకరం)

(చో) : కొాంచువ్ (కొాంచం)

3. పదాదిలో ఎ కారం ఒ కారంగా మారటం :

(వే) : రొాండు (రెండు)

(చో) : రొాండు (రెండు)

4. శ్వాసధ్వని నాదధ్వనిగా మారటం :

(వే) : సబ్లై (సప్లై - ఆంగ్లపదం).

(చో) : తుబాకి (తుపాకి - ఉర్దూపదం).

5. మూర్ధన్యతా లోపం :

(a) ళ కారం ల కారంగా మారటం :

ద్విత్వ ళ కారం ద్విత్వ ల కారంగా మారటం అన్ని సందర్భాల్లోనూ జరిగే ప్రక్రియగా అగుపిస్తుంది.

(వే) : అక్కల్లు (అక్కళ్ళు), పొల్లు (పాళ్ళు), ఓల్లు (ఓళ్లు < వోళ్ళు < వాళ్లు), మల్లా (మళ్లా).

(చో) : కల్లు (కళ్లు), పెల్లి (పెళ్ళి), ఎల్లేడు (ఎళ్లేడు < వెళ్లేడు). చోడవరం వ్యవహర్త పలుకుబడిలో అలఘు ల కారం అసలు వున్నట్టే కనిపించదు. ద్విత్వాలఘు ల కార సందర్భంలోనే గాక, ళ త లను సంయుక్తంగా పలకవలసి వచ్చినప్పుడు గూడా యీ వ్యవహర్త లఘులకారాన్నే పలుకుతాడు. ఉదా : యెల్తున్నాడు (వెళ్తున్నాడు). అలఘులకారం వచ్చిన మిగతా సందర్భా లేమీ లేవు.

ఇక వేములవాడ వ్యవహర్త విషయంలో ద్విత్వాలఘు ల కారమొచ్చిన సందర్భాలే తప్ప తదితరములైన సందర్భా లసలే లేవు.

(b) ణ కారం న కారంగా మారటం :

(వే) : మూన్నెల్లు (మూణ్ణెల్లు).

(చో) : ఆభర్నం (ఆభరణం), రానీ (రాణీ), తచ్చనవ్ (తక్షణం). మూర్ధన్య న కారోచ్చారణ వీరిలో పూర్తిగా లేకపోలేదు. వేములవాడ వ్యవహర్త మాట్లాడినంతలో అది ఒకే ఒక్క 'ఇణ్లు' అనే మాటలో వచ్చింది. కాని, చోడవరం వ్యవహర్త పలుకుల్లో మూడుసార్లు వచ్చింది. ఉదా : గర్భిణీ, పెమాణీకవ్ (ప్రామాణికం), ముస్లవాణ్ణి (ముసలివాణ్ణి).

(c) ట కారం త కారంగా మారటం :

(వే) : తమాటా (టొమేటో - ఆంగ్ల పదం).

(చో) : వుంతాను (వుంటాను), వుంతుంది (వుంటుంది), చేస్కుంతాను (చేసుకుంటాను), తీసెల్లేతప్పుడు (తీసికెళ్లేటప్పుడు), మొ॥వి.

చోడవరం వ్యవహర్త లాగా వేములవాడ వ్యవహర్త క్రియా పదాల్లో

గాని, ఇతర వ్యాకరణ సంవర్గాల్లో గాని ఎక్కడా ట కారాన్ని త కారంగా ఉచ్చరించలేదు.

ఈ మార్పు చాలా తక్కువ సందర్భాల్లో మాత్రమే జరగటం కద్దు. ఇటువంటి మార్పు లేకుండా ఉచ్చరింపబడ్డ పదాలు ఉభయ వ్యవహర్తల్లోనూ వున్నై.

(వే): అనుకుంటమ్ (అనుకుంటామ్), తింటమ్ (తింటాం), తమాటా (టొమేటో-ఆంగ్ల పదం), కట్టుడు (కట్టటం) మొ॥వి.

(చో): కల్లంట (కళ్ళవెంట), బాట్న (బాటలో), బ్గో వుంటుంది (బాగుంటుంది) మొ॥వి.

కాబట్టి వీరిద్దరి భాషల్లోనూ యీ మార్పు క్వాచిత్కంగా జరుగుతుందని చెప్పొచ్చు.

*6. చ కారం స కారంగా గాని, శ కారంగా గాని మారటం :*

(వే): సిన (చిన్న), కిసిడీలు (కిచిడీలు), సెరనీలు (చెరునీళ్లు < చెరువు నీళ్లు), శేన్ల (చేన్ల < చేన్లో).

(చో): సాలవ్ (చాలవు), శిన్న (చిన్న), శేకిరి (చాకిరి), తీర్శ్కోలేక (తీర్చుకోలేక), బద్రపర్శి (భద్రపర్చి).

ఈ మార్పు సంభవించని సందర్భాలు కూడా వున్నై.

(వే): తెచ్ కుంటమ్ (తెచ్చుకుంటాం), నేర్చుకున్నివ్‌ (నేర్చుకున్నాం), వంచ్ కుంటమ్ (పంచుకుంటాం).

(చో): రచ్చించేడు (రక్షించాడు), తెచ్కోనీ (తెచ్చుకొని), చేస్కుంతాను (చేసుకుంటాను), చెప్ కోలేపోతున్నాను (చెప్పుకోలేకపోతున్నాను) మొ॥వి.

*7. వ కార లోపం :*

పదాదిలోనూ, పదమధ్యంలోనూ వున్న వ కారం లోపిస్తూ వుంటుంది.

(a) పదాదిలో: (వే): అంకాయె (వంకాయ), అడ్లు (వడ్లు), ఆనాకాలం (వానాకాలం), ఆనికి (వాసికి), అత్తె (వత్తె < వస్తె < వస్తే), ఏసంగి (వేసంగి), ఏత్తమ్ (వేత్తమ్ < వేస్తమ్), ఓల్లు (వోళ్లు < వాళ్లు).

(చో): యిదానవ్‌ (విధానం), యెల్పొయ్ (వెల్పొయ్ < వెళ్ళిపోయ్).

(b) పద మధ్యంలో: (వే): బాయి (బావి).

(చో): బాయి (బావి).

వ కార లోపం లేని పదాలు కూడా వీరి భాషల్లో వున్నయ్.

(వే): వరి, వాన, వేరె (వేరే), ఇద్ వార్ కు (ఇంతవరకు).

(చో): వత్తడం, వైభోగంగా, వచ్చే.

*8. వర్ణాలు సమీకరణం చెందటం :*

(వే) : (a)పారి_త్తమ్ (పారి_స్తమ్), పండి_త్తమ్ (పండి_స్తమ్), ఇ_త్తె (ఇ_స్తె), జే_త్తిమి (జే_స్తిమి), ఒ_త్తయ్ (ఒ_స్తయ్) మొ॥వి., (b) అదబ్బిగడు (అర్ధబ్బిగడు).

(చో) : (a) గజ్జించి (గర్జించి), బాత్తో (బాధతో), తచ్చనవ్ (తక్షణం), రాశ్శసా ? (రాక్షసా ?), (b) అన్నోన్నెంగా (అన్యోన్యంగా), గ్గేపకవ్ (గ్నేపకమ్ < జ్ఞాపకం), అద్దుష్ట్ మంతుడు (అదృష్టమంతుడు).

వీటిలో వేములవాడ వ్యవహర్త భాషలోవన్నీ, చోడవరం వ్యవహర్త భాషలో (a) కెదురుగా వుదహరించినవీ తిరోగామి వర్ణ సమీకరణాలు (పూర్వ వర్ణం పరవర్ణంతో సంపూర్ణ సమీకరణం చెందగా ఏర్పడినవి).

స్ + త్ > త్త్ (పారి_త్తమ్, మొ॥వి), ర్ + ద్ > ద్ద్ (అద్దబ్బిగడు),
ర్ + జ్ > జ్జ్ (గజ్జించి), ద్ + త్ > త్త్ (బాత్తో),
క్ + ష్ > ష్ష్ > చ్చ్ (తచ్చనవ్), క్ + ష్ > ష్ష్ > శ్శ్ (రాశ్శసా ?)

చోడవరం వ్యవహర్త భాషలో (b) కెదురుగా ఇచ్చిన వుదాహరణలు పురోగామి వర్ణ సమీకరణ (పరవర్ణం పూర్వవర్ణంతో సంపూర్ణ సమీకరణం చెందిన) సందర్భాల్లోవి.

న్ + య్ > న్న్ (అన్నోన్నెంగా), ద్ + ర్ > ద్ద్ (అద్దుష్ట్ మంతుడు)

గ్ + న్ > గ్గ్ (గ్గేపకవ్).

తిరోగామి వర్ణసమీకరణాల సందర్భంలో ఉదహరించబడ్డ 'తచ్చనవ్', 'రాశ్శసా' అనేవి 'తక్షణం', 'రాక్షసా?' అనే మాటల్లోవున్న ష కారాలు వర సగా చ కార శ కారాలుగా మారి ఏర్పడటం గమనార్హం. బహుశా 'రాశ్శసా?' అన్నపదం 'రాక్షసా?'లో వున్న ష కారం చ కారంగా మారి, ఆ చ కారం మళ్లా శ కారంగా మారి ఏర్పడి వుంటుంది. చ కారం శ కారంగా మారటం ఇతని భాషలో వున్న లక్షణమే. (చూ. పే.).

*9. మహాప్రాణలోపం :*

చాలా సందర్భాల్లో మహాప్రాణ ధ్వనిని వీరు ఉచ్చరించక పోవటం కన బడుతుంది.

(వే) : తరిక (తరీఖా < తరీక్హా - ఉర్దూపదం), తలం (థలం < స్థలం), చెయాన (ఛేఆన - ఉర్దూ సమాసం), ఆటాన (ఆఠాన - ఉర్దూ సమాసం), అద్దబ్బిగడు (అద్దబ్భిగడు < అర్ధబ్భిగడు - మిశ్రమ సమాసం).

(చో) : బార్య (భార్య), బర్త (భర్త), బూతం (భూతం), (బాద), (బాధ), సమాదానవ్ (సమాధానం), విదానం (విధానం), మొకొం (మొఖొం < ముఖం). వేములవాడ వ్యవహర్త పాఠంలో ఎక్కడా మహా ప్రాణోచ్చారణ గల సందర్భాలు లేవు. కాని చోడవరం వ్యవహర్త విషయంలో కనీసం రెండు కనిపిస్తయ్. ఉదా : గర్భిణీ, ఆభర్నం.

*10. సంయుక్త వర్ణ సూక్ష్మీకరణం :*

(వే) థలము (స్థలము), నాల్ (నాల్గ్ < నాలుగు)

(చో): స్రీ(స్త్రీ), పెమాణ్ కవ్(ప్రామాణికం), పెకారంగా (ప్రకారంగా), పాంతవ్ (ప్రాంతం), పాయం (ప్రాయం), వుధాగా (వ్రుథాగా < వృధాగా), శూరుడు (సూర్యుడు), లశ్మి (లక్ష్మి), గేస్ (గ్లేస్ - ఆంగ్లపదం). ఈ సూక్ష్మీకరణమన్నది సంయుక్తంగా వచ్చిన రెండు మూడు వర్ణాల్లో ఏవర్ణాన్నైనా వదలి వేయడం ద్వారా జరుగుతుంది. అది ఫలానా వర్ణమే అయ్యుండాలని చెప్పటం కష్టం.

*11. సంయుక్తవర్ణ సులభీకరణం:*

(వే) బిలేక్ (బ్లేక్ - ఆంగ్లపదం)

(చో) పరసు (పర్స్ - ఆంగ్లపదం), రేతిరి (రేత్రి < రాత్రి)

సంయుక్త వర్ణంలో వున్న ధ్వనుల మధ్య దాని తరవాత వచ్చేస్వరంతో సామ్యంగల స్వరం చేర్చటం ద్వారా ఇది సాధిత మౌతున్నది. హలంత సంయుక్త వర్ణాంతమైన పదంలో, సంయుక్త వర్ణంలోవున్న పూర్వ ధ్వనికి ముందున్న స్వరానికి సామ్యంగల స్వరాన్ని చేర్చటం జరుగుతుంది.

*12. సంయుక్తీకరణం :*

(వే): ఎర్వు (ఎరువు), ఎవ్రు (ఎవరు)

(చో): వార్స్నుడు (వార్సుడు < వారసుడు), కూత్రు (కూతురు), ముస్లవాణ్ణి < ముసలివాణ్ణి), ఆశకొల్ది (ఆశకొలది), కోర్న వెడ్ల (కోరినవెడల < కోరినఎడల), బద్రపర్శి (బద్రపరశి < భద్రపరచి).

ఈ మార్పు రెండో అక్షరం (Syllable)లో వున్న అచ్చును వదలివేయటం మూలంగా సాధిత మౌతున్నట్లు గమనించవచ్చు.

*13. స్వరదీర్ఘీకరణం:*

(వే): పది మాందిమ్ (పదిమందిమ్), పెదమాన్సి (పెదమన్ < పెద్దమన్షి) సినావ్డ్ (సినవ్డ్ < చినప్డ్ < చిన్నప్పుడు)

(చో): అన్నాది (అన్నది).

*14. స్వరహ్రస్వీకరణం:*

(వే): పుట (పూట), తిర్ (తీర్ < తీరు), సల్ (సాల్ < సార్ల్ < సార్లు), వేరె (వేరే), పొతమ్ (పోతమ్), కుర (కూర), గడపర (గడపార < గడ్డపార), నె (నే < నేను), తర్వత (తర్వాత), రువయ్ (రువాయ్ < రూపాయ్), మకు (మాకు), అతమ్ (ఆతమ్ < యాతమ్ < ఏతమ్).

(చో): గ్సుడా (గూడా).

*15. ద్విత్వ లోపం :*

(వే): కొదిగ్గ (కొద్దిగ), గడపార (గడ్డపార), నువు (నువ్వు), సిన (సిన్న < చిన్న), నీలు (నీల్లు < నీళ్లు), గట (గట్ట < గట్ల), పెద (పెద్ద), కశెత్తమ్ (కట్టేస్తమ్), కట్కుంటమ్ (కట్టుకుంటాం).

(చో): నాలు (నాల్లు < నాళ్ళు), తట్కోలేక (తట్టుకోలేక).

ఇది ఉచ్చారణ త్వర వల్లగానీ, ఉచ్చారణా సౌలభ్య సాధన ప్రయత్న సందర్భంగా గానీ జరుగుతుంటుందని చెప్పవచ్చు.

*16*. *వర్ణ వ్యత్యాయం :*

(వే): బంద్రలు (బందర్లు).

(చో): తవిలేశ్శేరు (తవిరేశారు < తరివేశారు).

ఇది వేములవాడ భాషలో తాడితమైన రేఫకూ, పార్శ్వక లకారానికీ మధ్యనూ, చోడవరం భాషలో తాడితమైన రేఫకూ, అంతస్థ వకారానికీ మధ్యనూ యేర్పడింది.

*17*. *పదాది హ కారం లోపించటం :*

(వే): ఇసాబ్ (హిసాబ్-ఉర్దూ పదం).

(చో): అక్కు (హక్కు).

## 2. పద నిర్మాణానికి సంబంధించినవి :

వేములవాడ, చోడవరం వ్యవహర్తలిద్దరిలోనూ బహువచన ప్రత్యయాలూ, చతుర్థీ విభక్తి ప్రత్యయాలూ, క్త్వార్థక ప్రత్యయాలూ సమానమే. అవి వరుసగా- -లు, -కి/-కు, -ఇ/-ఈ లు. కింద నిచ్చిన పట్టికలు చూస్తే యీ విషయం యిట్టే సుబోధకమౌతుంది.

| | వేములవాడ | చోడవరం |
|---|---|---|
| బహువచన రూపాలు : | కట్టెలు | కబుర్లు |
| | గుంటలు | |
| | ఎడ్లు | |
| | పోరగాల్లు | |
| | ఇణ్లు | |
| చతుర్థీ విభక్తి రూపాలు : | ఎకరానికి | బీదవాడికి |
| | ఎకురానకు | బార్యకు |
| | మీంకి | దెగ్గరికి |
| క్త్వార్థక రూపాలు : | గోర్రుగొట్టి | తీస్కొచ్చి |
| | జెస్కొనీ | తెచ్కొనీ |
| | పండవెట్టి | కర్చుపెట్టి |
| | జంజేసి | బద్రపర్చి |

## B. వ్యవహర్త లిద్దరిలో వున్న భేదాలు

### 1. వర్ణనిర్మాణానికి సంబంధించినవి

(a). *వేములవాడ వ్యవహర్తలో మాత్రమే కనిపించేవి :*

*1. క కారం గ కారంగా మారి ఊష్మీకరణం చెందటం :*

సాలుగ్హ్ (సాలుకు), లోగ్హమ్ (లోకం), ఇగ్హ (ఇక)

*2. ప కారం వ కారంగా మారటం :*

వెట్టి (పెట్టి), వెడ్త (పెడ్తే), రువయ్ (రుపయ్ < రూపాయ్), వొద్దాక (పొద్దాక), పండవెట్టి (పండపెట్టి), నీలువెడ్తమ్ (నీళ్లుపెడ్తాం), వంచ్ కుంటమ్ (పంచుకుంటాం).

*3. ఊష్మీకరణం :*

జ్హర్ పోతది (జరిగి పోతుంది), బ్హషిడ్ తది (బషిడ్ తది), పురాగ్హ (పూరాగా), గ్హంగ్హ (గంగ), తగ్హడ్ (తగడు), గ్హొద (గొద), ధ్హారగొడ్తమ్ (దారగొడ్తమ్), కొదిగ్హ (కొద్దిగ), లోగ్హమ్ (లోగమ్ < లోకమ్), ఇగ్హ (ఇగ < ఇక), గ్హుంటలు (గుంటలు), పురుగ్హు (పురుగు), సాలుగ్హ్ (సాలుగ్ < సాలుకు) మంచిగ్హ (మంచిగ), మొ॥వి.

ఇతని భాషలో నాదధ్వనులు మాత్రమే ఊష్మీకరింపబడటం గమనార్హం. ఆధ్వనులు స్పర్శాలుగానీ, స్పృష్టోష్మాలు గానీ మాత్రమే అయ్వుంటయ్.

(b). *చోడవరం వ్యవహర్తలో మాత్రమే కనిపించేవి :*

*1. అ కారం ఎ కారంగా మారటం :*

రేతిరి (రాతిరి < రాత్రి), శెరే (శరే < సరే), దెగ్గర (దగ్గర).

*2. ఇ కారం ఉ కారంగా మారటం :*

ఉప్పుడు (ఇప్పుడు).

*3. ఓ కారం ఏ కారంగా మారటం :*

చనిపేయింది (చనిపోయింది), పడిపెయారు (పడిపేయారు < పడి పోయారు).

*4. డ కారం న కారంగా మారటం :*

జరగనాన్కి (జరగడానికి), మాట్లానానికి (మాట్లాడ్డానికి).

*5. స కారం చ కారంగా మారటం :*

వేచంగి (వేసంగి), చరే (సరే), చెలవు (సెలవు), సరాచరి (సరాసరి), అనవల్చిన (అనవల్సిన).

*6. ష కారం శ కారంగా మారటం :*

పురుశులు (పురుషులు), మొనుశులు (మొనుషులు < మనుషులు),

మనిశి (మనిషి), లశ్మి (లషిమ్మి < లక్ష్మి), రాశ్శసా? (రాష్షసా? < రాక్షసా?)

*7. రేఫ ల కారంగా మారటం :*

తవిలేశ్శేడు (తవిరేశ్శేడు < తరివేఁశాడు), దెగ్గల్కి (దెగ్గర్కి < దగ్గరకి), యెవల్ కూడా (యెవర్‌కూడా < ఎవరూకూడా), డిక్లే (డిక్రే < డిక్రీ - ఆంగ్లపదం).

*8. ల కారం స కారంగా మారటం :*

నేస్పేడు (లేప్పేడు), నేకోప్తే (లేకోప్తే < లేకపోతే), తన్స్కుంటే (తల్స్కుంటే < తలుచుకుంటే, నోనికి (లోనికి).

*9. వ కారం గ కారంగా మారటం :*

బందుగులు (బందువులు < బంధువులు), అనపగించలేదు (అనభవించలేదు < అనుభవించలేదు).

*10. పూర్ణానుస్వారం రావటం :*

కోంపడితే (కోప్పడితే), అన్నాండు (అన్నాడు), అన్నాంది (అన్నాది < అన్నది).

*11. అతి ప్రమాణీకరణం / అతి నాగరీకరణం :*

వెక్కువ్ (ఎక్కువ), విరుగ్గా (ఇరుగ్గా < ఇరుకుగా), వింతగా (ఇంతగా), వెవడికో (ఎవడికో), వెడల (ఎడల), వేదో (ఏదో), వివరాజు (యివరాజు < యువరాజు), సమ్మర్దస్త (సమ్మర్దత్త < సమర్థత).

వీటిలో ఎక్కువ పదాలు, వాటిలో ప్రథమ ధ్వనియైన వివృతాచ్చుకు ముందు వ కారం జేర్చటం మూలంగ యేర్పడినవే. ఇవి 'వేడి', 'వింత', 'విరుపు' మొదలైన శబ్దాలు మదిలో మెదులుతుండటంచేత అదేలాగున ధ్వనించేట్టు వ్యవహర్త పదాద్యచ్చులకు వ కారం చేర్చి ఉండవచ్చు. 'తీసుకొత్తే', 'మర్దిత్తే' అనే రూపాలకంటే 'తీసుకొస్తే', 'మర్దిస్తే' అనే రూపాలు సరియైనవనీ, నిర్దుష్టాలనీ యెరిగి వుండటంచేత యీ వ్యవహర్త 'సమర్థత' అనే పదాన్ని 'సమ్మర్దస్త'గా పలికి వుండవచ్చు.

## 2. పద నిర్మాణానికి సంబంధించినవి.

వేములవాడ వ్యవహర్త మాట్లాడిన వాక్యాల్లో ఒక్క వాక్యంలో కూడా వర్తమాన కాల వాచక లేక శత్రర్థక క్రియ వాడబడలేదు. అందుచేత అతని వ్యవహారంలో అవధిక (Durative) ప్రత్యయం ఎలా వుంటుందో చెప్పటానికి వీలు కలగలేదు. చోడవరం వ్యవహర్త వాక్యాల్లో మాత్రం ఈ ప్రత్యయం పురుష లన్నింటిలోనూ ప్రామాణిక రూపాలకు అనుబంధంగానే -తున్నా- రూపంలో వున్నది. [ఇతని భాషలో క్రియా రూపాలన్నీ ప్రామాణిక భాషకు సంబంధించినవే.]

కానీ, వేములవాడ వ్యవహర్త భాషలో భూతకాల ప్రత్యయాలు ఉత్తమ పురుష బహువచనంలో -తి-, -ని- అని రెండు సందర్భాల్లో లభించినయ్. (ఉదా: జేస్తిమి, నేర్చుకున్నివ్ఁ). ఒకే ఒక్క రూపం మాత్రమే ప్రథమ

పురుషైకవచన పుంలింగేతర వాచకంలో వచ్చింది. (ఉదా : ఉండె). ఇది గ్రాంథిక రూపమో, లేక మాండలిక రూపమో చెప్పటం కష్టం. స్పష్టంగా మాండలిక రూపమని చెప్పదగినది 'బావుర్ని' అనే పదం. ఇది తెలంగాణాలో ప్రథమపురుష బహువచనంలో మనుష్య వాచకాల్లో వాడబడే పదం. దీనిలో ప్రత్యయ రూపం -ϕ- అన్న మాట. కానీ, ప్రామాణిక భాషలో భూతకాల ప్రత్యయ రూపాలు -ఏ-, -ఇన్- లు. వీటిలో రెండవది ప్రథమ పురుషైక వచన పుంలింగేతరాల్లో వస్తుంది. మొదటిది మిగతా అన్ని సందర్భాల్లోనూ వస్తుంది. ఈ ప్రామాణిక భాషా ప్రత్యయ రూపాలే చోడవరం వ్యవహర్త తన భాషలో వాడ్తాడు. భూత కాల క్రియలు వాడేటప్పుడు అంత తరచుగా ఏవార్థకాలు (emphatics) వాడటం అతనిలో ప్రత్యేకత. (ఉదా : గెంటీశేడు, వుటికిశింది, అడ్డీశేడు, ఇచ్చీశేనండి, దింపీశినా - మొ॥వి).

తద్ధర్మార్థకాల్లో, చోడవరం వ్యవహర్త భాషలో ప్రత్యయాలు తా-, -తుం- అయితే, వేములవాడ వ్యవహర్త భాషలో వాటిలో మొదటిదాని హ్రస్వ రూపమైన -త- అన్ని సందర్భాల్లోనూ ఏకైకంగా అగుపిస్తుంది. అంటే, ప్రథమ పురుషైక వచన పుంలింగేతరాల్లో -తుం-, ఇతరత్రా -తా- చోడవరం వ్యవహర్త భాషలో వుంటే, వేములవాడ వ్యవహర్తభాషలో అన్నిటా -త- వున్నదన్నమాట.

వర్తమాన, భూత, తద్ధర్మార్థక క్రియా స్వరూపాల్లో కానవచ్చే కాల ప్రత్యయాల్లో వీరిద్దరి మధ్యా గల భేదాలు యీ కింది పట్టికలు చూస్తే తేట తెల్లమౌతాయ్.

*1.* భూతకాల ప్రత్యయాలు :

| | వేములవాడ | | చోడవరం | |
|---|---|---|---|---|
| ఉ-ఏ- | * | * | -ఏ-(ను)/ -నా-(ను) | ఇచ్చీశేను, నోస్కున్నాను |
| బ- | -తి-(మి)/ -ని-(మ్) | జేత్తిమి, నేర్చుకున్నిమ్ | * | * |
| మ-ఏ- | * | * | * | * |
| బ- | * | * | * | * |
| ప్ర-ఏ-పుం- | * | * | -ఏ-(డు) | అడిగేడు, రచ్చించేడు, గెంటీశేడు, మొ॥ వి. |
| ఇతరం- | -ఎ-(ϕ) | ఉండె | -ఇన్-(ది) | అయ్‌పోయింది, చనిపేయింది, వుటికిశింది మొ॥ వి. |
| బ-మ- | -ϕ-(రి) | బావుర్ని | -ఏ-(రు) | జరిపేరు |
| ఇతరం- | * | * | -ఏ-(య్) | గడిచిపొయేయ్ |

## 2. తద్ధర్మార్థక ప్రత్యయాలు :

| | వేములవాడ | | చోడవరం | |
|---|---|---|---|---|
| ఉ-ఏ- | * | * | -తా-(ను) | బతుక్తాను, వుంతాను, చేస్కుంతాను |
| బ- | -త-(మ్)/ -ట-(మ్) | పండిత్తమ్, దున్తమ్, ఇసుర్తమ్, తెచ్కుంటమ్, మొ॥వి. | * | * |
| మ-ఏ- | * | * | -తా-(వు) | ఇస్తావు, చేస్కుంతావు |
| బ- | * | * | * | * |
| ప్ర-ఏ-పుం- | -త-(డు) | అత్తడు | * | * |
| ఇతరం- | -త-(ది) | జర్ పోతది, పండ్తది, ఐతది, మొ॥ వి. | -తుం-(ది)/ -టుం-(ది) | వుంతుంది, తీర్పోతుంది, బోవుంటుంది, మొ॥ వి |
| బ-మ- | -త-(రు) | గడ్తర్, ఇత్తరు | * | * |
| ఇతరం- | -త-(య్) | ఐతయ్, ఒత్తయ్. | * | * |

పై పట్టికల్లో : 1. ఉ-ఉత్తమపురుష, మ-మధ్యమపురుష, ప్ర-ప్రథమపురుష, ఏ-ఏకవచనం, బ-బహువచనం, పుం-పుంలింగం, మ-మనుష్యవాచకం.

2. వ్యవహర్తల పాఠాల్లో దొరకని క్రియారూపాలూ, వాటిల్లో వుండే ప్రత్యయరూపాలూ * గుర్తుతో సూచింపబడ్డయ్.

3. కుండలీకరణంలో ఇచ్చినవి పురుషప్రత్యయాలు.

భావార్థక (gerundive) ప్రత్యయాల్లో యీ వ్యవహర్త లిద్దరికీ మధ్య వైవిధ్యం పూర్తిగా కనబడుతుంది. అవి వేములవాడలో -ఉడు, చోడవరంలో -అడవ్ం. తృతీయా విభక్తి లేక కరణకారక (associative & instrumental) ప్రత్యయాల్లోనూ, హేత్వర్థక (conditional) ప్రత్యయాల్లోనూ వీరిద్దరికీ దగ్గర సామ్యం ఉంది. తృతీయా విభక్తి ప్రత్యయం చోడవరంలో -తో అయితే, వేములవాడలో -తోని / -తోన్ / -తొని / తొన్. అట్లే హేత్వర్థక ప్రత్యయం చోడవరంలో -తే అయితే, వేములవాడలో అదీ, దాని హ్రస్వరూపమైన -తె రెండూ వాడుకలో వున్నై. సప్తమీ విభక్తి లేక అధికరణకారక (locative) ప్రత్యయ రూపాలల్లో వేములవాడలో వుపయోగంలో వున్న కొన్ని రూపాలూ, చోడవరంలో వుపయోగంలో వున్న కొన్ని రూపాలూ తేడా యేమీ లేకుండా వున్నయ్. కానీ, వేములవాడలో -లె అనే రూపం కూడా వుంది. ఆ రూపం చోడవరంలో కనిపించదు. చోడవరంలో -లో, -న అనే రూపాలు వేములవాడలో

కనబడవు. ఈ ప్రత్యయాల్లోనే గాక, అనుబంధాల్లో (post positions) కూడా వారి మధ్య తేడాలున్నయ్. ఉదాహరణకు, చోడవరం అతను వాడే 'మీద' అనే అనుబంధానికి బదులుగా వేములవాడ అతను 'మీన' అని వాడటం ఒకటి.

ఈ పై భేదాలు కింది పట్టికలు చూస్తే సుబోధకా లవ్తాయ్.

| | వేములవాడ | | చోడవరం | |
|---|---|---|---|---|
| | ప్రత్యయాలు | ఉదాహరణలు | ప్రత్యయాలు | ఉదాహరణలు |
| భావార్థకం- | -ఉడు | గట్టుడు, దున్నుడు | -అడవ్ ( | అడగడవ్ (, రాడవ్ (, వత్తడం. |
| తృతీయా విభక్తి- | -తోని/ -తోన్ -తొని-/ -తోన్ | బలంతోనీ, ఇత్కెతోని, తట్టల్తోని, మంటితోన్, పారతొన్ | -తో | రొమాల్తో, బాత్తో (బాధతో) |
| హేత్వర్థకం- | -తె/-తే | వెద్తె, ఇత్తె, పెద్తె, అత్తే. | -తే | అడిగితే, కేకవేస్తే, కబురుజేస్తే |
| సప్తమీ విభక్తి- | -ల/-లె/ -ల్ల | అన్ల (అందులో), శేన్ల (చేన్లో), ఇంట్లె (ఇంట్లో), వూళ్లె (వూళ్లో), సెల్కల్ల (సెలకల్లో). | -లో/-లా -న/-ల్ల | నూతులో, గోతులో, సమ్యావ్ (లో, నూతిలో, వూళ్లో, కొంపలో, ఇంట్లా, దగ్గిర్లా, ఇంటిన, నాలు కల్లల్ల, నోలల. |
| | మీన | అడొవ్ మీన (అడవి మీద), మీంకెల్లి (మీదకెళ్లి) | మీద | చేతుల్మీద, టేబుల్ మీద. |

## 3. పదజాలానికి సంబంధించినవి

వేములవాడ వ్యవహర్త భాషలో ఉర్దూ పదాలు విరివిగా వాడటం జరిగింది. ఆ పదాలేవంటే : కైకిలు (కూలి), కస్‌పె (వృత్తి), ఖషిడ్‌తది (ఇస్తుంది), ఫురాగ్ (పూర్తిగ), తరిక (< తరీకా = మాదిరిగా), తగ్గడ్ (మంచిరకపు), తొడెమ్ (కొంచెమ్), ఇసాబ్ (< హిసాబ్ = లెక్క), సుతార్ (మేస్త్రీ),

చె (<ఛె=ఆరు), చార్ (నాలుగు), ఆట్ (<ఆఠ్ = ఎనిమిది), బంజేసి (మూసేసి/ఆపేసి) మొ॥వి. ఇతని భాషలో ఇంగ్లీషు పదాలు బహు తక్కువ. ఉదా: మోటర్ (motor), కరెంటు (current), సైప్లై (supply). ఇవికాక కొన్ని proper nouns కూడా కనబడ్తయ్. అవి: ఎండ్రిన్ (Endrine), ఊరియా (Urea), తమాటా (tomato). కానీ సంస్కృత పదాలు ఇంకా తక్కువగా వుంటయ్. ఉదా: లోగ్గమ్ (లోకం), థలవ్ (స్థలం).

ఇలా కాకుండా, చోడవరం వ్యవహర్తలో సంస్కృత పదా లెక్కువగా కనబడ్తయ్. ఉదా: భార్య, భర్త, స్త్రీ, గర్భిణీ, ధర్మం, అనవసరం, రక్షించు, భద్రపరుచు, గర్జించు, సమాధానం, అదృష్టవంతుడు, మహాలక్ష్మి, తక్షణం, ప్రకారం, ఇష్టం, వైభవం, సమర్థత, ధరించు, భూతం, భయం, బాధ, దుఃఖం, ప్రయత్నం, అనుభవించు, మొ॥వి. ఇతని భాషలో ఎక్కువగా ఉర్దూ పదాలు లేకపోయినప్పటికీ అసలు లేవని చెప్పటానికి వీలులేదు. ఉదా: హక్కు, తుపాకి, ఖర్చు, రుమాలు, ఫిర్యాదు. కొన్ని ఇంగ్లీషు పదాలు కూడా యిత నుపయోగించాడు. ఉదా: డిక్రీ (decree), పరసు (purse), సడన్ (sudden), టేబుల్ (table), టయామ్ (time).

వేములవాడ వ్యవహర్త భాషలో గోచరించే కొన్ని ప్రాంతీయ పలుకుబళ్లు: రౌతు (రాయి), గట్ల (అట్లా), అన్ల (దాంట్లో), పొడ్గాలె (పొద్దున్నే), సెరనీలు (చెరువు నీళ్లు), మక్క (మొక్కజొన్న), గడ్క (జావ), పొక్క (గుంట), మంచిగ్గ (బాగా), దినవ్ (రోజు), మొ॥వి.

చోడవరం వ్యవహర్త భాషలో కనపడే కొన్ని ప్రాంతీయ పలుకుబళ్లు: సర్దుమానవ్ (సర్దుబాటు), చక్కవుంగ (చక్కగా), (బర్తకిలాగ) చెడిపొయ్యేను (కాకుండాపోయాను), అత్తరువూ (అత్తరూ), కూరడిగేను (ఉపకారం చెయ్యమని అడిగేను), యెల్పోయ్ రావాలి (రావాలి), యెల్లిపోరామ్మని (రమ్మనమని), మొ॥వి.

## పరిశీలనా సారాంశం

వ్యవహర్తలిద్దరిలో వున్న ముఖ్య సామ్యాలు - అల్ఘు లకారం లేకపోవటం, మూర్ధన్యోష్మం లేకపోవటం, పదాది హకార లోపం, మూర్ధన్యానునాసికం బహు తక్కువగా ఉచ్చరింపబడటం తరచుగా కానవచ్చే పదాది వకార, ద్వితీయాక్షరాంతర్గత హ్రస్వాచ్చు లోపాలూ, క్వాచిత్కంగా జరిగే ద్విత్వ లోపం, అరుదుగా జరిగే వర్ణ వ్యత్యయాలూ, మొ॥వి - వారి "శిష్టేతర"త్వాన్ని సూచిస్తయ్.

పోతే, వాళ్ళల్లో వుండే వ్యత్యాసాలు వాళ్ళున్న ప్రాంతాల కారణంగా ఏర్పడినవేనని చెప్పొచ్చు. అవి:

1. వేములవాడలో స్వరదీర్ఘీకరణ, హ్రస్వీకరణాలు ఎక్కువగా జరుగుతయ్. ఇది చోడవరంలో బహు తక్కువ.

2. వేములవాడలో మహాప్రాణ లోపం పూర్తిగా జరుగుతుంది. చోడవరంలో చాల ఎక్కువగా మాత్రమే జరుగుతుంది.

3. సప్తమీ విభక్తి (locative), హేత్వర్థక (conditional), తృతీయా విభక్తి (associative or instrumental) ప్రత్యయ రూపాల్లోనూ, 'మీద' అనే అనుబంధంయొక్క రూపాల్లోనూ వర్ణ నిర్మాణాల్లో దగ్గర సంబంధమున్నప్పటికీ తేడాలు చెప్పుకోతగినంతగా వున్నయ్.

4. భావార్థక ప్రత్యయ రూపాలూ, సమాపక క్రియా రూపాలూ రెండు కేంద్రాల్లోనూ చాలా భిన్నంగా వున్నయ్.

5. వేములవాడలో ఊష్మీకరణం తరచుగా జరుగుతుంది. చోడవరంలో అసలు జరగదు.

6. చోడవరంలో అతి ప్రమాణీకరణం తరచుగా జరుగుతుంది. వేములవాడలో అలాటిదేమీ కనిపించదు.

7. చోడవరంలో భూతకాలంలో సహాయ క్రియా ప్రయోగాలు (-ఏస్ చేరినవి) ఎక్కువగా వుంటయ్. వేములవాడలో అసలే వుండవు.

8. చోడవరంలో క్రియారూపాలన్నీ ప్రామాణిక రూపాలే. వేములవాడలోవి వేరే రూపాలు కలిగి వుంటై.

9. వేములవాడలో ఉర్దూ పదా లెక్కువ. చోడవరంలో సంస్కృత పదా లెక్కువ.

## లిపి సంకేతాలు : వివరణ

1. ౕ| అనునాసిక్యం : ఉదా. మావౕ
2. ̱ వివృతత్వం : ఉదా. బేంక్, గోడ
3. ̥ ఊష్మీకరణం : ఉదా. జ̥మ, కాఫి̥
4. ం| వర్గానునాసికం (ఙ, ఞ, ణ, న, మ)
5. డ̣ ఈషత్తాడితస్పర్శం

## వ్యావహర్త : 1

## వ్యాపారి

*కేంద్రం : విశాఖ , కులం : వైశ్య,*
*వయస్సు : 25 సంII, చదువు : ఎనిమిదోక్లేసు*
*వ్యావహారఖండిక : స్వవిషయం*

ఫ్టిఫ్త్ ఫ్హావ్ః వర్కు చద్వేనండి. నవల్సు ... ఆంధ్రప్రభా అయినా చదువ్ కుంటానండి. టయ్ముంటే చదివ్తాను,లేప్తై లేదండి. డేలీ పేపర్ చైదివ్తానండి. వీక్లీ తేర్బాట్లున్ ... మేవ్ః, డేలీ తెప్పిన్చవఁండి. చదివ్నవ్డు చదివ్ తావ్ః లేప్తైలేదు. అప్పుడవ్డు చదివ్తాను. రేడియో ఉంట్లో ఉన్నదండి. డెయ్లీ ఆలకిస్తుంటావ్ః. పిచ్చర్ మట్కి ఈ వీక్లీ వన్నార్టూ టైయ్మ్స్. ఒనింగ్లీష్ పిక్చరండ్ వన్ తెలుగూ. ఆర్ హిందీ. ఏటండీ ? తెలుగూ ఇంగ్లీషూ అప్పట్లో రాసేవాఁణ్. మామ్మూల్గా ఇమ్మూడే ఒచ్చుండి. ఎస్సల్సీ నెనెల్లేద్ కదండీ. పబ్లిక్లెల్లేదు. మామ్మూల్గా ఫిఫ్త్స్ వర్కా చైదివే నొయ్తె మామ్మూల్గా ఇచ్చేవారు. ఎయ్త్తు ఫ్టేండడ్లో హిందీ పబ్లిక్ ఎక్జేమ్నేశన్ పెట్లేదు. ఇంగిలీషె పబ్లిక్లో. హిందీ పెట్లేదు. అవ్డూ ఎయ్తూ ఫ్టేండడ్ పబ్లిక్లో ఫ్హోర్త్ ఫ్హారవ్ః హిందీ పెట్టేరు. ఫ్టిఫ్త్ ఫ్హారమ్ శిక్త్స్ ఫ్హారమ్ గుడా హిందీ ఉంది. నెన్ సెవెన్త్ ఫ్హారమ్ కుడా ఉందిగనీ నెన్ సెవెన్త్ ఫ్హార్ పబ్లికెల్లేద్ కదండి. డిస్కంటన్యూ చేస్సెను. మాకు మరి చదవ్డాన్కి వీల్లేక డిస్కంటిన్యూ చెయ్వల్సి వర్ సడన్గ ఇక్కడ్కి వొచ్చేవఁండి. మేవుః ఆ వూణ్ణించికడ్కి బిజినెస్ పెట్టపోయోసర్కి ఇంకైనక దున్ను ఎవ్రూ లేక డిస్కంటిన్యూ చేసెయ్వళ్సొచ్చింది. అతర్లో తెక్డో చేద్దారనుకునోవ్ః. అక్డ కొన్ని ట్రబుల్సు. కొన్ని ట్రబుల్సు వల్ల చాదవ్లేపొయానండి. అతల్మా గ్రేణ్మదర్ పోవ్డావ్ః ఇవన్నీ చికాకుల్ మీద శైవల్ ట్లావ్ అయ్పెంది. బిజ్నెస్లోనె దిగ్పేనండి. టౌవ్ఃన్లోనూ

కిరేణా అండూ రేశంష్షాప్. జెన్రల్. ఉమ్మాద్రిర్‌గా నడుస్తుంది. ప్రోఫిట్సు బయ్‌వూ రేష్షంల్లోక్ చాలా మటిక్ తగ్గిపొయెండి. ప్రోఫిట్స్ంవి లేదులేణి. ఇణ్ణోల్‌వంంటే మాకూ అపుడూ బోవుంండి గెనీంండి ఇప్పుడు లాబాల్‌కుడ తగ్గిన్చిశేరు. కొశ్లైకుక్కువయ్ పోడవ్వాంల్ల ఇవుడ్ లాబవ్ం కుడ తగిపేంది. ఉంటే మహాం త్రియార్ ఫోర్ పెర్‌సెంట్. దాన్‌మీదేనండి ఫ్యయ్ వైర్‌సంట్ కంటే ఎక్కువ్ రాదు. మ్యోమ్మూల్ ఇ రేమ్‌నయ్‌తె టూ పెర్‌సెంట్ ఇచ్చెడు. శుగర్‌కదీ లేదు. ఒన్రుపీ పర్ బేగ్. అంటే డబ్ మనిపిచ్‌కోడ్డొవ్ం బిల్స్ రాసివ్వడవ్ం టూనికి తుయ్యుడువ్ం అతర్ సెరుకులివ్వడ్డొవ్ం. అది కాగానే ఇంటికెళ్‌డమ్ తరాత సర్కుల్ కొండవ్ం. సరుకులు కొన్నాడు. లేఫోన్ లేని యెడల్ మళ్ళా వెంట్‌నే మూడు గంట్లకు శావ్‌కురావ్‌డవ్ం. అంతె. ఒస్సారి యేవీం లేక్‌పొయ్‌న్దన్‌కుంటే దర్లు బోగట్ట చెయ్‌డవ్ంకలా మార్కెట్ కెళ్దవ్ం దర్లు బోగ్గొటి చేస్తుంటావ్ం. రోజువారి దర్లెలాగున్న యో బోగట్ చియ్యేల్ కదండి. మేవ్ం అలా బోగట్ చేస్తుంటవ్ం. ఉయ్ అకౌంట్సుయియీ క్లోచేస్కుం టావ్ం. క్లోచ్చేస్కుని మీల్‌చెసీ ప ... పడుకున్ట్ ... మా ఫ్రెండ్సు బిజినెస్ మేన్సునారూ, స్టెడీ చేసివొల్ ఉన్నరండి. అయ్ క్లాస్‌మెట్సు అండు ఆఫీ సెర్సుగుడా ఉన్నారు. మాయింటిగారి తాలూకూ వోంగ్రణగార బ్బ్రయ్ ఇలం తాకుడవెస్ పక్కనేవుంది శ్రీ వెంకటేశ్వరా మెడికల్ స్టోర్సు. అయ్‌నా ఫ్రెండే. అ త్తర్రొవ్‌త అఫ్షీషల్స్ గన కొంతమంది ఫ్రెండ్స్ తెల్సు. ఇపుడు బిజినెస్ అయిం తర్వోతండి పెద్దవాళ్ళతోటీ చిన్నవాళ్ళతోటీ అందర్‌తోటీ మెలగాలి. ఇయ వ్వార్‌తోటీ విరోధివ్ం పెట్‌క్కోకూడ్‌దు మనొవ్ం. చిన్నవాల్తో విరోదివ్ం పెట్కున్నా చికాకే. పెద్దవాల్తో విరోదిమ్ పెట్కునా చికాకే. నార్మల్‌గ మనవ్ం యెలాగున్న మన్సులో మన మట్కి పోవాలన్‌మాటండి. అది బిజినెస్లో నేక్. తొగువ్‌లెనేవి బెటో్కకూడ్దు. ఏదెండి విశాపట్లొనండి. ఇంకె క్కడాలేనండి. నాకూ ఫిఫ్టిన్నియ్యే సెవిన్‌టీన్ ఇయ్యేర్స్‌వర్కూ అన్నాకపల్లో ఉన్నాను. ఆ తర్వాతిక్‌డ మళా ఎయ్‌టియర్స్ బెట్నుంచున్నాను. సెవిన్టీన్ ఇయ్యేర్స్ అన్నాకపల్లో ఉన్నానండి. ఎయ్‌టియెర్సూ ఉవ్‌డూ వయ్‌జేగ్. కడపా డిస్ట్రిక్ట్ నేన్ రాలేదండి. రాజ్‌మెండ్రి సయ్‌డ్‌మెట్కి వెల్లేనండి. అమ్లాపురొవ్ం ఆసయ్‌డు ఊాగవ్ం తీస్తూ మాట్లాడ్‌తారండి. మస్టిస్టర్ని ఒవ్‌క శిష్టి కజిన్ శిష్టర్నెమో అక్‌డ నూజివీడిచ్చొచేవ్ం. మా పెద సిస్టర్ యెల్‌డెస్ట

శిక్షర్నైమో రాజ్‌మెండ్రీ కిక్‌డా మాడుగులైన్‌కోండి మా బ్రదరిన్లా ఎమో అకడా వర్క్ చేస్తునారు. ఆ టెలిఫోన్ ఓప్రేటర్‌గాను. కొద్దిగా రాగంతీస్తూ మాట్‌సాగతీసి మాట్లాడ్తారాసయ్డు. గుంటూర్ క్రిష్నా సయ్డు విన్లేదండి. తెలంగాణాసయ్డు ఊలేదణ్. ఇటు తిరుపతీ మెడ్రాస్ వర్కెళ్ళేన్‌గనీ ఇటూ ఈసైయిడ్ రాలేదండి. హాయ్‌డ్రాబాదు రౌండ్‌ముడ్ మూడ్ సార్లొచ్చి విహ్యే .... వద్దారనోక్కని మిస్సెపెయారు. సారి మ అంకుల్తో ఆల్తో బైల్దే రేవఁ. ఆయన్కు ఉజ్జోగవఁ టయ్‌మ్‌లేదన్ చెప్పిసీ .... రేపు ఎప్రలూ మా మేఁనెల్లో వద్దారన్‌కుంటోవఁండి. అకడ మ అంకులోకాయ్న వర్క్ చెస్తె నారు. రమ్మన్‌మన్ కుడా లేటబ్రాసెరు. మాకు స్పష్టంగా మాట్లాడ్తవండి. మాట తడబడకుంటానూ. ఇదిలేకుండానూ. బోదపడ్తది. ఊఁ ఉంటదండి. లేబర్ మాట్లాడేరంటే ఆలోవ్ అదోవిదిగా మాట్లు యేవఁరా వొరేయ్ పారాహ్ అనివాళ్ మాట్లాడ్తారు. మనువఁ అలాగ మాట్లాళ్ళేవఁ కదండి. ఏరా అయా అంటారంటె. వనేయ్ అనెవి అలాగ చిన రాగరాగాల్ తీస్కుంటారు. ఏయ్‌తె మీర్ చిన్న మెంచీ మర్యాద్ లేకుంటా తండ్రి నేనె సరే అత్తనేసైరే ఒరే అప్పా అంటార్. చిన్నప్పుడు చిన్‌చిన్ నాట్‌కెల్లో ఏక్‌చెసేవాణ్ణండి. సోవఁర్ షోతు రంగయ్య అటువంటి ఆంద్ర శ్రీ డ్రామోటి మేష్టార్ వెగిర అద్ నేర్చకునాను. ఒ రౌండుమూడు డ్రామాల్లో యేసేనంతె. సోంగ్స్‌పాడేవాణ్ణి షోట్లు పాడేవణ్ణి. అసలూ ఫ్లేన్లో ఉన్నాను హాయ్‌డ్రాబాద్ ఒద్దావఁని. వీలవ్‌ట ల్లేదు. బిజినెస్లో లక్కీన్ బట్టి ఉంటదండి. వాక్‌వేళ్ళో లైమ్‌లో ఉండొచ్చు. ఒక్‌వేళ్ళో రాక్‌పోవొచ్చు. బిజినెస్సి దానికి కోసవఁ యెవ్‌డూ మనొవఁ తెచ్చి కూరోచ్చోలి, షావ్ గురిచ్చి. బేరవఁ ప్రతిసారి ఉండదు. మనకీమ బేరవఁ కోసవఁ మనొవఁ కాసు కూర్చోలిసిందె. వస్తే వొసారే యెక్కువ్‌గా బేఁర వొస్తది లేపెతే కాస్త ఖాళీగా వుంటది. అవ్‌డూ వొమాదిర్‌గా వుంటుంట దండి. నెలాకబ్రోజులు కదండి. నెలాకరోజులో ఒమాదిర్‌గా వుంటదండి. చిల్లర్ బేరివఁ ఎక్కువుంటది. ఫస్ట్‌తారీక్ రోజ్న మటికి నెలతైషఁల్లయ్ తీస్కా డొవఁలో కాస్తదమ్మిగా వుంటది. కొత్తరేషన్ కార్డ్లు ఆఫీస్‌నుండెచ్చేవఁ. రేపుట్ నుండి డిష్టిబ్యూషన్ చేస్తావఁండి. రేప్‌మజ్జానన్నుంచండి ఇంకమకూ మ షావ్ కాడోస్టేటి రావాలి. దన్నిటిక్‌చేసీ అషావ్ కవర్ డుష్టిబ్యూషన్ చేస్తావఁండి. యెలుండో డిష్టిబ్యూష్టో మటీక్ రేప్ మజ్జానుంచీ డిష్టిబ్యూష్న చేసెస్త

వంండి. అవ్‌నండి మాగూ ఇకాడ్నూ పదిహేనో తారిక్ వర్కూ మదైగిరున్చ కొన్ అతర్వాతా కాడ్డు ఫాండల్సు ఫాల్డర్స రాపోతే మెవ్వూం ఆఫీస్‌కంద్ జేసేస్తావ్. అ కాడ్సు. నాకు వొకదాన్మీదేట వొకటి రావడువ్‌లొనీ ఇరై షన్ శాప్ యేరేగుండెదండి. కిరాణశాప్ యేరేగుండేది. మంనవేటి ? మన్గావ్ యవర్ నమ్ముతె వాళ్ళే మన్ని గోతిలో ముంచేరు. వొక్‌సారై యెందికయ్‌నా పనొక్కస్తద్ గదా అనిసీ ఫయంద్రడ్ రుపీసు చీట్ ఫండ్ వరక్ కట్టేను. ఇల్లా ష్లోకి పాట పాడకుండాను. ఆడ సడన్‌గ కంపెనీ ఎతే తినేసైడు దివాల. నా మిసిశ్ డెలివరీలో అస్‌మో డైయ్‌డేపోల్సింది. యత్తవారింటికి చీపుర్‌పద్రి పంబించేను. మ మిసెస్నిటి. పంబిస్తెఆడేంచేస్తడూ? చాల నెగ్లెక్‌చేశ్నారు. ఆకడ్‌కీ మా మర్దలకీ మైరేజ్ అయ్‌తే తెనా సంగత్ పట్టించ్‌కుంటా ఆమైరెజ్ సందళ్ళొ ఉండిపేరు. అమర్నాడుకార్యన్‌మాటండి. కార్యవెంతే అరాత్తిర్ రాత్రిమిదా చాల ప్రమాద్‌స్తిత్లో ఉంటే సిక్టిరుపీస్ బసావ్‌కొనీ నయ్‌టికు నయ్‌టుక్ తీస్‌కొచ్చేవ్. ఫమ్ తారీక్న సరుకుల్ కొనీసి పడీస్‌కొచ్చిన్‌కదానెసి పడెనేద్‌కొని పడెసైన్. టక్కని బస్తాకిపాతిక ముప్పయ్ రూపాయ్లు డౌనయ్ పొయింది.దాన్తో త్రీ అంద్రడ్ రుపీసు. ఇది కొద్దిగా కోలుకొన్నాంంటె మా అమ్మాయ్ బార్సాల మాణ్ణెల్ల యింతరాత్ చేసిందానొక్క త్రీ అంద్రడ్ పోరంద్రడ్‌కర్చు. మొత్తమ్మీద్ టూ తౌవ్‌జండు ఒపోర త్రి అంద్రడ్ రుపీస్ మట్క్ ఫయ్ మన్త్స బైక్ జోబ్లో కొశ్చైర్ నావి సీటీ బస్లా. ఇదంత మళ్ తైవుర్‌కోవ్లంటె యే సవంచ్రన్నరో అవ్‌తది. పోడ వంంటే వైగిరంగ్ పొయేగాని మళ్ళా చేకూర్చకొంటె యైంతమ్ముతె మనొక్కస్త దండి? ఇప్పుడవి లాబాలొడి చుబ్రెంగ్ తైగ్‌వైండి. యొదుడ్నో వెత్తై ఆదు డ్లోనే. ఆడోళ్ దుకానాళ్ ణాల్ పెట్టియ్‌డవ్ ఇళ్ళదెగ్ర మొగొళ్ ఆపీస్లో కెలిపోడవ్. క్రిరాణా కొట్టు, ఏమ్‌బేరాలుంటాయ్ చపండి ? ప్రతి కిళ్ళికొట్టోడు కుడా అమ్మియ్‌డవేంనండి స్లాబ్లవీని. అసలు పోన్ శాపన్న విలూ పోయ్‌న్దద్ ఫెన్సీ ష్టోరయ్ పేంది. పాన్ శాప్సన్నిని. ఏమె డ్రగ్సేవేవా మందులూ అన్ని అమ్మేస్తున్నారు కిళీ శాప్లాను. ఇంకో మనకేటుంటద్ చైపండి? అసలు కాఫీ పొట్లాలయ్ యెందులో అమ్తారు? కిరాణా శాప్లో అమ్తారు. కిళ్ళీ శాప్లా అమ్మేస్తున్నార్. కాఫీ పొట్లాలు టీపొట్లాలు బెల్లోవ్ ముక్కోలు ఇయన్నిని. ఈవయ్‌జై గలా తయారయ్‌పేంది ఆకర్కి. వూరు మంచిదేనండి. పరావ్‌లేదు. కాని ఇ వూర్లో మటికి యెరిగి వొక నయాపైసా ఎరిగి ఎరువిచ్చావంంటే మన సొమ్ మనకొక్కదు మాసొప్తార్. మన మటికి యెప్పుడ్ కుడా అబువన్నది

ఇవ్వకూడ్దు ఎవర్‌కీని. అమ్మిందిపదిరూపాయ్‌లయ్‌నా రొక్కొంగ అముకుంశే మర్ దానంత సుబ్రవేయి లేదు. నేనలాగే చాల దెబ్ తినానండి. త్రై ల్వే క్వోటర్సోనీ క్వైరలాస్స ఆస్పైదు ఒచ్చుంశే క్రెడిట్ ఇచ్చేను. ఫస్టయ్ సరికి పేయ్‌మెంట్ అయ్‌పేది. కానండ్ చప్పా చెయ్‌కుండా సడన్‌గా ట్రేన్స్‌ఫర్ అయ్‌పొయ్‌డు. హయ్‌తే అలూ నా అలాగ వెయ్‌ర్రూపాయల్ వర్క్యా దెబ్ తినేశేను. అలాగ ఒసార్ అనుబయిన్తేనేగానీ సరియైన్‌దార్లో కైవ్‌డూ రాడు. నాస్టడీలో కూడా నేనెవ్‌డూ ఫేయ్‌ల్యూర్ అవడవ్ గుడా నెనెవ్‌డూ లేదండి. సడన్‌గ మార్చేసేరు మ ఫాడర్ కుడాను మనకి హిందీ పైద్ద టచ్చులేదుగనీ అన్నా పెల్లో మెస్టారూ ఇంగ్లీష్ గొప్ప లేంగ్వేజ్ చెప్పేర్‌లేండి. గ్రేమరూ అన్నీ కుడా బాగ చెప్పేరు. ఫస్‌చెవ్‌డంతో చాలమట్కి ఇంగ్లీషో - ఎయ్‌టియర్స్ ఐంది - అవన్నీ కుడా గుంటబెటి గంట వాయిన్చేసేరు. అసలు ఇప్పుడు మళ్ళొక్ సారి తిరగేస్తే పబ్లిక్ పరీక్ష కడ్దావన్ పిస్తుంది. ఇప్డిద్రు పిలలు చదువ్‌దారి ... నేం చదవ్‌డవ్ అవదు. ఎప్డి సవ్‌సారంతోటె సరిపోద్ది. ఇపిల్లలూ పెళ్ళవూం ఇంటి గొడవ్‌తోటి సర్‌పోతది. ఇంక రాత్తిర్లు ఎక్కడ్ తీర్బాటండి? పద కొండు గంట్లవొర్కు పది గంట్ల వొర్క్ ఇదయ్‌పోతెది. ఇంకెప్పుడు చదువా తది చెప్పండి? ఏదో ఒక్ ఆర్నెల్లు పాటు మ మిసెస్‌నేదో పంపించాల అమ్మ గారింటికి. ఇక్కడా మెట్రిక్ కశెద్దోవ్ అనిపిస్తుంది. డి ... గౌర్మెంట్ పరీక్ష కట్టెద్దావనె చూస్తునాను. ఇకడా ఎమ్‌జిఎమ్ స్కూలుంది చుసెరా, అందులో హిందీ పండితునారు. ఆయన్ చెప్తానన్నార్ కుడాను. అయిన్ దెగ్గిర్‌కెల్దావన్ చూస్తునాను. నాపుస్తకాల్ - మ యింట్లో ఒకాయ్‌నున్నార్ లేండి - ఆయింతో ద్వార సరె లేంగ్వేజ్ ప్రవేట్ కశెద్దావ్ అనుకుంటాన్నను. యెప్పడ్‌కవ్‌డె అస్రద్దయ్ పోతంది.

## వ్యవహార ఖండికలోని వ్యాకరణాంశాలు

*ధ్వని విభాగం :*

a. *మహాప్రాణాలు అల్పప్రాణాలు కావడం :* ఉదా : దర్లు (ధరలు); ఆంద్రప్రభా (ఆంధ్రప్రభా), బోగట్ట (భోగట్ట); రొక్కంగ (రొఖంగ); కర్చు (ఖర్చు); సుబ్రవేయిలేదు (శుభ్రం ఏమీలేదు). కానీ, విరోధివ్ (విరోధం), ఖళీగా వుంటది వంటిపదాల్లో మహాప్రాణోచ్చారణ పాటించడం శిష్టోచ్చారణ విశేషంగా చెప్పొచ్చు.

b. తాలవ్యీకరణం : ఉజ్జోగవ్ (ఉద్యోగం), మజ్జానుంచీ (మధ్యాన్నం

నుంచీ) వంటి పదాల్లో తాలవ్యీకరణం మీద వర్ణసమీకరణం జరిగింది.

c. *వర్ణసమీకరణం :* పరవర్ణంతో పూర్వవర్ణం సమీకరణం చెందడం 'పరీష్ష' (పరీక్ష), 'గురిచ్చి' (గురించి), 'పిచ్చర్' (పిక్చర్) వంటి పదాల్లో చూడొచ్చు. కానీ 'తీస్సుంటారు' (తీస్తుంటారు) లో పూర్వవర్ణంతో పరవర్ణం సమీకరణం చెందడం చూస్తాం. పై చెప్పిన సంపూర్ణ వర్ణ సమీకరణం చెందిన పదాలే కాకుండా పాక్షిక సమీకరణం చెందిన పదాలు కొన్ని ఈ వ్యాపారి వ్యవహారంలో కనిపిస్తాయి; ఉదా: వొత్సేవండి (వచ్చేసేవండి) - ఇందులో పూర్వవర్ణమైన 'చ' పరవర్ణమైన 'స' లో ఉన్న దంత్యతనుపొంది 'త' గా మారింది;

d. "చేసివోల్" (చేసేవాళ్ళు), "చిన్నవాల్తో" (చిన్నవాళ్ళతో), "పెద్దవాల్తో" (పెద్దవాళ్ళతో), "ఆల్తో" (వాళ్ళతో) వంటి పదాల్లో 'ళ' కారం 'ల' కారంగా మారడం ఈ వ్యాపారి భాషా వ్యవహారంలో ఒక విశేషంగా చెప్పుకోచ్చు. 'పెద్దవాళ్ళతోటి', చిన్నవాళ్ళతోటి', 'మళ్ళీ' ల్లోని 'ళ' కారోచ్చారణను పాటించడం ప్రమాణవ్యవహారంగా కనిపిస్తుంది.

e. భూతకాలిక ప్రత్యయాలలో 'ఎ', 'ఏ' ల పర్యాయ రూపత ఈ మాండలికంలోని విశేషంగా చెప్పొచ్చు. ఉదా : పెట్టేరు, వెల్లేనండి, చద్వేనండి, రాసెరు : ముంచేరు, పంపించేను, ఇచ్చెడు, తినేశేను. భూతకాలిక ప్రత్యయంలో 'ఎ' ఉచ్చారణ ఈ మాండలికానికి స్థానికంకాగా, 'ఏ' ఉచ్చారణ కోస్తా మాండలిక ప్రభావంవల్ల ఏర్పడింది. ఈ 'ఏ' ఉచ్చారణ ఈ వ్యవహర్త వ్యవహార పరిణామ దశకు ఒక గుర్తు.

f. *సమస్త క్రియలు:* విశాఖపట్నం ప్రయోగానికి కోస్తా మాండలికానికీ కొట్టొచ్చినట్టు కనిపించే భేదం మనకు సమస్తక్రియల ఉపయోగంలో ఎక్కువగా కనిపిస్తుంది. ఉదా: 'చేస్సేను' (చేసేసేను←—చేసివేసేను), 'కొట్సేర్'(కొట్టివేసేరు), 'తినేశేను' (తినివేశేను). ఈ సమస్తక్రియల ఉపయోగం 'భావ తీవ్రత'ను సూచించడానికి భూతకాలంలోనే ఉపయోగించడం గమనించదగిన విషయం.

g. *హల్లులోపం :* పదమధ్యన 'క', 'ఖ', 'వ' లు తరుచుగా లోపిస్తుంటాయి. ఉదా : 'లైపోతే' (లేకపోతే), 'రాపోతే' (రాకపోతే); 'విశాపట్నం' (విశాఖపట్నం); 'తరాత' (తరవాత), 'పోడవ్' (పోవడం); 'ఆడోళ్', 'మొగోళ్' (ఆడవాళ్లు, మగవాళ్లు) ('వ' ⟶ 'ఒ').

h. *తద్ధర్మార్థకం వాడకం :* తద్ధర్మార్థక అమహత్ ప్రథమ పురుషలో

'తున్' ప్రత్యయం బదులు 'త' ప్రత్యయం వాడుక ఈ వ్యవహర్త భాషలో ఒక విశేషం. ఉదా: 'పోతది' (పోతుంది), భేరవొస్తది (బేరంవస్తది), ఖాళీగావుంటది (ఖాళీగావుంటది). ఈ రకమైన వ్యవహారం శిష్టేతర భాషా వ్యవహారానికీ దెగ్గిర్గా వుంది. కానీ, ఈ భాషా వ్యవహారానికి కులం ప్రాతిపదికగా తీసుకోడానికి నిదర్శనాలు చూపించవచ్చు.

i. పర్యాయరూపత : 'ఇ' 'ఉ' ల పర్యాయరూపత అచ్చుల్లోనూ, 'ప' 'ఫ' ల పర్యాయరూపత హల్లులోనూ ముఖ్యంగా గమనించదగిన విషయాలు. ఉదా: 'ఉంట్లో ఉన్నదండి' (ఇంట్లోఉన్నదండి), ఉప్డూ (ఇప్పుడూ..); 'ఆఫీస్లో' (Office లో), 'ఫెన్సీస్టోరై పేంది' (Fancy store అయిపోయింది), 'కాఫీ' (Coffee), 'ఆఫీ సెర్సు' గుడా ఉన్నారు (Officers గుడాఉన్నారు). 'ప' ఉచ్చారణ శిష్టేతరభాషా లక్షణంగా చెప్పొచ్చు కాబట్టి 'ప' 'ఫ' ల పర్యాయ రూపత ఈ వ్యవహర్త భాషా వ్యవహార పరిణామ దశకు గుర్తు.

ఈ వ్యవహర్తలో మనకు బాగా కనిపించే ఇంకో విశేషం ఇంగ్లీష్‌మాటల వాడకం. ఈ ఇంగ్లీష్ మాటల వాడకం నిత్యవ్యవహారంలో పదజాలంలోనే కాకుండా పదనిర్మాణంలో కూడా కనిపించడం ఒక విశేషం. ఉదా: 'పిచ్చర్ మట్కా' (Picture మటుకూ...), 'డిస్‌కంటిన్యూ చేస్సేను' ( Discontinue చేసేసేను), 'స్టాప్ అయ్‌పెంది' (Stop అయిపోయింది), 'మిస్సెపొయారు' (Miss అయిపోయేరు), 'లేటర్రాసెరు', (Letter రాసేరు), 'లక్కిన్‌బట్టి ఉంటదండి' (Luck ని బట్టి ఉంటదండి), 'డెయ్‌డే పోల్సింది (Died అయిపో-వల్సింది). ఇంగ్లీష్ మాటల్లో స్వభాషలో లాగానే వర్ణసమీకరణం జరగడం ఇతని భాషలో చూస్తాం. 'పిచ్చర్ మట్కి'లో పూర్వవర్ణమైన 'క', పరవర్ణమైన 'చ' తో సంపూర్ణసమీకరణం చెందింది.

j. ఇంకొన్ని విశేషాలు : 'వద్దాం' బదులు 'వద్దారి' వాడుక : ఉదా - వద్దారనోకని మిస్సెపొయారు, 'వద్దారన్‌కుంటోవండి'. 'చేద్దాం' - 'చేద్దారి : చేద్దారనుకునోవ్ః;

'అలకిస్తుంటావ్ః' (వింటుంటాం); లేంగ్వేజ్ (Language) టూనికతయ్యుడువ్ః;

k. ప్రాంతీయ పలుకుబళ్ళు : ఇంకెనకదున్ను (ఎనక దన్ను - సహాయం) బోగట్ట - అంటి సమాచారం; 'వేగిరంగ పొయేగాని' .... అంటే తొందర్గగా

పొయ్యేయ్; 'సబ్రవ్వేఁయిలేదు' - సుఖం ఏమీలేదు; 'గుంటబెటి గంటవాయిన్చె సేరు' - నూరిపోశారు.

## వ్యావహర్త : 2
## లెక్చరర్

కేంద్రం : విశాఖ, కులం : తెలగ
వయస్సు : 38 సం॥ చదువు : ఎమ్.ఏ.;ఎల్ఎల్.బి
వ్యావహారఖండిక : భాష - విద్యావిధానం.

పర్లాకిమ్డీ; ఎలిమెంట్రి ఉమో అయ్‌స్కూల్ పాట్టవ్‌ది కాలేజి ఇంట్రమీట్ వర్కూ. పర్లాకమిడి ఒరిస్సా; దటీజ్ అప్టు ఎయ్‌టీన్ టు ట్వొంటీయర్స్; బియెస్సీ ఎమే ఎలెల్‌బి ఇ బెనారస్ ఇండు యూనివర్స్టి; ఫయ్‌వియర్స్; తెలుగులోనై ఊఁ సాదార్ణంగా చదివేది ఆంద్రప్రబ వీక్లీ; తర్వాత డెయ్‌లీ ఏతె పత్రిక అ రెగ్లర్గ కేజువల్గ ఒకాసారన్న చూస్తాను. ఫిక్షన్ తెలుగులో ఎక్కువ్ జదవనండీ; ఇంగ్లిష్లో జ ... ప్రోపర్జఁ...ప్రోపర్ నవల్సు సాదార్ణంగ ఇంగ్లీష్లోనె జదువ్‌తాన్ గాని తెలుగులో చాల తక్వ; షరత్తు నవల్సు కొని చదివేను; అవి కొన్ని బాగ్నే వుంటయ్: చదువ్‌తాను; తరువాత కొన్ని మన్ తిరుపతి కవులు వ్రాశిన ఫిక్షన్సుంటాయ్; అవికూడా నేన్ జదివేను; తరువాత అకేజఁల్‌గా చదువ్‌తాన్ గానీ విరివ్‌గా ఎప్డూ తెలుగులో నెకువ చదువ్‌లేదు; రేడియో న్యూసు సాదార్ణఁంగా యేడుగంటల్ తెలుగు న్యూస్ వింటాను; కొదిగ వేడుగంటల్ తెలుగ్‌న్యూస్ వింటాను; తరవాత గానకచేరి యేఁవఁన్నా వుంటే తెలుగులో చవ్‌తాను; వింటాను త్రీ యర్సైంది ఇప్పుడ్ సినిమా చూడ్డల్లేదు; మానేశేను; బిరక్తి పుట్టింది; నిజావ్ఁ; చిన్నప్పుడ్‌నుంచి నింట్రమీట్ వర్కూ చాల విరివ్‌గా సాదార్ణంగా సెకన్షో కెళ్లేవాళ్ళవ్ఁ; మా ఊర్లో సినిమా లేగ్పోతే ఒగ్ అయ్‌దు మైళ్లు దీ డిస్టెన్లోస్ సినిమా ఉంటే ఆ అఖ్ఖడికి ప రాత్రిపూట స్మశానవ్ఁ దాటి వెళ్లేవాళ్ళవ్ఁ; అలైగె రెండ్గంట్లకొచ్చేవాళ్ళవ్ఁ; తరవ్‌త జెన్రలీ ఏమ్ మరీ రాన్రాను ఇప్పుడు మానేసావ్ఁ; ప్రేక్టికలి నేసీన్‌శిక్ట్సి ఫోర్...ఇప్పుడ్ సినిమా

చూడవ్ఁలేదు; ఛార్లీ అయ్గొ; ఇంతకు పూర్వొవ్ఁ తెలుగే చూశేవాండ్లవ్ఁ; బెనారస్‌లో ఉండేటప్పుడు కూడా ఇపిక్చెర్సు సాదాఁర్ణంగా చూశేవాణ్ణి; కాని ఎందుకంటే హిందీ పిక్చెర్సు ఒచెవి; ఎప్పుడో ఒక్ ఫ్రెండ్తోస్ కల్సి గాయ్ ఒక్టో రెండో హిందీ పిక్చెల్ చూసేవాళ్ళవ్ఁ; ఇక్కడికొచ్చిన్తరావ్త కుడా పందొమ్మొందల యాభయ్ ఆర్నుంచీ అరవయ్ వర్కూ సాదారణంగా ఏదో ఒక్ పిక్చెర్ చూసేవాళ్ళవ్ఁ; ఇపుడూ పుర్తిగా దానిమీద విరక్తి పుట్టింది; చూడ్లేనుక్కడా; ఇంగ్లీషు మామ్మూల్లే అనొక్కండి; ఇంగ్లీష్ తెల్సును; తెలుగు మాత్రుబాష; నేనూ హిందీ మరి నేర్చుకోవల్సిన పరిస్తితి వొచ్చింది; చదవ రాదనొక్కండి; మఁర్ లోకల్గ మరి వొ రిక్షాం వళ్తా వీళ్తో వ్యాపారస్తుల్తో మాట్లాడ్డాన్కి వర్కింగ్ లేంగ్వేజ్ హిందిలొనూ తెల్సుక్నాను; ఒరియా దేశవ్ఁలొ కొంతకాల్తోఁ ఉండడవ్ఁవల్ల మా ఫాద్రూ వొరియాలొ వొఅఫిస్సాలో పన్చేడవ్ఁవల్ల వొర్యా కుడా కొంతమటుకుచ్చును. వొర్యా దేశవ్ఁలో పన్చేద్దయాన్కి నేను ట్రయ్ చేశేనుక్కడా; దాని గురించి వళ్ళూ పబ్లిక్ సర్విస్ కమిషన్ ఎక్జేమినేషన్ ఎపిర్ అవ్‌మన్నారు; అందులో వొరియా తట్టు స్టేండెడ్ వర్కూ చదువ్కోవల్నె అన్నారు. కొంతమటుక్ జదివేను. గేఁనీ ఎక్కువ్ ప్రావిఁణ్యావ్ఁ సంపాదించలేపొయ్యేను. గాఁని కొంచు కొంచువ్ఁ ఒటియా చదవ్డవ్ఁ ఒచ్చును. బాషకుడా^v మాట్లాడెవాఁణ్ణు. ఇప్పుడూ పూర్తిగా వొరియ్యాతో ప్రెచ్చి లేకపొడవ్ఁ వల్ల మర్చిపొయేన్. నేనూ వాళ్ మాట్లాడితే సీనర్ధన్చేసొక్కగల్ను. తిరిగి మరి జవ్వో విఁల్లేను ఒరియాలో. అదీ సోషల్ కోన్టేక్టుని సాదార్ణఁంగా ఇప్పుడూ ఇప్పుడూనూ లెక్చెరర్తోనే ఇశ్టాగోష్టి. ఎవ్డనా టెంపుల్స్కని వెళ్ళవ్ఁ. ఇ శిఁవాఁచెలవ్ఁ దెగిర్ కదండి. శివ్వాఁచెలవ్ఁ టెంపుల్ లేపతే ఎక్స్కర్షన్స్ అనీ కేజువల్గా మీటింగ్సనీ ఇంతక్పూర్వొవ్ఁ మెంబర్షిప్పుండేది ఈ గానకచెరి దింట్లోను. ఉప్పుళ్ళేదుగనీ ఎప్పుడన్న కల్చల్ మీటింగ్సు ఆంధ్రా యునివర్శిటీలోను కాన్ఫరెన్సెసూ యేఁవన్న మాకు ఇన్విటేషన్స్ ఒస్తే మేవేఁ వెళ్తుంటావ్ఁ. పొలిటిక్లోన్ సాజ్యవైఁయ్నంతగా మెవూఁ ఇంట్రష్టియ్రైన్స్ ఉండదు. ఎందుకంటే మాకు ఏ పార్టీ దింతొగుడా మాకూ ప్రేవడిజమ్ గనీ అసుయ్త గెనీ యేవ్ఁ ఉండదు కాబట్టి సాదార్ణంగ పోల్టిక్లోన్ మెవ్ఁ పాల్గొనవ్ఁ. మున్సిపల్టీ పోట్లీక్లోన్ గుడా మేవుఁ పాల్గొనవ్ఁ....ఇదీ ఆంధ్ర బాష ఇ లోకల్ డయ్లెక్టు రాష్టాన్కి కొంత చెయ్న్జ్ ఉంద్దెండి. అదీ ఎందుచేతనంటే అ ప్రాంతీయ తదితర బాషల్తో ఉన అ ఇన్ఫ్లుయెన్స్ వల. ఇపుడూ ఫరెగ్జాంపల్ సికాకుఁళవ్ఁ

విశాకపట్నమ్ డిస్టిక్కున్నాయంటే ఇవి నార్దన్ డిస్ట్రిక్ట్స అఫ్ ఆంద్రప్రదేష్ కదండి. ఈ నియ్‌బరింగ్ ప్రోవిన్సు ఉంటుంది. ప్రోవిన్సు ఒరిస్సా. సాదార్ణంగా ఆ వోరియా తెలుగూ ఇన్‌ఫ్లుయెన్స వల కొంత యీ తెలుగు వాడుక బాష్ గుడా తదిత్ర బాషల్తో అంటే తదితర ఆంద్రప్రాంత బాషల్తో గుడా కొంత మార్పుంటుంది. అలాగే ఇప్పుడూ క్రిష్ణా గుంటూరుంది. క్రిష్ణా గుంటూరు వాళూ వాళు మాట్లాడేటప్డూ కొంచావ్ఁ స్వాచ్ఛమైన తెలుగుంటుంది. గేనీ వాల్లూ మాట్లాడే తెలుగులో సవ్ఁస్కృతవ్ఁ కొంచెవ్ఁ తగ్గుంటుంది. సవ్ఁస్కృత బాష తాలూక ఇన్ఫ్లుయెన్సూ వాళకి తెలుగు మాట్లాడే బాషలో కొంత తక్కువ్‌గానే ఉంటుంది; నా అబ్‌ప్రాయవ్ఁ వేఁటంటే ఇపుడూ మోమ్మూల్ మాట్లాడే బాషల్లో సాదారణంగా ఈ ట్రీ ఆంద్రబాష-ఇప్డూ స్రికాకుళవ్ఁ విశాకపట్నవ్ఁలో మాట్లాడు తుండవ్ఁ చుపైరా-అది యియ్ కొంత నవ్ఁస్కృత బాష్తో కుడా సంబందిన్చ ఉన్నది. తెలంగాణా వాషకుడా ఉర్దు ఇన్‌ఫ్లుయన్స కొంత ఉండైక్డ; ఇపుడూ కడప కర్నూలు రాయలసీమ డిస్ట్రిక్టుస వాళ్ళు మాట్లాడే బాష కూడా ఈ కెనరీస్‌తో కొంత ఇన్‌ఫ్లుయెన్సూ ఉంది. కనడవ్ఁతోని. అలాగే ఇంకా చిత్తూరూ; మెమ్మాట్లాడే బాషే మీలు సాదార్ణంగా ఉప్యోగిశ్తోవ్ఁ; రాయాలనుకుంటే మెమ్మాట్లాడే బాష్లోనే రాయ్‌దల్చకుంటావ్ఁ; గ్యేఁనీ అనవ్‌స్రంగా ... సాద్యమైనంతవఱకూ యీ వ్యావ్‌హారిక్ బాష్నే ఉప్యోగిస్తున్నావ్ఁ; మాట్లాడ్‌తునావ్ఁ; అద్యేన్ ఎంచెతనంటే మాగు మాట్లాడ్డాన్కి సులువ్‌గా ఉంటుంది; ఈయ్యా కుఱ్రవాళ్ళు విండానిక్కుడా అర్దవ్ఁ వోల్ చెస్కోడానిక్కుడా వాళకుక్కుడా సులువుగా ఉంటుంది; వ్యావగారిక బాషయ్‌తే కొంచువ్ఁ వేగంగా కుఱ్రవాడూ గ్రహించగళ్డూ అర్దవ్ఁ చేస్కోగళ్డు; ఆ ఉద్దేశమ్మీదే వ్యవహారిఁ బాష్‌కుడా ప్రైవేశ్‌పెట్టావ్ఁ. మాక్ కల్చల్ ఎశోశియేశన్స ఉండేవి; మేవూఁ ఎమ్మే ఫయ్‌నలియర్ కొచ్చేటప్డూ మేవుఁ సిల్వర్ జూబ్లీ సెలెబ్రేషన్ చేస్కునావ్ఁ మా ఆంద్రా ఎశోశియేశన్ వాళ్ళవ్ఁ; అప్పుడూ నాకు గ్యేవ్‌కవ్ఁ ఏటంటే సర్ విజ్యాని మొఁట్టమొదసారిగా అతన్ని ఆహ్వానించోవ్ఁ; అతను మొట్టమొదట అంగీకరించినా తరవాతయ్‌నేఁవన్నారంటే నాక్ క్రికేట్టూలోనే కొంత ప్రవేశవ్ఁ ఉందిగనీ ఆయ్‌నూ బెనారస్‌లో నివాసం గదండీ; అయ్ని పిలిస్తే ఆయన ఆయ్న్ని ఆంద్రుడైనప్పుడ్‌కున్నూ నాకింకెందులో ప్రవేశవ్ఁ లేదు; నేనేవిఁ రాలేన్గా, నేనూ నేనూ నన్ క్షమించండెంటే

మేవఁప్పుడూ రాధాక్రిష్న గార్నో ఎవర్నో బత్మాలేవ్ఁ. తరవాత చలపతిరావ్ గారొచ్చేరు. ఆయన్నూ జెన్నలిస్టు. ఆయొన్నొచ్చేరు. తర్వాత మేవుఁ మా ఆంద్రా జెర్నల్ ఒటి పబ్లిష్ చేసావ్ఁ; యేఁ తరవ్త మా ఎశోశ్యేశన్ వాళూ గేమ్స్ ఎండ్ స్పోర్ట్స్ కుడా కాంప్టీషన్స్ పెటీ ప్రయ్‌జెసూ సర్టిఫికెట్సూ డిస్ట్రిబ్యూట్ చెశావ్ఁ; మ్యూజిక్లో కొంచొవ్ఁ ఆసక్తి ఉన్నప్పడ్‌కున్నూ నేనెపుడూ ప్రవేశొవ్ఁ అందులో ఎక్కువ్‌గా లేదు; నాకు గేమ్స్ ఎండ్ స్పోర్ట్లోనే ఎక్కువ ఆసక్తి; సాదార్ణఁంగ నెనూ హాకీ క్రికెట్టూ బేడ్‌మింటనూ ఎక్కువ్‌గాడే వాళ్ళవ్ఁ; కల్చెల్ ఏక్టివిటిస్లొ కొంచొవ్ఁ పాల్గొండవెఁ గనీ మఁరీ ఏక్చువల్‌గ వేశాలు వెయ్‌డవ్ఁ డ్రామాస్ పాటిస్పేట్ చెయ్‌డవ్ఁ అది లేదు; ఎక్కువ నేన్ లైక్ చేసేదీ హాకి. తరవాత నేను బెనారసూ అట్నుయ్‌డు పోయిన్‌తర్వాత బేడ్‌మింటనే ఆడేవాళ్ళవ్ఁ; గవ్‌డవ్‌డూ హాకీ క్రికెట్ కుడా ఆడేవాళవ్ఁ; ఇక్కడి కొచ్చిన్తర్వాత టెన్నిసు కొంతకాలవ్ఁ టెనిసూ ఆడెవాళవ్ఁ; క్లబులో ఆడెవాళవ్ఁ. టౌన్‌హాల్ క్లబ్లో. తర్వాత మా కాలేజి క్లబ్లో బాగ కొన్నాళ్ ఆడేవాళ్ళవ్ఁ. ఇపుడూ పూర్తిగా మానెసేవ్ఁ. ఎందుకంటే ఈ పద్నాల్గు సవఁత్రాల సర్వీసంతునూ మా మీడియమప్పు ఏక్స్‌ప్రెషన్నూ ఇంగ్లీషే. ఇప్పుడూ మొట్ట మొదటిసారిగా సవత్రన్నుంచీ ఇంట్రమీట్ ప్రైవేశ్ పెటిన్దగనుంచీ ఆ తెలుగులో మాట్టాడ్‌వల్సిన పరిస్తితేర్పడింది. కొన్ని క్లేసులవర్కూ తటపటాయించేవాళవ్ఁ, తెలుగులో మాట్లాడ్డాన్కి. యీ తెలుగ్ భాష్లోకుడా యెదో ఇంగ్లీష్ వడ్సూ ఉపోయ్గించి కొంతకాలన్కి ఇప్పుడేదో సర్దుకున్నావ్ఁ. తెలుగులో మాట్లాడ గలవ్ఁ. స్టుడెంట్స్‌ని కొంతమట్టుకూ వాఁళ్నీ బోద పర్చగలఁవ్ఁ తెలుగులో అనీ ధైయ్ర్యవ్ఁ ఇప్పుడు కొంతమటుకొచ్చింది. స్టుడేసూ చాలమట్కూ వాళకి తెలుగులో అర్దన్చేస్కొడవ్ఁ సులువ్. ఏంచేతంటే వాళ్ళు టెంత్ క్లాస్లో తెలుగు మీడియమ్‌లోనే చదివేరు. కాబట్టి ఈ ఇంట్రమీడిట్లో తెలుగులో చెప్తె వాళను వాళ్ళు వేగంగా అర్దన్చేస్కొగల్రూ, తెలుగులో వాళు రాయగల్రు. ఎన్చేదనంటే ఇంగ్లీషులో వాళకి ప్రవేశవ్ఁ లేదూ, చదవ్‌డవ్ఁ కశ్టవేఁ. మాట్లాడ్డవ్ఁ కశ్టవ్ఁ. రాయ్‌డ్డువ్ఁ కశ్టవేఁ. కాబట్టి ఇంట్రమీడిట్ వాళ్లు తెలుగులో వ్రోళ్ బాగా రాయ్‌గల్రు. రాస్తున్నారు కుడా. మొన్న ఏప్రిల్ ఎగ్జమ్నేషఁన్ అయ్‌కదండీ. అందులో మెవ్ఁ పేపల్ దిద్దావ్ఁ. వాళ్ళు బాగనే

రాశేరు. మార్కులు కుడా బాగ్ నే ఒచ్చేయ్. సాదార్ణంగా వాళ్ళు వ్యవహారిక బాష కుడా వాడుక్ చేస్తున్నారు. లోకల్ డయలెక్ట్ కుడా ఉంది. ఏవుఁండదు. ఈ వ్యావహారిక్ బాష్ గుడా ఈ హయ్యర్ స్టడీస్లో కుడా వాడుక్ చెయొచ్చు. అదే ఇప్పుడ్ మన గవర్నమెంటూ వాళ్ కుడా వఁజెంౕకేజ్ చేస్తున్నారు. గ్రాందికవ్ఁ కకుండా వ్యవహార్క బాషే యీ స్టడీస్ గూడ పెట్టడవ్ఁ మంచిదనీ. ఎందుకంటే ప్రతీ స్టుడెంట్ కూ యీజీగా అర్దున్చేసోక్గల్డనీ ఆ వుద్దేశిన్చేత వ్యవహారిక్ బాష్కుడా యీ చదువ్ లో కుడా ఉపోయ్గించచు. ఎంప్లోయ్మెంట్ ఓపర్చునిటీస్ అంటే గవర్నమెంటూ మీదా ఆదార్పడుంది. మరి ఇప్పుడు బియ్యే అయింతర్వాత మళ్ళీ పోస్టు గ్రేద్యుఎట్లోను ఇంగ్లీష్లో చదవాలి. ... పదు ఇంట్రమీట్ అయింతరావ్తె టెక్నికల్ కోర్సెస్క వెళ్ళాలంటె వాడు ఇంగ్లీష్లో చదవాలి కాబట్టి ఆద్రుక్పదన్లో చూస్కుంటే స్టుడెంట్కు చాలా కష్టపడ్వల్సొస్తుంది; ఎందుకంటే టికినికల్ కోర్సెస్లో మొట్టమొదటిసారిగా తనూ ఇంగ్లీష్లో అనుబవువ్ఁ తెచ్కోవాలి. ఇంగ్లీష్లో చదవాలి కాబట్టి రెండు విదాలుగా కుర్రవాడిక్ చాలా కష్టపడ్తాడు; మొట్టమొదటిది ఇంగ్లీష్లో ప్రావిణ్యాత. రొండవది ఈ టెకినికల్ కోర్సెస్ ఇంగ్లీష్లో చదవ్డవ్ఁ; ప్రెజెంటు వే అవ్ టీచింగ్ అవ్ ఇంగ్లీష్ అంటె ఇంగ్లీషు ఒక్కసారిగ కాలేజీలో ప్రవేశ పెటడవ్ఁ వల ప్రప్రుతిదుంగా స్టుడెంటూ ప్రీ యూనివశిటిలోనూ కొంతె ఖష్ట పడ్తున్నాడు. ఎఁందుకంటే సాదార్ణంగా ఫీడ్ యూనస్టీ స్టుడెంటుక్కుడా ఇంగ్లీష్లో మాట్లడ్డవ్ఁ రాదు. మాటకుడ పైగల్దు; తరవాత స్పెలింగ్ మిస్టేక్స్ రాయ్డఁన్లో కుడ చాలావుంటయ్. ఒక సెంటెన్స్ కుడా అందులో ఒఖ్ఖ సవ్రచవ్ఁ కోర్స్ గాబట్టీ ఆప్రీయూన్వష్టీ స్టూడెంటు ఇంగ్లీషు తర్రవ్త ఆప్షన్ల్ సబ్జెట్సు ఇంగ్లీష్లో చదవడవ్ఁ వల ఎక్కువ ఇంగ్లీష్లో ప్రావిణ్యాత పొందలేదు. అందుకే చాలామంది ప్రీయునవ్ష్టీ స్టూడెంట్సు ఇంగ్లీష్లో పోతుంది. కోన్వెంట్లో చదివినవాళొస్తారు; వాళు మాత్రవ్ఁ కొంచు బాగనే సాదార్ణంగా వాళ్ళ ఫెర్ఫార్మెఁన్ బోవుంటుంది. వాళూ ఈజీగా ఇంగ్లీష్లో రాయ్గల్రు. అందుకే పేసవ్గల్రాళు; డిఫ్రరన్స్ ఎందుకుందంటె వాళ్ హాయ్స్కూల్ స్టడీస్ అంతనూ మీడియమవ్ లేంగ్వేజ్ ఇంగ్లీష్లో జదువ్తున్నార్ గాబట్టి వాళ్లు ఆ శేమ్ మీడియ మ్మేఁ కాలేజ్లోకూడా చదవ్వల్సివొచ్చేటప్పుడ్ కీ వాళ్ళ కీన్ సునాయ్సంగా ఉంటుంది; కనిపిస్తుంది; ఎందుకంటే ఇండైస్కూ మైనర్లోసెకుడా

కొంతమట్టుకా డిప్ప్రిన్ష్ ఉంటుంది; కోన్వెంట్ వాడు కొంత ప్లీజింగ్ మేనర్స్యా. వాళు కొంచువ్ఁ డిసిప్లిండుగా ఉంటాడు. ఈ మన హాయ్‌స్కూల్ వాడు అట్ల ప్రవర్తించలేడు; ఎందుచేతనంటే మనయ్‌స్కూల్లో యూనిఫోమ్టి అఫ్వా రూల్స్ రెగ్గులేషన్స్ యెవీ లేవు; డిసిప్లిన్ కుడా కొంచువ్ఁ బాగుండదు; ఎందుకంటె కోన్వెంట్లో తక్కువ్‌మంది చదువుతారు. తక్కువ జనాబా వల్ల ఎక్కువా డిసిప్లిన్ను ఉంటుంది. మరి మన హాయ్‌స్కూల్స్ అన్నానన్నా ఒకొక్క క్లేస్లూమ్లోనూ నల్భయ్ మంది పట్టగలే క్లేస్రూమ్లోన్ ఒ గైనబయ్ మందిన్ తోసే స్తారు; తోశేశ్ పాటల్ జెప్పేటప్పుడు సాదర్ణంగా వాళకి బెంచీలు కుర్చీలు సదుపాయాల్ లేక్పోడవ్ఁ వల్ల కొంతమటుకా ఇండిసిప్లిన్కి కార్ణంఁగా ఉంటుంది. అంచేతె ఆగ్లేరింగ్ డిఫ్ఫెర్న్స్. కాలేజ్‌కొచేటపడికీ కోన్వెంట్ స్టూడెంటుకునూ మైమ్మూమ్రలు హాయ్‌స్కూర్ నుంచొచ్చే స్టూడెంటుకీ వేగవ్ఁ తెల్సకుంటావ్ఁ. చేష్టల్లోగానీ ఈజీగా కనిపెట్టగలవ్ఁ. అయినప్పడ్‌కున్నా ఇప్పుడు మనవ్ కాలెజిలో కూడా ఇపుడు ఇంట్రమీడ్ పెట్టేరు. ఇంట్రమీట్ తెలుగు మీడియమ్ అన్నారు; హాయ్‌స్కూల్లో తెలుగులోనే చదువ్‌తున్నాడు కాబట్టి ఇంటెమీట్లో ఆ తెలుగు మీడియమ్ తానే చదవ్వల్సొచ్చేటప్పుడు ఎక్కువ్ కష్టంగా ఉండదు కాబట్టి స్టుడెంటుకీ కోఁ సుళువ్‌గా ఉంటుంది; అట్లాగే ఇంటెమీట్. ఇంటర్నేషనల్ కాంప్టిషన్లో మరి వాడెట్లా నిలవ్‌గల్డు? ప్రాంతీయ్‌బాష్ ఎప్పడైతే ప్రెవేష్ పెట్టేవోఁ మన దెశవ్ఁ ... కొయ్‌న బాష్లుండ బట్టీ మనవ్ఁ ఇంటర్ నేష్‌నల్ కాంప్టీఁషన్కి పొయేటప్పుడు ఒ నేష్‌నల్ లేంగ్వేజ్లో ప్రావీణ్యాతా పొందిన వాడే ఆ ఇంటర్ నేష్‌నల్ కాంప్టీఁషల్లో నిలబడగల్డు; ఉప్పుడు ఫ్రెగ్జాంపులూ మనవ్ఁ ఇంగ్లీష్ తీస్కునావంటే ఇంగ్లీష్లో ప్రావీణ్యతొస్తే ఇంటర్ నేష్‌నల్ కాంప్టీష్‌ట్లో పోవచ్చు. ఇబుడు హిందీ నేషల్ లేంగ్వేజ్ కింద మనవ్ఁ తీస్కొనీ అదెన్నేతనంటే హిందీ బాష్లు హిందీ వచ్చే బాషా ప్రాంతాల్లను ఎక్కువున్నాయ్ కాబట్టి హిందిప్రబలంగా వుండబట్టి హిందీ ముున్ముందు నేషల్ లేంగ్వేజ్‌గా పరిగణింపబడుతుంది కాబట్టి హిందీలో కుడా ప్రావీణత్తత్తే ఒస్తే అప్పుడు కుడా ఇంటనేష్ణల్ కాంప్టిషన్లోను మనవ్ఁ పాల్గొనవచ్చు. అయినప్పడికున్నా ప్రస్తుతవ్ఁ ఇదీ ఇంటర్ మీడియస్టేజి; ఈ ట్రేన్జిషన్ పీరియడ్లో కొంత మంది దెబ్ తింటారు; ఇవ్‌డు. ఆలిండ్యా కాంప్టిషైఁల్లో ఇంగ్లీష్ మీడియమే చాల మంచిది; ప్రాంతీయభాషలో ప్రావీణ్యతున్నప్పడ్‌కున్నా ఆ కాన్పరెన్లోస

విడూ ఏఁవి మాట్టాళ్ళేడు. కాబట్టి ఆనేషల్లూ కాన్ఫరెన్సెస్లోమాట్టాడ గల్తెంటే అందులో విరివ్గా వాడుకెయ్యేన బాష అది లింగ్వా ఫ్రేంకాగానీండి లేపతే ఒక ఫారిన్నూ లేంగ్వేజ్ లైక్ ఇంగ్లీష్ లేంగ్వేజ్ అయ్యనప్పుడి కునూ అంద్లో ప్రావీణ్యత్ ఉంటెవ్ డూ తన బుది బలవ్ఁ అంత వుపోగించీ తనూ తెల్సుకోగల్డు. మాట్లాండగల్డు. తెలిపర్చగల్డు. ప్రాంతీయ్ బాష్లో ప్రావీణ్యత ఉన్నంత మాత్రాన తనూ ఇంటర్ నేషల్ కాంప్టీషన్కి పనికిరాడు. బోధవ్యాలో తీస్కొ వాలంటే..వ్ డూ ప్రతీ వాడూనూ ఆఁ ఇంటర్ నేష్నల్ కాంప్టీషన్ పోడం కదండీ ఇప్పుడు ఇంగ్లీషే లేంగ్వేజ్ మనవ్ తీస్కోని ఇంగ్లీషే మన్ ప్రైవేశ్ పెట్టీ ఇంగ్లీష్నే వ్యాపింపజేయ్యచుఁన్ తల్చకుంటే అదనవ్సరఁ. ఎంచేత్నేటంటె ప్రతీ వాడున్నూ ఇంగ్లీష్ చద్వి ఇంటర్ నేషల్ కాంప్టీషన్ పోడుగా. తర్వాత ప్రాంతీయ బాష అదియ్యా ... యెప్పుడూ ఉండవల్సిందే. అది వ్యవహార బాష. ఆ బాష ఏనట్కి యెప్పుడూ యెక్కడక్ పోదు. కాబట్టి అదే అబివృద్ జేసీ ఆ బాష్లోనే ప్రావీణ్యత పొందీ ఆ బాష్లోనే తతిమా అన్ని విజ్యాలూ నేర్చ కుంటే మున్ముందు వీడికి ఆ ప్రాంత ఆ ప్రాంతువ్ఁలో ఉజ్యోగాల్ గానీ లేప్తే విజ్యాసంపత్తిగానీ విజ్యాబుద్ధిగానీ చెయొచ్చు. ఈ ప్రాంతీయ బాష్తో పాటూ హిందీకుడా నేర్చుకుంటే లేపోతే ఇంగ్లీష్కుడా నేర్చకుంటే మున్ముందు ఓలిండ్యాకోన్ఫరెన్స్లో ఓలిండ్యా ఎడ్యుకేషందల్లో గానీ లేపతే కాంప్టీటివ్ సెర్వీస్లో గానిపాల్గొనవొచ్చు. ముక్యెంగా ప్రాంతీయ్ బాష్లో ప్రావీణ్యత పొందీ ప్రాంతీయ్ బాష అబివృద్ది చేస్తే చాలా మంచిది. నెనూ పందొమ్మిదొందల యాబయార్ నుంచీ ఉంటునాను. అంటే పదిహేను సవఁత్సల్ అయ్యనట్టుంది. ఇది ఈ విశాక్ పట్నవ్ఁ ఔను నె మొట్ట మొదటి సారిగా ఒచ్చేటవ్ డూ ఈ ఇల్లు క్టొన్నావ్ఁ పందొమ్మిది వొందలా యాబయ్ యేడు యాబయ్ యెన్మిది ప్రాంతొవ్ఁలో అపుడూ ఇకడ చాలా నిజ్జరవ్ఁగా ఉండేది. ఇళ్లు కుడ చాల్ తక్కువేవి. ఈ పయ్ సవఁచ్రాలూ సొల్ప కాలొఁవ్లో ఈ టీను చాలా విరివ్గా వ్యాపించింది. ఈ జనాబా ఎక్కవ్డవ్ఁల ఈ టవ్నూ విశాలంగా పెరడవ్ఁ వల ఇ ముఁన్సిపెల్ట్ కుడా చాలా బాగలేదు. దర్లు కుడా విరివ్గా పెరిగ్ పొయాయ్. ఇకడా క్టోస్టవ్ లివిం కుడా చాలా ఎక్కువ; హాయ్ద్రబాడ్కన్నా ఇక్కడ ఎక్కువలాగే వున్నది. ఇంకా ఇక్కడ్ రేష్నింగ్ ... ఇకా ... కుడా గవర్న మెంటు వారు పెట్టి ఉన్నారు. ఆ రేష్నింగ్ ఒకోసారి మంచి బియవ్ఁ దొరూతాది. ఇంకోసారి బియ్యవ్ఁకూడా కోర్సు కోర్చుగ్రెయ్యన్సు ... ఇట్లా అయ్యతుంటారు. దర్లు

మాత్రువ్‌ విపిరీతంగా పెరీపోతుంటాయ్.

## వ్యవహారఖండికలోని వ్యాకరణాంశాలు

*ధ్వని విభాగం :*

మహాప్రాణోచ్చారణను పాటించిన ఉదాహరణలలో కొన్ని - 'ధెయ్ ర్యవ్‌', 'తెలుగ్ భాష్లొ', 'రాధాక్రిష్ననగార్ని'...; 'ఆంద్రప్రభ', 'మాత్రుబాష', 'అర్దవ్‌', 'గ్రాందికవ్‌', 'పరిస్తితి', 'సంబందిన్చ' పదాల్లో అల్పప్రాణోచ్చారణ కనిపిస్తే, 'అక్ఖడికి', 'ఖష్టపడు', 'ఒఖ్ఖ' వంటి పదాల్లో మహాప్రాణోచ్చారణ లేని చోటకూడా ప్రవేశపెట్టడం కనిపిస్తుంది. ఇటువంటి పరిణామాలు వ్యవహర్త పరిణామ దశను తెలపడమే కాకుండా మహాప్రాణోచ్చారణ వంటి అంశాలకు శిష్ట లక్షణాలను ఆపాదిస్తున్నాయని తెలుస్తుంది. ఇటువంటిదే ఈ వ్యవహర్తలోని 'వేదు గంటల్' - ఇఁదు పదాదిన 'వ'కారాన్ని ప్రవేశపెట్టడం చూస్తాం. అంటే 'వ'కార లోపం శిష్టేతర వ్యవహారంగా పరిగణిస్తున్నారని చెప్పడానికి ఇదొక నిదర్శనంగా భావించవచ్చు.

'ద'కారానికి 'య'కారం పరమైనప్పుడు 'ద'కారం 'జ'కారంగా 'సాజ్ వైయ్‌నంతగా', 'విజ్యాలూ', 'ఉద్యోగాల్', 'విజ్యాసంపత్తి', 'విజ్యాబ్రుద్ది' వంటి మాటల్లో మారింది. ఈ తాలవ్యీకరణం ఇతనిలో ఒక విశేషంగా కనపడుతున్నాది. మూర్ధన్యలోపం 'సైకన్లో కెల్లేవాళ్ళవ్‌', 'దాటివెల్లేవాళ్ళవ్‌', 'వాల్లూ మాట్లాడే' వంటి పదాలల్లో కనిపిస్తుంది.

'క' కార 'గ' కార లోపాలు : 'సంపాదించలేపొయేను', 'లేపతే' 'దొరూతాది'; 'పరిణింపబడుతుంది', 'పెరడవ్‌', 'పెరీపోతుంటాయి' పదాల్లో చూడొచ్చు.

'చేసొక్కడానిక్కుడా', 'పూర్రొవ్‌', 'సొల్పకాలొంవ్‌లొ' ('వ'⟶'ఒ') వంటి పదాల్లో పదమధ్య 'వ'కారం లోపించింది. 'పూర్రొవ్‌'తో పరాచ్చైన 'అ' పూర్వవర్ణమైన 'వ' కారంతో వర్ణసమీకరణం చెంది సంవృతత్వాన్ని పొందింది. ఇదే పరిణామం 'సొల్పకాలొంవ్‌ల'లో చూడొచ్చు. 'దొరూతాది', 'పెరీపోతుంటాయ్' పదాలల్లో 'క', 'గ'ల లోపంమీద పూర్వాచ్చులు దీర్ఘాన్ని పొందేయి. ఈ పరిణామం వర్ణ సంకోచానికి ఒక నిదర్శనం. పదాది 'హ' కార లోపం 'అయ్‌స్కూలు', 'ఇందు యూనివర్సిటి'లో గమనించదగినది. ఈ లోపం ఇంగ్లీష్ పదాలకే పరిమితం కావడం ఒక విశేషం.

భూతకాలంలో 'ఏ', 'ఐ' ల పర్యాయ రూపత ఇతని భాషలో ఒక విశేషాంశం. ఉదా.- 'చదివేను', 'మానేసైవ్ఁ', చదివేరు', 'పెట్టేరు', 'పెట్టైవ్ఁ', 'సంపాదించలేపాయైను'. ఈ పర్యాయ రూపత ఈ మాండలికంలో విరివిగా కనిపిస్తుంది. ఇటువంటి భిన్నరూపత శిష్టశిష్టేతరోచ్చారణ జ్ఞానానికి నిదర్శనం.

సంయుక్తాక్షరాల్లో ఒక ధ్వని లోపించడంగానీ, లేకపోతే వాటి మధ్య అచ్చు చేరడంగానీ ఇతని వ్యవహారంలో చూస్తాం- 'సికాకుళవ్ఁ' (శ్రీకాకుళం), 'ఏపిర్లి' (ఏప్రిల్). మొదటి పదంలో రేఫ లోపం, రెండో పదంలో 'ఇ'కారం 'ప', 'ర' ల మధ్య చేరడం చూస్తాం.

ఇదే కోవకు చెందింది 'శివాఁచెలవ్ఁ'. 'సింహాచెల్వఁ' (సింహాచలం) ఇందులో (శివాఁచెలవ్ఁ) పూర్వవర్ణమైన 'మ' 'వ' కారంగా మారి అనునాసిక్యతను పొందగా, 'హ' కారం లోపించింది. 'సింహాచెల్వఁ'లో 'మ' కారం లోపించి పూర్వాచ్చైన 'ఇ' అనునాసిక్యతను పొందింది. ఇతని భాషలో ఇంకో గమనించాల్సిన అంశం 'స' కారానికి బదులు 'శ' కారోచ్చారణ. ఇది క్రియాపదాల్లో ఎక్కువగా కనిపిస్తుంది. ఉదా :- మానేశైను, చూశేవాండ్లవ్ఁ, చూశెవాణ్ణి, చేశైనుకూడా, ఉపోయోగిశ్తోవ్ఁ, శివాఁచెలవ్ఁ.

## వ్యవహర్త : 3

## పెద్దవ్యాపారి

*కేంద్రం : అనకాపల్లి, కులం : వైశ్య,*
*వయస్సు : 40 సం॥ చదువు : బి.కాం., బి.ఎల్.*
*వ్యవహారఖండిక : భాషాభేదాలు; వ్యాపారం.*

రీడింగ్ హైబిట్సు? నావల్సు బయోగ్రఫీసు ఎకనామిక్సు. తెలుగులో ఎకువ నావల్సూ ఇంచుమించూ ప్రభా పత్రిక వేరే చవ్‌తావుఁ; అకేషనల్‌గా యీ

బయొగ్రఫీసు ఎకనోమిక్సు డెయ్‌లీస్ రోజు చవ్‌తావుఁ; వీక్లీస్ చవుతావ్ఁ రెగ్లర్‌గా రెగ్లర్గ్ చవుతావుఁ. రేడ్యో లిస్నింగ్ ఉంది రెగ్లర్‌గానూ. రోజూ వింటావండి. సినిమా వీక్కి కాని ఫెన్ డేస్ క్కాని ఒసారి వెళతావ్ఁ. అకేషన్లల్‌గ. హిందీ తెల్సు. ఇంగ్లీష్ తెల్సు; అరవోవ్ఁ కొంచోవ్ఁ కొంచోవ్ఁ తెల్సు; చాల తక్కువ అరవవ్ఁ; హిందీ చదువ్‌తాను. మాట్లాడ్‌తాను; షోపల్ క్రొంఫ్రేక్ట్సు నలుగుర్ ఫ్రెండ్సెవరో ఉంటారు; మా బిజినెస్ టయ్‌పవ్ ఫ్రెండ్సుంటారు; తరత రోట్రి క్లబుంటే నాల్రకాల మషులూ ఉంటారు మరి. కల్చరల్ ఎసోస్యేషన్ ఓటుంది, శేరదా లయ్‌బ్రరీ ఓటుంది, వేనింటి కేల్తావ్ఁ; మెంబర్ అవ్‌ది రోట్రీ క్లబు, సెక్రెట్రి మర్చంట్సనోసేష్ను, శేర్దా లయ్‌బ్రరీ సెక్రెట్రీ, అన్నింట్లోని ప్రొసీడింగ్సు ఒక్క రోట్రీ క్లబ్ తప్ప తకినవి తెలుగునవ్‌తాయ్. కల్చరల్ ఎసోస్యేష్ను తరావ్‌త ఆ అస్సోచిసెవ్‌డన్న ఇంగ్లీషోతయ్ తెలుగవ్‌తయ్ తెక్కినన్నీ. శారదా రయ్‌బ్రరీ మర్చంట్సోసేష్ను ఇవెన్నీ తెలుగ్‌నే అవ్‌తయి. సెక్రెట్రీ, ఇంకా రోట్రీ క్లెప్పొని తరావ్‌త అఫ్‌షల్సతో ఓర్తొననా క్రొంక్రేక్ట్‌మా ..., పెటీబిజ్యేన్ మన్ తోడి ఉంటది. ప్రగికల్చర్సో కూడ ఉంటది క్రొంక్రేక్ట్. మాకూ వెర్‌సెనక్కా బట్టి ఆరయ్‌తులొచ్చి అప్పుడవ్‌డేనా మాట్లాడ్డవ్ఁ. లేబర్‌తో అప్పుడవ్‌డు. చదువ్‌కుంటవ్‌డే ఉన్నాను మెడ్రాస్లోనీ విశాపట్లోనిన్నీ; విశాపట్లొఁ మొతావ్ఁ నోల్ శవ్ఁశ్రా లునాను; మెడ్రాస్‌కుడా స్టైడీ; మెడ్రాస్ టూయర్స్; స్టడీస్, మిగతా డయ్‌లెక్ట్సంటే అవన్నీ కొంచువ్ఁ దీర్గంగా ఉంటాయ్ మాదానికంటా; ఇటు సిరికాకుళవ్ఁ అటీపు కొంచువ్ఁ పొట్టిగా వుంటాయ్ మాట. గోదావర్ జిల్లా క్రిష్నా కొంచెవ్ఁ దీర్గవ్ఁ తీస్తారు మాట; మాదాన్తోకంపేర్ చేస్తే వాళ్ళు దీర్గవ్ఁ తీస్తారు. వీళ్ళూ క్రిష్న. స్రికాకుళొవ్ఁ అదికూడ కొంచువ్ఁ పొట్టిగా ఉంటది మాట. గోద్రోర్ జిల్లా ఎక్కువెల్తుంటావ్ఁ. బిజవాడ క్రిష్నా జిల్లా అంటే బెజవాడె. మావిశాక పట్నవ్ఁ డయ్‌లెక్టూ మరి మాకు ప్రపోర్షనలే కనిపిస్సుంది స్సినిమా లేంగ్వేసిన్ని ఇంక బాగ్ కొంచువ్. మాదీ నియఱ్రేనో అనిపిస్తుంది. ముక్లోస్సు రాసింది కొంచెవ్ఁ తేడా ఉంటుంది. ఆంద్రప్రబా వీక్లీ ఇవెన్నీ ఉన్నాయ్ కదండి. డెయ్‌లీ వారితో కొంచొవ్ఁ మాకు కొంచువ్ఁ నియర్నెస్ ఉందనీ అనిపిస్తుంది. ఇంక మా లేంగ్వేజ్ అంటే మాకు విలేజెస్ కెత్తే ఇంక కొంచు మా మెవిఁక్‌డ మాట్లాడేదన్కి దానిక్ కొంచు తేడా ఉంటుంది. కొంచువ్ఁ యాసొచ్చింది అజ్జెప్పి అంటారు. గొదావ్రీ

ఇయెన్నీ కుడా ఎంటంటే ఖానోల్సె అంతెగా ఎక్కువ్ కనిపించదు. విలేజిస్లో ఏ
విలేజ్ కెళ్ నా సరే మాకు డిఫ్రెన్స్ కనిపించిపోతుంది. రాయల్ సీమ విన్నాను.
తెలంగాలు వినాను. రాయల్ సీమ వాళ్ళు విలేజిస్ నుంచొచ్చినవాళ్ళు ముందు
మాట్టాడ్ దే నాకు బోదేపడేది కాదు. ఆ తర్వాత్తర్వాతా అంటే హాస్టల్లో
వాళ్ళు ఉండేవాళ్ళు. వాళ్ళు కొంచువ్ఁ మా మేమ్మాట్లాడే డైయ్‌లెక్ట్ కే అల
వాటు పడ్డావ్ఁ. మ్యూచుల్ గా కొంచువ్ఁ అయిందర్తోతె బోదపడ్ పోతుంది.
తెలంగాణ పర్తావ్ లెదూ కొంచెవ్ఁ ఉడ్డూ అకడ కల్పిందన్ మశే కనీ, రాయ
ల్సీమ్ కంటి తెలంగాణా కొంత అర్దంకావ్‌డవ్ఁ కొంచెవ్ఁ సులువు. డ్రామా
లెయ్‌లేదు. డిబేటింగ్ సొసయ్‌టీలు ఎవ్‌డన్న, ఇంగ్లీష్ కాపోతే తెలుగే ఎక్కువ,
హిందీ చాలా తక్కువ యుస్ చెయ్‌డవ్ఁ. ఎక్కువేఁవిఁ ఎవ్‌డూ యుస్ చెయ్‌లేదు.
ఎక్కువ్ తెలుగే. డిబేటింగ్. సొసయ్‌ట్లో ఇంచుమించూ కొంచొవ్ఁ గ్రాం
దికింగా ఉన్న తెలుగే యూస్ చేసెవారూ. "నీలా చెప్పుచున్నాను, మాట్లాడు
చున్నాను." ఇవ్‌డూ ఆ అవన్నీ తగిపొయేయ్. మదెలా మాట్లాడ్‌కుంటప్పుడే
డిబేటింగ్ సొస్సయ్‌టీస్లో కుడలాగే మాట్లాడ్‌తుంటవ్ఁ. తెక్కువ డిబేటింగ్
సొసయ్‌టీస్లో కలోక్వ్యల్ లేంగ్వేజ్ మాట్లాడ్డవ్ఁ కొంచొఁ తెక్కువ. ఏంగ్నావ్
కవ్ఁ లెదూ. నే ఫిఫ్టీ ఫయ్ నుంచి బిజినెస్లో కొచేసేను. మాదీ వేర్సెనగ
వ్యాపార్రొవ్ఁ. వేర్సెనక్కాయ్ కొండొవ్ఁ. అది మిల్లింగ్ చేడవ్ఁ. నూన్ని
తైయార్ చెసి వేర్సెనగూన్ని వేర్సెనగ్ పిండమ్మడవ్ఁ. వేరుసెనగ రో మైటీర్లూ
తరువాతా 'నయ్‌గిర్' సీడని వెలిసంట్రోవ్ఁ అదీ తెర్వాతె కవ్‌గునూననీ కాగు
పప్పూ కాగూనూనీ నువ్వులూ నువ్వుల్నూని. మేషర్ పోర్షన్ వేర్సెనగ. పంటా
తక్కువ. మకూ కనీసవ్ఁ పదినాళ్ళ వాటయ్‌న ఒస్తుంది పంట్లో. ఒకప్పుడు మరి
సవఁత్సొరివ్ఁ రెయిన్స్ బాగున్నాయ్ మాకు.మాకు యేర్యాలో రెయిన్స్ బావు
న్నాయ్. వేర్సెనక్కి అనుకూలంగ ఉండేటట్టు పడ్డాయ్. వేరుసెనగ
జ్యూలయ్ నించీ నొంబర్ వర్యూకపంట. అక్టోబర్ నొంబర్లో హార్వెస్టింగ్
అవ్‌తుంది. సెప్టెంబర్లో ఒకప్పుడు సెప్టెంబర్లో కుడా హార్వెస్ట్ అవ్‌తది.
ఈ శవ్ఁత్రసవ్ఁ సెప్టెంబర్లో ఆర్వెస్ట్ ఆయ్‌పెంది. రెయిన్స్ కొంచెవ్ఁ
ఎర్లీగా ఒచ్చాయ్ కాబట్టి సెప్టెంబర్లోనే ఆర్వెస్ట్ మొదలు పెట్టైరు. అక్టోబర్
నొంబర్ సరికి వంటయ్ పోయిందంతా. మార్కెట్ కొచ్‌సిందంతాను.
జ్యేగ్రీ తక్కువ్ డీలింగ్స్. జ్యేగ్రీ వ్యాపారవ్ఁ మఁ అన్నగారు చూస్తారు.

వేర్సెనగ లేండ్స్ మాకులేవు. ఉండొచ్చు. కనీ మాకు దగ్గిర్లో వేర్సెనగ లేండ్సేవిఁ లేవు. నెచుట్టూ ఫది మైళ్ళు దూ దాటి వెళ్ళాలి. అక్కడికెళ్ళి వ్యవసాయంచేసీ అప్పెంటీ లేంల్లోర్డిసవ్ఁ అవుతుంది. కష్టవ్ఁ. ఇవన్నీ. అక్కడ మరి రెయిన్ ఫ్హెడ్డవ్తే మాలాంటీ వోళకి కశ్టవ్ఁ వ్యవసాయన్చెయ్యటవ్ఁ. వేర్సెనగ ఎక్కువ్ పండుతుంది ఈ డిస్ట్రిక్ట్లో. ఒక్క మా తాలూకాయే బెల్లవ్ఁ. తక్కిన డిష్టీటంతా ఇంచు మించూ వేర్సెనగే. అంటే దీనికి అట్మోస్ఫియరేఁలేదు. ఈ చెరుకు పండన్నిజాగాల్లో వేర్సెనగ వేస్తారు. చెరుకు పండన్ జాగాలంటే వాటర్ సరిగా ఉండదు. చెరుకు కొంచొవ్ఁ వాటరెక్కువ్ కావాలి. వాట్రుఁండ్ జాగా అంతా వేర్సెనగేస్తారు. వేర్సెనక్కి సోయింగ్ టైమ్లో కొంచొవ్ఁ వర్షం పడి తరావ్త ఇ మజ్యెన వనార్టూ రెయిన్సొచిన్ దర్వోత హార్వెశ్ చేసే టప్పుడూ వర్షమ్ పడ్తే సరిపోతుంది. ఆతీతకి సరిపోద్ది. కాయి తెస్తారు. దానికి సరిపోతుంది. అపుడు పంటి బావుంటుంది. అక్కడ కుడా ఇలాగే. అక్డిగా వేర్సెనగుంది. కానీ ఈ సవ్ఁత్రస్కడా వర్షాలు బావ్లేవోళ దీనికి సూటబుల్గ వర్షాలు పళ్ళేదు. వాళ్ళకీ ఇరిగేటెడ్కదా. ఈస్ట్ గోడావ్రి వెస్ట్ గోడావరికీ వాళ్ళకి రెయిన్తోస్ సమన్ధొవ్ఁ లెదు. వాళ్ళకి ఇరిగేటెడ్ కాబట్టి సరిపోతుంది. సీకాకుళవొఁ? ఇస్ట్ గోడారంతా వరేక్వేస్తారు. ఉప్పుడు కొంచొ కొంచొవ్ఁ చెరుకేస్తున్నారు. చెరకు దర బావుంది కాబట్టి. వేర్సెనగ సమ్మర్ క్రాపేస్తారు. వెర్సెనక్కాయ్ లేపోతే నువ్వుల్గానేస్తారు. వాళ్ళకేఁంటంటే అండీ వాళ్ళీరియా అంతా మొత్తొవ్ఁ రొండు పార్ట్లు. ఒకయెంపు ఓసవ్ఁస్రవ్ఁ ఇస్తారు నీరు. ఇంకో యెంపు ఓసవ్ఁస్రవ్ఁ ఇస్తారు నీరు. నీరిచ్చే సెవెయెవ్ఁ మాత్రొవ్ఁ వరేస్తారు. నీరివ్వనేపు వేర్సెనక్కానీ నువ్వులుకానీ వాళకు ఏదీ ఆ వర్షంబడ్డ టైముని బట్టి వాళ్ళు వేస్తుంటారు ఉన్న దర బట్టి. మర్చంట్స్ ఎసోసేషన్ సెకెక్రెట్రి. మర్చంట్స ఎసోస్వేషన్నా పంటంటే మా మార్కెట్లో జరిగే వ్యాపారొవ్ఁ అంతటికీ ఎక్కువ్ కమీష్న వ్యాపారం ఇక్కడ జరూతుంది, మార్కెట్లో. ఆ కమీష్ను? యేమర్చెంట్ ఎంత చార్చెయ్ఁలీ వ్యాపారన్లో తక్కీన్చార్జెసన్నీ యేవిఁడి చెయాలి బెల్లానికీ వేర్సెనక్కి ఇవన్నీ వీళు కంట్రోల్ చేస్తారు. తరవ్త ఎక్స్పోర్టర్స కుడా వాళ్ళు పయ్ ఆసామీల్కి కరీచ్చేస్తారు. వాళ్ళకి యెంతెంత కమీషన్ చార్చెయ్యాలి. ఏ కర్చులెలా చెయాలీ అంటె మొత్తొవ్ఁ అందరు మర్చంట్సూ ఒకే రకంగ చెయ్డందుకు చెయాలి. ఇవీ కాకుంట మేవుఁ కొన్ని దర్మసవ్ఁ సలుకుడా

నడుప్తునోవుఁ. ఒకకాలేజ్జొక్టి నడుప్తునావ్ఁ. ఇంగ్లిష్ మీడెమ్ హాయ్స్కూలొకటి నడుప్తునావ్ఁ.ఒకజోస్పిట్లొకటి నడుప్తునోవ్ఁ.ఇవన్నిటికుడా మెవూఁయివోల్తలన్ జెప్పీసి ఒకఇంత రూపాయ్లో సరుకమ్మితే అద్దరూపయ్యో ఒల్తలొసూల్ జేస్తావ్ఁ. ఈఫండ్స్తో ఇవన్నీ మెయ్టేన్ జేస్తనావ్ఁ.నిలుస్తుంది.అన్నీ మెయ్టెయ్న్ జెస్సన్నావ్ఁ. మెయ్న్టెనెన్స్ సరిపొయ్టట్టు డబ్బు మినిమమవ్ఁ ఒస్తుంది. ఇంకేన డబ్బు ఇంకెక్కువొస్తే బిల్డింగ్స్ అయి కట్టడవ్ఁ. ఈ సవ్ఁత్సరివ్ఁ లాస్టీర్దా ఇన్కమ్ బాగా వొచ్చింది. చోడోర్రొవ్ఁ క్లోలేజీకి పాతికేల్ రూపాయ్లు ఇచ్సేవుఁ. ఈ సవ్ఁత్సరివ్ఁ మళ్ళీ ఈ సవ్ఁత్సరివ్ఁ ఇన్కమ్ తక్వుఁంది. లేదు బెల్లవ్ఁ రేదు తగ్గింది. బెల్లవ్ఁ రేటు తగ్గడవ్ఁ మూలాంచి మాకు ఇన్కమ్మొ 'ఫడ్వోలొరమ్' కదండి. లేదు ఇక్కడే వుంది కొంచొవ్ఁ పవర్ఫుల్ ఇక్డ పైవ్రిమీ మార్కెటుంది. అగ్రికల్చరిస్టూ రయ్తులంత సరుకు తెస్సారికడ్కి. మార్కెటుకి. ఈ సరుకంతా ఆఁక్షఁలో అమ్మ్మతారు. కొనే కమీష్నెజెంట్సు ఎక్స్పోర్టర్సండవ్ఁ. వాళ్ళంద్రూ పయ్ స్టేట్లొసి ఉన్న ప్రిన్స్పల్సుంటారు వాళ్ల తరఫున ఇక్కడ సరుకుల్ కొంటారు. వాళ్లు మళ్ళీ కమిషన్ చార్జేస్తారు. ఇక్కడ మా మార్కెట్ పరకవఁయ్ ఉప్యోగ్వఁంటే ఇవాళుదయొవ్ఁ రొండు బళ్ళతో బెల్లన్దిసొక్చేరనుకోండి. ఆ బెల్లవ్ఁ వుదయవ్ఁ ఎనిమిది గంట్లకి వాడు తీసొకొస్తే తొమ్మిదింటికి పదిగంట్లకి అది వోపెన్ మార్కెట్లో పదిమంది ఉండగా ఆక్షనవ్తుంది. ఆక్షనయిన్దర్రోవ్త దరెంతో తెలుస్సుంది. తర్వాత కొనేవాళ్లు అమ్మే వాళ్ళు ఎవర్మటికాళ్ ఎళ్పోతారు. తరావ్త కులగార్లజెప్పీసి ఉంటారు. వాళ్లు. రైతు దగ్గిర కొంతానూ కొనేవాళ దెగ్గిరా కొంతానూ వాళ్ళ చార్జి...పడ్తుంది అందుకని వాళ్లు ఇంపార్షల్గ చూసి విళ్ళకీ వాళ్లకీ నష్టావ్ఁ లాబవ్ఁ లేకుంటా ఏక్చువల్గ ఎంతవ్తే అంత తూసీ చెప్పేస్సారు. తూస్న దాని ప్రకారొవ్ఁ ఆ కమీష్నెజెంటు రైతుకి బట్వాడ చెసెస్తాడు. ఇంచుమించు ఒంటిగెంట రొండు గెంట్లకలా మోఁర్నింగ్ ఎనిమిదిగెంట్లకు సరుకు తీసొకొస్తే ఒంటిగెంటకలా డబ్బు పట్టుకొనీ వాళ్సరుక్కి ఇంటికెళిపోవొచ్చు. అందుకనీ చిన్న రైతుల్కానీ పెద్ద రైతుల్కానీ అందర్కి ఇది ఈ మార్కెడ్ బాగ సదుపాయవ్ఁ. అందుకన్జెప్పి ఉపుడ్ మాతాలూకా సరుక్ కాకుంట గోదావరిజిల్లా నించి కుడా బెల్లవ్ఁ చలా ఒస్తుంది. చాలా లారీల సరుకొస్సుంది. వెంట్నే పరోజు డబ్బు ఆరోజు వెళ్పోతుంది, ఈ సదుపాయవ్ఁ ఉనందువల్ల. వాళ్లకేఁంటంటే ఇంకా అమ్మకొవ్ఁలో ఇంకో రకంగ అయిందని అనుమానవ్ఁ హేఁహా వుండదూ ఓపెన్

మార్కెట్లో అమ్ముతారు కబట్టి. ఇంకో రకవైఁన్ రైతుకీ ఏమాత్రాఁవ్ అనుమానుండదు. తరవాత తూకాలు కుడా ఇంకా వాళ్ళూ వీళ్ళూ డబ్బిస్తారు కాబట్టి వడూ ఆ కొలగార్లు ఇంకో రకంగ అన్యాయవేఁ సెయ్డందుకు చూడ్రు. మర్చన్సొశేన్ మెంబర్సు కమీషెన్జంట్సంటారు. కొలగార్లు వీళ్ళు వేరె. వాళ్ళు శ్రేబన్నమాట. శ్రేబు. వాళశ్రేబు మాత్రవ్ఁ ఈ కమీషెన్జెంట్సే కలెక్ట్ చెసీ వీళ్ళ దెరా వాళ్ల దెరా రైతు పట్టీలో కొంతే కలెక్ట్ చేస్తారు. వాళ్ల దెర కొంత కలెక్ట్ చేస్తారూ ఇదంతా వాళ్ళకి ... అఁ ... రైతు పట్లో కొంతానూ కొనుకున్న వాళ్ళదెర కొంతానూ కలెక్ట్ చేసీ వాళ్ళ కిస్తారు. ఎవరైనా ప్రోఫిటబులే. నోన్ సీజఁన్లో యేఁవ్ వ్యాపాఁరుండ దిక్డ. ఇంచు మించు సిక్సు మంత్సు వ్యాపారుంటుంది. సిక్సు మంత్సు వ్యాపారుండదు మార్కెటుకి. మా మరి మాకు ఎర్సెనగంటే ఆ సెప్టెంబ నించీ డిసెంబర్ వర్కూ ఇంచు మించు పండగ వర్కూ సరుక్ బాగా ఒస్సుంది. వచ్చినవ్డూ ఫుల్ క్రషింగ్ కెపేస్టీ ఉంటుంది. తక్కిన పిరీడ్లో మె ఎక్కడో కాళహాస్తనో లేపోతే మెడ్రాసనో ఎకెడెకడ్కో వెళ్ళి సరుకు కొనీ తెచ్కునీ ఇకడాడాలి. అంటే అంత ఎదో రీటిల్ సెయ్ల్స్ కొపవ్ చెయ్డందుకు ఉంచడం తప్ప అంతకంటె ఎక్కువ్లేదు. ఆయిలు మేవుఁ రాయ్పుర్ ఎక్స్పోట్ చేస్తావ్ఁ. మజ్యప్రదేశ్కు ఎఖ్సామ రాయ్పురే ఎక్స్పోట్ చేస్తావ్ఁ. అప్పుడప్పుడు కటకూ కలకత్తా చేస్సుంటావ్ఁ. ఒగో సవఁత్సవ్ఁ ఎప్పుడయ్న అయ్దార్ సవఁత్సాల్కొక్కసారి బీహార్ వాళ్ళు కుడ తీస్కెల్తారు. రాంచీ పాట్నా ఇవన్నీ వెల్తుంటాయ్. బెయ్యేల్లు చేస్సేవఁంటే యేవుందీ, మా ఇన్కమ్ టేక్స్ వర్కు మేవె చూస్కుంటావ్ఁ. అంటే ఎప్పడికవ్డూ తెలుస్సుంది ఒకటి ఉపోయ్గవ్ఁ. ఏటంటే ఏజ్పర్ లా మనవుఁ నడుచుకోడందుకూ ఎక్కువ ముందే మనవ్ఁ మన పరకారవేఁ నడుచుకుంటే మనకి తరవాత ఏ ఇబ్బందవదు. తెలీకపొతె ఒకవ్డు నష్టపోతుంటావ్ఁ. ఇప్పుడు మరీ పెనాల్టీసు ఇవన్నీ ఎక్కువయ్పోతున్నాయ్ కదండి. టేక్సు సిస్టమ్ కి ఏవిఁబ్బంది లేదు. టేక్స్ సిస్టమ్లో మాకేబ్బఁ ఎన్నిసార్లు టేక్స్ చేస్నా మాకు పర్లేదు కాని పీళ్ళన్నీ గెడి గెడికి రిటన్సిమ్మండొవ్ఁ ఆ తర్వాత రిజిస్టర్సనీ మేంటిన్ చెయ్మండొవ్ఁ ఇవన్నీ చాల ఇబ్బందయ్ పోతుంది మాకు. మేవూ ఎలాగో ఏకౌంట్స్ కొన్నదానికి ఎకౌంటుంటుంది. పమ్మిందాన్కి ఎకౌంటుంటుంది. స్టాక్ బుకుంటుంది. ఈ బుక్సిలా మేంటిన్ జెస్తే ఒకొక్క డిపాట్మెంటొచ్చి వాళ్లకు మళ్లీ వేరే రిజిష్టు పెట్కోమండవ్ఁ.

మా రిజిష్టర్లో వాళ్ళు చూడొచ్చు. కానీ అలా చూడ్రు. మాకు వేరే రిజిస్ట్రి సెస్‌వాళ్ళొకక రిజిస్ట్రి రైస్ మిల్ వాళ్ళకూ రిజిస్ట్రి ఒకొక్కొళ్ళక్ ఒకొక్క రిజిస్టరు కావలంటారు. వాళ్ళకి చాలా కష్టంఁగా ఉంటుంది. ఇపుడు మేఁవూ కాస్త చదువ్‌కున్నవాణి కాబట్టీ ఇవన్నీ మేన్టేన్ చెయ్‌డవ్ఁ సులువు. లేదంటే కొంచవ్ఁ కష్టపడవల్సొస్తది. ఎవ్రో గుమస్తాస్టేఫ్ నప్పాయింట్ చెయ్యాలి. వాళ్ళాపోతే ఏకౌంట్సు ఎరియర్స్ అవి ఉంటాయి. ఎరియర్స్‌గుంటే అదో ఇబ్బంది, చిన్న మిలయ్‌నా పెద్దమిలయ్‌నా ఒక్టే. డిఫ్‌కల్టీస్ అన్నీ ఒకటే. పెద్ద మిల్ అవుతే ఎస్టాబ్లిష్‌మెంటు కొంచవ్ఁ ఎక్కువెయ్‌నా ఇదవ్‌తది. చిన మిలయ్ నైర్కీ ఈ ఎస్టాబ్లిష్‌మెంట్ అదికుడా కష్టవ్ఁ. యేవ్ఁలేదు. డిఫ్రెంటు పాట్స్ నించీ స్పీకర్సొస్తారు. మా లెక్చెర్సెస్ వింటారు మేవింఁడవే. ఎవ్‌డేనా వోటవ్ థేంక్స్ ఎవ్‌డేనిస్తే ఇవ్వడవ్ఁ అంతకంటే ఎంలేదు. ఏసోసియేషన్ రోలూ డిఫ్రెంట్ ఏస్పెక్ట్స్ అఫ్ఫొ పోలిటిక్స్ అని లెపొతే ఎక్‌నామిక్స్ అనీ తరావ్‌త లిట్రేచరనీ విటన్నిటి మిదా సబ్జెక్ట్స్‌వో సెలెక్ట్ చేసీ ఎవరొవర్నొ పెద పెద స్పీకర్స్ని పిలిస్తావ్ఁ. వాళ్ళొచ్చి మాట్లాడ్‌తారు. మపర్సనల్ రోలు ఎటెండెన్సిచ్చి వుంటుందంతె. పబ్లిక్ రెస్పాన్స్ చలా బావుంది. చాలామంది స్పీకర్సొచ్చి చాల పెద్దూర్లొ కుడా ఇటువంటి ఏటెండెన్సుండదు. ఏటెండయ్‌న వాళ్ళొకుడా ముందు నుంచి చివరొర్కూ చాలా జేగర్తగ వింఁడవ్ఁ. ఏఁవన చివర్నేవన డౌట్సుంటే వాళ్ నడగడవ్ఁ, తెల్సకోడవ్ఁ. డిస్కష్ను చివఁర్న డిస్కష్ను ఇవన్నీ బో ఉన్నా యన్జెప్పొసి విసాపట్నవ్ఁ యూనివర్సిటీ స్టేజ్లో కుడా మాకు ఇటువంటి కల్చరల్ ఓర్గ్‌నయ్‌జేష్ను లేదండి. మీకా మీవూర్లొ ఆ ఇంట్రస్ట్ బావుంది. జన వొఁస్తున్నారు. వచ్చి...

## వ్యవహార ఖండికలోని వ్యాకరణాంశాలు

*ధ్వని విభాగం :*

'ప్రబా', 'దీర్గంగా', 'అర్దంకావడవ్ఁ', 'గ్రాందికింగా', 'దర', 'కరీచ్చేస్తారు' వంటి మాటల్లో మహాప్రాణోచ్చారణలోపం కనిపిస్తుంది. ఒత్తులు లేనిచోట ప్రవేశ పెట్టడం ఇతని వ్యవహారంలో ఒక విశేషం. ఉదా :- 'ఎక్ఖూ' (ఎక్కువ), 'ఫది మైళ్ళు'. అంటే, ఒత్తులు పలకడం శిష్టవ్యవహారంగా పరిగణిస్తున్నారని చెప్పడానికి ఇదొక నిదర్శనం.

*వర్ణ సమీకరణం :* 'స' కారానికి 'త' కారం పరమైనప్పుడు 'త' కారం

'స' కారంతో పూర్తిగా సమీకరణం కావడం, 'జేస్సన్నావ్ ', 'సరుకొన్నుంది', 'చెప్పేస్సారు', 'తెలుస్సుంది' వంటి పదాల్లో కనిపిస్తుంది. 'ద' కారానికి 'య' కారం పరమైనప్పుడు 'ద' కారం 'జ' కారం మారి తాలవ్యం ఐతుంది. ఉదా:- 'మజ్యప్రదేశ్శు' (మధ్యప్రదేశ్), 'ఇమజ్యెన' (ఈమధ్యన).

పదమధ్యన 'క', 'ఖ', 'వ' కారాలు లోపించడం ఈ వ్యవహర్తలో మనం చూస్తాం. అంటే ఒకసారి 'ఒసారి'గానూ లేకపోతే 'లేపోతే'గానూ విశాఖపట్నం 'విశా(/సా)పట్నం'గానూ, తరవాత 'తరాత', గోదావరి 'గ్గోద్దోర్', చోడవరం 'చోడ్డోర్రొవ్ ' ('వ'—>'ఒ') గానూ పలుకుతున్నాడన్నమాట. ఈ వ్యవహర్త వ్యవహార పరిణామదశకు గుర్తుగా 'ళ'కార 'ల'కారోచ్చారణలు ఉదాహరించచ్చు. 'వెళతావ్ ', 'ఎవర్ మటికొళ్ ఎళ్ పోతారు', 'తీస్కెల్తారు', 'వెల్తుంటారు', 'ల' కారోచ్చారణ కేవలం 'వెళ్ళు' క్రియలోనే కనిపించడం ఒక విశేషం.

భావార్థకంలో 'మాట్లాడేదన్కి', 'చెయ్డందుకు', 'కీపవ్ చెయ్డందుకు', 'మనవు నడుచుకోడందుకూ' పదాల వాడకం చెప్పుకోదగ్గ అంశం. 'తడి ఉంటది', 'అవ్తది', 'కొంచవ్ కష్టపడవల్సొస్తది' వంటి రూపాలు - అంటే అమహత్ ప్రథమపురుష ఏకవచనంలో 'త' ప్రత్యయం వాడడం-ప్రత్యేకమైన పరిశీలనావశ్యకతను తెలుపుతున్నాయి. కానీ, 'తేడా ఉంటుంది'. 'అవ్తుంది', 'జరూతుంది' వంటి పదాల వాడుకకూడా ఉన్నందువల్ల అనుకరణ క్లేశంలో ఇది ఒక దశగా గుర్తించాలి. ఇతని భాషమీద ఇంగ్లీష్ ప్రభావం అధికం. నిత్య వ్యవహారంలో ఇంగ్లీష్ వాడుక ఎంతవరకు చొచ్చుకపోయిందో నిరూపించడానికి ఇది ఒక ఉదాహరణ.

'జరూతుంది' (జరుగుతుంది), వాళ్ళద్దేర (వాళ్ళదెగ్గిరా- -), బ్బో ఉన్నాయన్జెప్పేసి (బాగా ఉన్నాయని చెప్పేసేసి) వంటి పదాల్లో పదమధ్యన 'గ' కారం లోపించడం చూస్తాం.

## వ్యవహర్త : 4

## టీచర్

కేంద్రం : నర్సీపట్నం, కులం : సిష్టకరణం,
వయస్సు : 47 సం॥ చదువు : బి.ఏ.బి.ఇడి.
వ్యవహారఖండిక : **నాటకాలు-సినిమాలు-విద్యార్థులు**

మా విషాగ్‌పట్ణవ్ఁ జిల్లా మాఁండలిక పదాలు గ్రాందికానికి దెగ్గరగా ఉంటాయని నాభిప్రాయవ్ఁ. స్లేంగుతక్కువ. అంటే యాసతక్కువ. దీర్ఘాల్ తక్కువ. ఈష్ట్‌గోడ్డే ప్రీ డిష్ట్రిట్లో ఎక్కువ్ సాగదీస్తారు. గుంట్రూర్ జిల్లాలో ఇఁతక్కువ్ జేసేస్తారు. షోర్టెన్ జేస్తారు. ఈష్ట్ గోడావ్రీ ఎన్ వెష్ట్ గోడావ్రీ లెంగ్తెన్ జేస్తారు. అ ఒంగోలు ఆ ప్రాంతోంలో అరవ టిన్ ... అయ్‌మీన్ న అంగోలు ఒంగోలు ఆ ప్రాంతవ్ఁలో అరవ్వాళ్ తాలూకూ సాంప్రదాయవ్ఁ కనబడ్‌తుంది. వొరిస్సా వైపు స్రికాకుళన్జిల్లాలో .... సీకాకుళన్జిల్లాలో అర్ధొవ్ఁ ఒరియాఁ వాళ్ళ సాంప్రదాయవఁటుంది. మాట్లోని పలుకుబళ్ళని విశ్శాగ్‌పట్ణవ్ఁ జిల్లా తెలుగూ గ్రాంధికాన్కి దెగ్గరగా ఉంటుంది. వితింది డిష్ట్రిట్‌కుడా డిఫ్రెన్సన్సెయ్. ఖాలూకాక్ తాలూకాక్ మాఁర్తుంది. ఎలమంచిలి తాలూకాలో మ్మాఁట్లు ఒహలా ఉంటాయ్. మీఁరు వొక్సారి చూస్తే తెలుస్తుంది. వాళ్ళు కొంచెవ్ఁ వాళది దీర్ఘవ్ఁ ఎకువుఁంటుంది. విశ్శాకపటంలో బోగుంటుంది. ఎలమంచిల్ తాలూకాలో వేరుగా ఉంటుంది. ఆఁ తరువాత విజెయ్‌నఁరవ్ఁ విషాపట్ణవ్ఁ ఒక్కలా ఉంటాయ్. భాష మార్తుంది. ఫ్రెస్యూమ్‌గ నార్తుకి వెళ్తున కొల్దీ భాష్లా చాల మాఁర్పుంటుంది. బయ్‌దిటైమ్ యు రీచ్ సోమ్‌పెటార్ ఇచ్ఛాపురమ్ ఇట్‌విల్ బి క్వైట్‌డిఫ్ఫరంట్. ఇప్పుడు గుంటూర్ వెళ్ళేవఁనోక్కండి, గు...గుంటూర్నుఁండి మాఁచెర్ల వెళ్‌నట్టు గుంటూర్నుంచి మొఁదల్ పెడ్‌తుంద్ భాష్లో మార్పు. అలా అన్‌మాట. డిబేట్సా? అఁ డిబేట్సు ఫోర్త్‌ఫోర్రొవ్ఁ చదువ్ కున్ దగనుంచీ ఎస్ బియ్యే పాశెయ్‌వర్కూ డిబేట్లొ తెలుగులోనీ ఆఁంగ్లొవ్ఁలో రెండు భాష్లోక్కుడా ఆసక్తి చూపించేవాణ్ణి. ఆఁ తర్వాత నాకొక్కన్ని ప్రయ్‌జుల్ కూడా అంద్లో ఒచ్చేయ్. అఁ ఇంగ్లీషూ డిబేటు ఇఁంగ్లీష్ ఎలక్క్యూషనూ

ఇంగ్లీష్ ఎస్సే రయ్‌టింగు. ఈక్వలీ సో ఇన్ తెలుగు. ఏమైనా ఎస్సేవోస్ అందర్కిన్ పెట్టేరు. అవేసెవాణ్ణి. ఇపుడూ "అప్పుడూ ఇప్పుడూ" భవిఁడ్‌పాటి కామేశ్వ ర్రావ్‌గారి .... తర్వాత మాఁ తెలుగు మేఁష్‌గారూ వార్పేరూ .... గారి నాటికలు ఒకసారి ఛత్రపతి శివాజీ అనే చరిత్రాత్మక నాట్కవ్ఁ కుడ వేశేవ్ఁ. అందులో శివాజీ వేషవేఁసేన్నేను. ఎస్సెల్సీ చదువ్‌తున్నప్పుడూ షేక్స్‌ప్యాలైకుట్ నాట్‌కువ్ఁ ఇంగ్లీష్లో వేశేవ్ఁ. అందులో రోజలిండు పాత్రవేశేనూ. దానిక్ బహుమాఁనంకూడా ఒచ్చింది. తవ్వాత ఇంట్రమీడ్యట్టూ చదువ్‌తున్నవ్‌డూ బియ్యే చదువ్‌తున్నప్పు కుడా నాట్కాలు వేశేవ్ఁ. అందులో ముద్దుక్రుష్ణ గారు వ్రాస్నటువంటి టీకప్లో తుపాన్ నాటకొంవ్ఁలో లీలామణి వేషవేఁసేను. దానికుకూడా బహుమానొవ్ఁ ఒచ్చింది. బియ్యాఁడీ చదువ్‌తున్నవ్‌డు కుడా ఒక నాటకఁ వేశేవ్ఁ వారసత్వావ్ఁ అని. అందులో జెమీఁందార్ ముసలో పాత్ర ధరించేను. తరువాత గ్రొల్లసుద్దుల్ చదవ్ఁడవ్ఁలో నదీనీ నాకు మంచి ప్రావీణ్య వుండే. అదికుడా చాలా మంది బాగా హర్షించేరు. తరువాత కాలేజీ విడ్చి పెట్టేస్తర్వాత అనాఁట్కాలు వెయ్‌డొంవ్ఁ తర్చుగా లేద్గానీ అవ్‌డొవ్‌డు ఉఁ ఏనివర్సరీ టైమవ్‌డూ పిల్లల్తోసహా వెయ్‌డొంవ్ఁ అలవాటుగా ఉంది. ఈమజ్జెనె ఒక ఏనిమిదేళగా నాట్కాలు వెయ్‌డవ్ఁ లేదు. ఆసక్తింకా ఉంగ్దేని వెయ్‌డవ్ఁ లేదు. వయ్‌సొచ్చేసిందీ, అఁ అందుచెతా. మాఁపిల్లల్ మాత్రవ్ఁ సంగీతవ్ఁలోని నాట్యావ్ఁలోనీ తరువాత ఇనాటకాల్ వెయ్‌డొంవ్ఁలోని వాళ్ళకి మంచి ప్రావీణ్య వుంది. వారిగి దోహదవ్ఁ చెయ్‌డెవ్ఁన .... సంత్రుప్తి చెందుతూ ఉంటాను. అసలీ వుజ్యోగవఁంటే నాక్కిష్టవ్ఁ లేదు. ఉపార్ధ్యాయుడుగా పనిచెయ్‌డనోన్నూ ఒక నాలుగు సవఁత్రాసలు మంచాశక్తో చేశేను. తరువాతేవోఁ ఒకరహవైఁన విసుగుపుట్టింది. అంచేత ఈ ఉజ్యోగాని ఇప్పటికో ఏడుసార్లు మానేషుంటాను. మెఁళ్ళీ ఇంకో ఉజ్యోగవ్ దొరకక్ పోవడవ్ఁ వల్ల మళ్ళీ ఇ ఉజ్యోంగ్లోకో జీవనోపాధి కోసవ్ఁ రావల్సొచ్చింది. నాఁకూ వస్తుతహా ఈ వుజ్యోఁగ్ మీద నాక్కిష్టన్లేదు. ఎంద్‌చేతంటే ఇందులో కష్టపడి పఁన్చెయ్‌డానిగ్గానీ స్సాహసవైఁన ప్లాన్లు చెయ్‌డానిగ్గానీ ఏదెయ్‌నా ఒక విప్లవాత్మకవై య్‌నట్‌వంటి పని చెయ్‌డాని గ్గానీ ఇందులో అవకాశఁ తక్కువ. అంచేత నా మనస్తత్వానిక్కి ఈ వుజ్యోగవ్ఁ సరిపళ్ళేదు. అయ్‌నప్పటిక్కి ఇంకో మాఁర్గాన్తర్లేక ఇదే చేస్తున్నా. పూర్వపు నాటకాల్కి ఇప్పటికీనా? పూర్వపు నాటకాల్లో ఎక్కువ్‌గా పాటకీ ప్రాధాన్యత

ఇచ్చేవారు. ఇప్పుడు కేవలంవఁ నటనకే ఎక్కువ్ ప్రాధేన్నతిస్తారు. తరువాత సంభాషాన్లో వైవిధ్యాన్ని ఎక్కువ్‌గా ప్రేక్షకుల్ హర్షిస్తారు. నటనకెక్కువ్ ప్రాధాన్యతిచ్చేర్ కద. అంచేత పాత్రపోషణకే ఎక్కువవిలువ ఇస్తున్నోవఁ. అంతక్ పూర్వొవఁ అట్లాకాదు. పాట్లు పాడేవాడు సులువ్‌గా స్టేజ్ మీదకి రాగల్గేవాడు. ఇప్పుడూ పాటల్ రానివాళ్ళే స్టేజిమీఁద ఎక్కువ్‌గా ఉన్నారు. వుఁండడానికొక్కారణవఁ వాళ్ళో నఁటనా ఆశెక్తి. అఁ సంభాషఁన్లవల్ల కధ నభ్రుద్ చేసుక్కనేటట్‌వంటి ఆశెక్తి ప్రేక్షకుల్లోనీ కలిగింది. సంభాషన్లో ఉన్న చాతుర్యాన్నే ప్రేక్షకులూ హర్షిస్తారు. ఆరోజుల్లో రఁంగాలంకర్ణకీ పాటలూ పజ్యాలు చదవ్‌డాన్కే ఎక్కువ్ ప్రాధేన్నత ఇచ్చేవా ర్గానీ నటనకి అంత ప్రాధేన్నత ఉండేదికాదు. అదినా ఉద్దేశవఁ. అది నిజెంకాదు. అంటే నటనన్నది ఒకటే కాబట్టీ రంగమ్మీఁద రాణిఁంచేవాడు సినీమాఁలో రాణించడాన్కి అవకాశేవఁ ఉంటుందేవోఁ గానీ ప్రైతీవాడు కుడా- రంగమ్మీఁదనే రాణించగల్గినవాడు ప్రతివొక్కడుకుడా- సినీమాఁలోక్ పనికొస్తాడు అన్ చెప్పడవఁ అంత సమంజసంకాదు. ఎంజేతంటే సినీమాఁల్లో నటన కెక్కువ్ ప్రాధాన్యత. మొఖొవ్‌లో భావప్రకటనకి ఎక్కువ్ ప్రధాన్యత. న్నాఁటక రంగంలో హస్తవిన్యాసాన్కి ఎక్కువిలువుంది. ఎంచేతంటే ఆడియన్స్‌కు చలా దూరంగా ఉంటార్ కాబట్టీ కొంచొవ్ అతిగా నటిస్తైగానీ ప్రేక్షకులూ దాన్ని అర్ధం జేస్కోలేరు. సినిమాలో అలాక్కాదు. కెమేరాముందు మొఖొవఁలో ఉనటువంటి మార్పును మఁనవెకువ్‌గా గమనిస్తాం గాబట్టీ మొఖొన్లో భోవ ప్రకటన్కే ఎక్కువ్ ప్రాధేన్నత ఉంటుంది. సినీప్టీళ్ళో నిజింగా చాలా ఎక్కువ్ కష్టపడ్ వల్సొంటుంది. ఎంజేతంటే అందరు మొఖాలూ కుడాను భోవ్ ప్రకటన్కి అనుగుణంగ ఉండవ్. అంచేత భోవ్ ప్రకటన్ తీసువ్ రావ్‌డాన్కి ఎంతో క్రుష్ చెయ్యాలి. ఆలోచ్నా షక్తి ఎక్కువ్‌గా ఉండాలి. ఓంది స్వక్రవ్‌ది మూఁమెంట్ ఎల్లాగొస్తె అల్లాయ్‌నా... న్నా టేక్ చెయ్‌డాన్కి వీల్లేదు. అఁ రంగమ్మీఁద లాక్కాదు. అతనిగి ఆసమయానికి ఏది భోగుంటుందో ఆవిధంగా చేశ్తి అడియన్స్‌ని బట్టి తన నటన చూస్కుంటాడు గెనీ సినీమాలో అది పనికిరాదు. చ్చాలహా బాగా ఆలోచించీ అ భావొవఁ మొఖొన్లో ఒస్తుందా లేదియా అనేటటువంటి ఆలోచ్నా శెక్తి కలిగి వాడు నటించాలి. అంచేతకష్టవేఁ. అలా అనికాదు. న్నాటక రంగవఁ వెనుక్‌బడి ఉండడానికి కారణవఁ ఏన్టంటే నాటకాల్ని పోషించే వాళ్ళు ల్లేరు, మొట్టమొదట. తరువాత న్నాఁటక సమాజవఁ నడపడవఁ కష్టవఁ,

డబ్బున్నప్పటికినీ. తరువాత నాటకవ్ఁ చూడ్డవ్ఁ ఖరీదెక్కువ. సినిమా చూడ్డవ్ఁ ఖరీదు తక్కువ. సినిమాలో చూబించినవెన్నీ కుడా నాట్కొవ్ఁలో చూబించ లేవ్ఁ. అందుచేతా ప్రెజలకీ నాటకాల్కంటే సినిమాల్ మీద మోజెక్కువైంది ఆప్రెజల మోఁజును అనుసరించే సినిమాకు ఎక్కువ్‌గా తీస్తున్నారు. మోఁడన్ సినిమాఁనూ ఉఁన్నంతవలసిన స్థాయ్‌లో లేవ్. అయ్‌నప్పటికీ పేదవాడికి సులభంగా వినోదాన్ని కలిగించేటటువంటి వొస్తువ్‌గా మాఁత్రవ్ఁ అత్తయారైంది. ఇప్పుడున్నటువంటి సినిమాఁ చాలా సవ్ఁస్కారవ్ఁ చెయ్‌వల్సిన అవ్‌సరొవ్ఁ ఉనది. ఆ సామాజికమైనటువంటి ఇతివ్రుత్తాన్ని తీస్కొనీ యేదో ఒక సమస్యని పరిష్కారం చేసేదిగా ఉండాలి. అంటే వినోదాన్ అందిస్తూ విగ్నేనాన్నికూడా గలిగించేటటువంటిద్‌గా ఉన్నట్టయ్‌తే సినిమాల్కి ఎక్కువ విలువుంటుంది. తరువాత ఎక్కువ్ పెద్ద ఫ్యూచర్ కుడా ఉంది. అప్పుడవ్‌డు ఒస్తూఉన్నాయ్- అఁటే నూటికేవ్ ఒక య్‌దు- అటువంటి సినిమాలు వొస్తున్నాయ్. కానీ తక్కిన్‌వన్నీ కుడానూ జానపదాల్గానో లేగపోతే చవక్కబారు అభిరుచిల్ని టిచ్చేటటువంటిగనో ఉన్నాయ్. ఆఁప్రజల్లో విగ్న్యానవ్ఁ తకువ్ కాబట్టి వినోదవ్ఁ యెల్లావున్నాసరే వాళు చూసే ఆనందించే పరిస్సితిలో ఉన్నార్. ప్రెజల అభిరుచులు హీనంగా ఉన్నాయ్. ఆ అభిరుచుల్ని హీనపరిస్సుతులోనుంచీ మెఁరుగు పర్చడంకూడా ఈ సినిమాల్ తీసేవార్మిదే బాధ్యత వున్నది. దానికొ్కంత వాళు సేక్రిఫైస్ చెయ్‌వల్స ఉంటుంది. కొత్తలో లాభాల్ తక్కువ్‌గా ఉన్నా రానురాను ప్రెజల్ తాలూకు అభిరుచుల్ని మార్చింతర్వోత సినీమాలు కొత్త పొంత్‌కాలో నడ్చిన్ సినీమాల్ బాగాడబుచేస్కుంటాయ్. ప్రేక్షకుల అభిరుచికంటే ముందు నిర్మాఁతల్ తాలూకా అభిరుచులు సరియేనివ్‌గా ఉండాలి. ఎందుచేతంటే మనొవ్ఁ యేది ప్రెజల్కి అందిస్తే అదిచూచే పరిస్తితిలో వాళ్ళున్నారు. అంజేత వాళ్ళ వాళ్ళతాలూకు అలవ్, నీచ అభిరుచుల్ని మఁనవ్ఁఎక్స్‌ప్లోయిట్ చేశిన్‌వాళ్ళవ్‌తున్నొవ్ఁ, ఇప్పుడీ ఈ పద్దతిలోనే సినిమాల్ తీయ్‌డవ్ఁవల్ల. అంజేత వాళ్ళకు ఎప్పుడుగుడానూ పెద్దవాళ్ళు చిన్నవాళ్ళకు చెప్పే పరిస్తితిలోనే ఉంటారు. చిన్నవాడి పరిస్తితికి పెద్దవాడు దిగజార్ పొయ్‌డెంటే ఆచిన్నవాడెవ్‌డూ పెద్దవాడు కాడు. పనికొస్సుందే. ఎప్పుడూ గుడానూ ఉపాధ్యాయ్‌డు ఆదర్శప్రాయుడ్‌గా ఉండాలి. ఉన్నటయ్‌తే పిలలు అ ఆదర్శాన్ దీస్కొనీ కొంత మందైనా

వొందవండ్లో బహాయ్దుగురై నా ఆవిధంగా నడవ్డాన్కి ప్రయత్నంజేస్తార్ గనీ పిల్లల పరిస్తితిలోకి ఉపాధ్యాయ్డు దిగజార్ పొయ్నట్టయ్తే అందరూ అధోగతి పాలవ్తారని నా ఉద్దేశవ్. ప్రీవియస్ ఇయర్సులో నేంజదూకున్ రోజుల్లో ఇండిసిప్లిన్ అన్నదీ... చాలా అరుదు. కాపీకొట్ట కొట్టే మనిషి విజ్యార్థి అయ్దువొందల్ మందై ఉన్నటువంటి పాట్ షాలల్లో కనీసవ్ ఒహాడో ఇద్దరో ఉండేవారు. వాణ్ణి తక్కిన విద్యార్థులు వెలి వేశినట్టు చూశేవారు. ఇప్పుడు తారుమారైంది. కాపీ కొట్టనటువంటి విజ్యార్థి వొక్కడెయ్నా కనీసవ్ంటాడో లెదో తెలుస్కోడవ్ చాలా కష్టవ్. ఆ విదంగా విజ్యా విష్యవ్లో డిసిప్లిన్ పోయింది. ఇట్టే చదువ్రీచ్యా చూశినట్టయ్తే డిసిప్లిను ఏ పిసర్ కుడా లేదు. ఇది ఈ డిసిప్లిన్ లేకోవ్డవన్నది పబ్లిక్ పరిషైల్లో మనందర్కి తెలిసిన్ విష్యవె; వేరె చెప్పనక్ఖర్లేదు. తరువాత బిహేవ్యర్లో డిసిప్లినూ అయోమయ్వేన పరిస్తితిలో ఉంది. చదువ్లో డిసిప్లిన్ లెదూ. బిహేవ్యర్లో కుడాను డిసిప్లిన్ లేదు. బిహేవ్యర్లొ డిసిప్లిన్ లేకోవ్డం కార్ణవ్ చదువ్లో లేకోవ్డవే. మన బిహేవ్యర్ చదువు మీద్గదా, మన విజ్యామీద్గదా, ఆధార్పడుంటుంది? అంచేత విజ్జెప్పుడైతే కుంటు పెడిందో. విజ్జెలో క్రమశిక్షణ ఎప్పుడైతె కుంటుపడిందో, వాళ్ళ తాలూకు బిహేవ్యర్లోకూడా అది తప్పన్సరిగ కుంటుపడ్తుంది. బిహేవ్యరు చాలా విష్యాల్ మీద ఆధార్పడుంది. ముఖ్యంగా మానవుడు సొసయ్టీలో ఒక సభ్యుడు కావట్టి సొసయ్టీ యెలా వుంటె అందులో ఉనటువంటి బిడలు అలాగే వుంటారు. ఒక్కా ఉపాజ్ఞాయుడే దానికి భాజ్యుడు కాడు. కానీ ఉపాజ్యాయ్డు కూడా సంఘవ్లో ఒక వ్యక్తే. అంచేత మొత్తావ్ సంఘమ్మీదా ఈ కుర్రవాళ్ తాలూకు బిహేవ్యర్ అధార్పడుంటుంది. తప్పన్సరిగ. వొ సభ్యుడ్గా ఉండి మెలగాలి. తరువాత ఉపాధ్యాయుడ్గా తన పని నిర్వర్తించాలి. న్నా మట్టుకు నన్నడిగితే నేను ఉపాజ్ఞేయడ్గా సాజ్ఞవేనంత మట్కూ పాత పద్దతిలోనే కుర్రవోళ్ళకి కాస్త ఆదర్శప్రాయంగా ఉండాలనే ప్రయత్నన్చేస్తున్నాను. కానీ ఆవిధంగ ఆదర్శప్రాయంగా ఉన్నటువంటి ఉపాజ్ఞేయ్లు వేళ్ళమీద లెక్కెట్టచ్చు. చాలా తక్కువ్మంది. అంటే ఇతరుపాజ్ఞాయుల్ని కించపర్చేటటువంటి వుద్దేషంత్తో కాదు. న్నేనేమో గొప్పవాణంజ్ ... అనిపించుకోడంకాదు. నా పరిశీలనవల్ల తెలిసిందేంటంటే ఆదర్శప్రియంగా ఉన్నటువంటి వి, ఉపాజ్ఞేయ్లూ ఈ రోజుల్లో ఛాలా తక్కువ. మేవ్ చదువుకున్రోజుల్లో

అసలు ఆదర్శాల్లేని ఉపాధ్యాయ్‌లు అరుదుగా వుండేవారు. ఏఁవ్ ఎక్స్‌పెక్ట్ చేస్తామా? ఉపాధ్యాయ్‌డూ టైముకుముందు రావ్‌డవ్ఁ. దానివల్ల పిల్లలూ టైముగ్ రావ్‌డవ్ఁ నేర్చ్‌కుంటారు. ఉపాధ్యాయ్‌డూ పాఠంచెప్పడవ్ఁ. యే గయ్‌డో యేదో చూసొక్కేన్ చదూకోంఁడ్రా అంచెప్పకుండానూ చకగా కష్టపడీ పాఠవ్ంజెప్పడవ్ఁ. పాఠంచదివారో లేదోపిల్లల్ని పరీక్షచేస్తూ ఉండడఁ. వాళ్లు సరిగ్గా శర్దగా చదవ్‌పోతే వాళ్‌ని కాస్త దండించటవ్ఁ. ఇటువంటి పన్లు చాల కష్టంతో కూడుకున్నటువంటి పన్లు. అవిప్‌డు ఒదిల్‌పెట్టేసేర్ చాలా మంది. పాఠంజెప్పేడవ్ఁ. ఒచ్చిందా లేదా చూడ్డాన్కి విలకీ పెద్ద ఆసక్తి కన పర్చరు. ఆవిదంగ చూచినట్టయ్‌తే చికాకుల్ కలుగ్తాయనేటటువంటి ఒక భయ్యాం కుడా ఉంది. థరువాత పరీక్షల్లో ఈ ఇంవిజిలేషన్ సరిగ్గా చెయ్యాకపోవడోవ్ఁ. వీటన్నిట్‌కూడా సమాజంతాలూకు ప్రభోవోవ్ఁ దానిమీదుంది. ఎంజేతంటే కఠినంగా ఉన్నట్టయ్‌తే రేపేంప్రమాదవ్ఁ ఒస్తుందో అనేటటువంటి ఉద్దేశవ్ కొంతమందీ. మఁనకెందుకిలే అనేటటువంటి వుదాసీనభావోవ్ఁ ఇంకొంత మందికీఁ. ఈ విధంగా ఉన్నట్టయ్‌తే పిల్లల్లో మనకీ అన్‌పోప్లేటీ ఒస్తుదనేటటువంటి భయ విఁంకొకటి. ఆవిధంగా ఉన్నట్టయ్‌తే మఁనకి ఇతరత్రా ...

## వ్యవహారఖండికలోని వ్యాకరణాంశాలు

*ధ్వని విభాగం:*

వర్ణసమీకరణం ఈ వ్యవహార ఖండికలో విరివిగా కనిపిస్తుంది. 'స' కారం లోని 'త' కారం, రేఫ 'వ' కారంలోకీ, 'య' కారం 'న' కారంలోకీ వర్ణ సమీకరణం చెందడం కింది పదాల్లో చూస్తాం – 'తర్వాత', 'ప్రాధాన్నత', 'పరిస్సి తిలో', 'పనికొస్సుందే;' 'పజ్యాలు', 'విజ్యార్థులు', 'భాజ్యుడు', 'ఉపాధ్యాయు డ్‌గా', 'చదువ్‌రీచ్యా', 'వుజ్యోగవంటి' వంటి పదాల్లో 'ద' కార 'త' కారాలకి 'య' కారం పరమైనప్పుడు పాక్షిక సమీకరణం వచ్చి 'జ' కార 'చ' కారాలుగా మారడం చూడొచ్చు. సంపూర్ణసమీకరణంచెంది ద్విత్వం కావడం 'మజ్జెనె', 'విజ్జెలో' గమనించచ్చు. ఈ రొండు పదాల్లోనూ కంఠ్యాచ్చైన 'అ' పూర్వ 'జ' కారంవల్ల తాలవ్యాచ్చైన 'ఎ' గా మారింది.

మహాప్రాణోచ్చారణ లోపం, దాని పాటింపూ, రొండూ ఈ ఖండికలో విరివిగా కనిపిస్తాయి. ఒత్తులు నిలిపిన వాటిల్లో 'దీర్ఘాల్ తక్కువ', 'గ్రాంధికాన్కి', 'ప్రాధాన్యత', 'అభిరుచుల్ని', 'పాఠంచెపడవ్', 'భయవింకొకటి', 'సంఘావ్',

'అర్థం జేస్కోలేదు' కోన్ని; అల్పప్రాణాలకి ఉదాహరణాలుగా-'గ్రాందికానికి', 'బాష్లోమార్పు', 'సులబంగా', 'అబిరుచులు', 'బాజ్యతవునది', 'పాటం జెప్పేడవ్ఁ', 'పరిస్తితిలో', 'లాబాల్', 'పద్దతి'. మహాప్రాణత్వం లేనిచోటకూడా ప్రవెశపెట్టడం 'థాలూకాక్', 'భాగా', 'భాజ్యుడు', 'ఘాలాతక్కువ'లో చూస్తాం. ఈ వ్యవహర్తలో 'థ' కారోచ్చారణ పరిశీలింపదగింది. పదాదిన 'థ' కారోచ్చారణను పాటిస్తే (స్థాయ్‌లో) పదమధ్యన సంయుక్తాక్షరాల్లో మహాప్రాణత్వం లోపించడంగానీ (పరిస్తితి) లేకపోతే 'ధ' కారంగా ఉచ్చరింపబడడంగానీ జరిగింది (గాంధికాన్కి). టీచర్ ఉద్యోగంలో ఉన్న ఈ వ్యవహర్త భాషలో సంస్కృత పదాల వాడకం చాలా అధికంగా కనిపిస్తుంది. పదాదిన 'వ' కారలోపం లేకపోడం గమనించాలి. కానీ పదమధ్యన ముఖ్యంగా క్రియారూపాల్లో 'వ' కారలోపం నిత్యంగా కనిపిస్తుంది-ఉదా. 'లేకోప్డమన్నది', 'చెయ్యిక్‌పోడవ్ఁ', 'తెలుస్‌కోడవ్ఁ', 'చదూకోంద్రా'. పదమధ్య 'క' కారం 'హ' కారంగా మార్తుంది. 'ఒహడో', 'ఒహయ్‌దుగురైనా', 'రహ్వైఁన'. అపదాదిన అక్షరలోపం- 'ఎక్కువిలువుంటాంది' (ఎక్కువ విలువుంటుంది), 'విజైయ్‌నఁరవ్ఁ' (విజయనగరం), 'విపాపట్నవ్ఁ' (విశాఖపట్టణం). మూర్ధన్యతాలోపం లేకపోవడం కూడా గమనించాల్సిన విషయం. భూతకాలంలో 'ఏ', 'ఐ' ల ఉచ్చారణ ఇక్కడి వాడుకలోని సామాన్యాంశాన్ని సూచిస్తుంది. ఉదా: వేశేను; వేశైవు. క్రియారూపాల్లో 'స' కారం 'శ' కారంగా ఉచ్చరించబడడం సామాన్యాంశం. ఇక్కడి వాడుకలో దీనికి-వేశేను,' 'పాశెయ్,' 'వెలివేశ్‌నట్టు', 'మానేశుంటాను' ఉదహరించచ్చు.

వ్యావహర్త : 5

## గ్రామీణ విద్యార్థి

కేంద్రం : విజయనగరం, కులం : తెలగ,
వయస్సు : 22 సం॥, చదువు : బి.య్యే(ఫైనల్)
వ్యావహారఖండిక : సినిమా కథ

బలరాన్ సహానీ ఒక పెద్ద బిజినెస్ ప్యాన్... పెర్సన్: అందులో రజేంద్ర కుమారు ప్రజెక్లోరుగ్గా ఉన్నాడంత: క్లారుగ్గా ఉన్తరవాత ఇతను మంచి సిన్సెర్ హేండ్ రాజెంద్‌కుమార్; బాహ్‌రాజ్ సహానీ ఇతన్నుఁ చాలాసార్లు టెశ్ చేశేడు గుడాను; ఇందుకూ బహ్‌రాజ్ సహాన్నిఁకీ ఒకమ్మాయుంది-పర్మ్లా టాగూరు ఉఁంది కదండి; ఉంటే యవరయ్ తెనన్ దనమ్ ప్రేమిన్‌దనాన్ని ప్రేమించు కుంట మా అమ్మాయిని ప్రేమించీ ప్రేమిస్తాతో ఆలాంటి వాడికి నా కూతుర్ని ద్దావ్ఁని వుద్దేశవ్ఁ బహ్‌రాజ్ సహానీకుంది; అలాంటపుడేఁ అన్ని విధాల టైష్ చేస్తునాడీడు బహ్‌రాజ్‌సహానీ; ఈ వోకప్పుడేంజేసేడండి యీాడూ తలైడ్ రజేంద్ర్‌కుమాఁరు హీఁ హిమ్మాఁలయ్ కెల్తాడు; ఎళ్తే అక్కడా కొంతమంది -ధుండగులన్‌కుంటాను-ధుండగులంటే వీణ్ని కొట్టి కొడ్డోఁక్ ప్రత్నించారు; కొడ్డోఁక్ పయత్నించ్ గురమీఁన్ పడిపోతాడు; స్టోరి రనింగ్ రేస్లా రనింగ్ రేస్లా ఇడూ పడిపోతాడు; పడిపోయిన్‌త్రవాత అ అదే శైమ్లో పర్మ్లా టాగూరు యీా లంబాడీ వేషవేఁస్కుని అకడ నిఁజు ఫ్టాటో తీంచ్‌కుఁటంది; ఫోటో తీఁంచ్‌కుంటె అక్కడ్ పడిపోతే ఆణ్ రక్షిస్‌దఁన్‌మాట. రష్ఁచిన్తర్వాత పిలవ్‌డు హిమ్; లొవ్‌చెన్తది; లొవ్ చేసిన్‌తరవ్‌త ఇదేవోఁ అదేవ్ఁ అయ్‌డియస్ ఉందండి అపర్మ్లాటాగూరు; వీడ్‌నేఁన్ జమిఁన్‌దారిఁఁన్ తెలిస్తె వీడు ప్రేమిం చడు: నేన్ ఇదే దుస్తుల్లొ ఉంటె ఈడు ప్రేమిస్తాడు అనె ఉద్దేశవ్ఁ తనకుండేదన్ మట; అలాగాక్‌డా హిమాఁయ్స్నదెక్ రొవ్‌క ఇళు తీస్కుంది; ఒకిళ్ళు తీస్కున్న అత్న అన్చరుడూ ఇంక ఉండేవాడు; దానిక్ అన్చురుడూ యెవడో అప్ అత్తంద్రి లైగన్‌మాట ఫ్టక్‌చెసొవ్‌డు; రజెంద్ర్‌కుమాఁ యెళ్‌పోయ్‌వోడూ అదికూడా యెల్పోయ్‌ది అకడ్‌కిను; అలాగీ విదంగ శైమ్ చేసఁంది; ఇది గూాట్లేమ్ చేన్తఁంది. ఆడికేఁన్ తెల్లోద్దు. ఫేసుల్ చూాస్తె ఓటేని తెల్స్కపోఁతుంద్ గాఁన్ అతఁడ్డికి

కాని ఇక్కడా ఈ విధంగ వుంది. అక్కడా విధంగా వుంది: యెవరని సందేహ్ వొచ్చేస్తుంది; యికనాడు కార్లో వొళ్యుంటెయ్యాణ్ని తీస్కెళ్తుంది; ఎకడక్కు ఇలెస్టేట్ తీస్కెళ్తం తీస్కెంటుంన్ చాలా స్పీడుగా ఎల్తుంటె ఈడు భయ్ ఫడ్ పొతనాడు. యీడికిగూడ రజేంద కుమార్ తల్లి ఉంది; హోతల్లీ వృజ్జో గవ్ వీడ్కి తర్వాతా ఈడి సీన్ సెర్నిపెట్టి బహ్రాజ్ సహాని అంటే వీడికి ప్రమోషన్ మేనెజర్గ అంగుట్ నయ్థింక్ మ్మేనెజర్గా అపోయింట్ చెశేడు: అక్కణుంచాక్ పెద బంగ్లా కారూ తా ఇచ్చేర్న్ మాట: అతేళ్ళిన్ గుడ ఇతన్ బంగ్ళా తీస్కొచ్చేడు. యెవ్డైతె విళిద్దరూ షర్మిలా టాగూరు రజెంద్కుమారూ వస్సన్నాడో ఒక బిల్డిం ఎస్టేట్ షర్మిలా టాగూరు ఎస్టేస్ కెంల్తనారు: ఇల్తవ్డు ఆ సమ్యోవ్లోనే అతన్ తల్లి దున్ సీరియస్లో ఉంది: చెనిప్తోయె సితిలో ఉందనమాట. అవ్కోర్స్ ఇతన్ తెయీదేమొ తెల్సి ఉన్న నక్ సయ్గాగ్నెవ్క లేదంకోండి. వెళ్ళేడు. ఇతనికి మంచి ఆది ప్రేమా చూపుల్ చూడ్డవ్ అదనీని ఎక్వ్వంద్ దాసికి ఆవిడ్కి. కాని ఈడికి మంచి ఇమోషంగా ఉంది. ఆవిడ్న..., అదే టేమ్లో డక్కడేంజరూతుందొ మనస్సు యీడికీ గుడా అదుంది. షడ్నగా ఈడికీ మ మనస్ ఫ్లీలెయ్ రిల్నెయ్ పొయేడు. రిట్నయ్ పెయ్ తరీ దైర్ కొచిస్సేడు. తెలీ దర్ కొచ్చిసి తెలి దర్కొస్తవ్డు తల్ చచ్పొయుంది. ఆ ఫ్లీలేటి న యిమోషన్ వల్లకదా నె అమోయ్ ఉండ్ పోయ్ అంతవర్కున్స్తె లెకోస్వేన్ లెకోస్వెడ్ల నెవొచ్చేవాణ్ణికద వేగ్ వొస్తె నా తల్లిన్ రక్షించ్క...వాత్ ఫ్లీలయేడు. తరువాత బారాన్ సహానీని ఈషర్మిలా టాగూరు ఎప్రొచ్ నా షరె యీడు యీడు మన స్తిమిత పర్చకొలేకపొయేడు. ఇలాగ్ కొన్నాళ్లు కొనట్ కొంతవార్ జరిగింది. కొందరైన్ తర్వాత మళ్లీ ఈడూ మనస్సు దీనిమీద లాగుతుంది. ఈపేసు ఆపేసు ఒకలాగె ఉండేది. ఇకిడ్కెలాగొస్తాది అ లంబాడీ సమ్మదర్ పెర్సన్, యెలాగ ఇగడ్ కొస్తుంది అనీడికీ ఒ భావం ఏర్పడ్డది. బుర్ షఅంగ లైవ్ చేద్దావనీ యంట్నె ప్లేన్లో ఒచేస్తడూ. ఎదె ఖాష్మీరు. అదే యెలెతవడ్కీ ఆడొకడుంది మళ్ళిని. టౌన్ చూస్తవడ్కి లేదన్ మర్చపేను. లేదు వీడిదెర్లేదు. లేపొతపడ్కీ యా కొండల్లో విళూ ప్రేమించుకున్న కొండ్లున్నాయ్ కదండి ఆడికి వెళ్ళె రన్మాట. కొండల్ కెళ్ళిన్తర్వాత చూస్ పిలిస్తవడ్కి అది మరేంద్కునా ఆ ప్రేమా పోయింది యేవ్ మరి అత్న నను ప్రేమించ్ లేదనీ చనిపోయ్డానికి కొండ్లూ మీదికి వెళిపోతుంది. వెప్తే ఈడూ అన్తున్న వెళ్ పోతుందీ ఆ మజిథార్లో దీన్ని

వీడు షర్మ్మిలా టాగూరు తండిర్ లాగా ఏక్ట్ చేశేడు కదండి వడు వాడి దెగెర్కి. వాడు కనిపించేడు. వడు కనిపింతర్వాత ఓణ్ణడిగేడు ఈ షర్మ్మిలా టాగూరు పేరు. ప్లెగ్గర్ గ్స్య్వక్లేదు. ఏందంటె వెళ్ళిపోతుందావిడ అన్చెప్పాడు. చెప్తే వడెల్లి యీడు పరిగెట్టి రైల్ పోతున్నాడు అవ్ంర రక్షించడాన్కి. కొంత ప్లేడిస్టన్ట్ అయింతోర్తిత పట్టుకున్నడన్కోండి. పట్కున్తర్వాత అలాగ వాళ్ళిక్క ప్రేమ వల్లేసైంది దీన్వద పడిపొ'యెడన్మాట. పా...పడ్ పెన్తర్వోవ్త విగ్గు పడిపేంది ఇదే ఇదాన్ తెలిస్పేంది. వ...చివర్కి. వడో బహ్రాజ్ సాహానీలొచ్చి పెళ్ జేస్సేరు.

## వ్యవహార ఖండికలోని వ్యాకరణాంశాలు

*ధ్వని విభాగం :*

జానపద భాషాలక్షణాలను బాగా ప్రతిబింబించే ఈ సినీకథ ఒక గ్రామీణ విద్యార్థిది. మహాప్రాణతోచ్చారణకి 'ధనమ్', 'అన్నివిధాల', 'భయ్పడ్ పోత నాడు', 'ఒ భావం ఏర్పడ్డది' ఉదాహరణాలు. అల్పప్రాణత్వం పాటించకపోవడం ఒక విశేషం. కానీ, మహాప్రాణత్వం లేనిచోటకూడా ఉచ్చరించడం 'ఖాష్మీరు', 'అమజీధార్లో' (ఆమధ్య దార్లో) -ల్లో చూస్తాం. అంటే, ఒత్తులు నిలపడం ప్రమాణ భాషావ్యవహారంగా గుర్తిస్తున్నారని చెప్పాలి.

పదాదిన 'వ' కార లోపం ఇతని వ్యావహారంలో అధికం. ఉదా:- 'ఎళ్తే', ఇడూ'. 'ఈడు ప్రేమిస్తాడు', 'ఇల్తవ్డు', 'యీడికీ','యీడిదెగ్గర్ర', 'వ'కారం నిలిపిన సందర్భాల్లో 'వెల్తుంటి', 'వస్సన్నాడో' కొన్ని. 'యీడికీ', 'యీడి దెగెర్కి' లో వకారలోపంమీద తాలవ్యాచ్చైన 'ఇ' ముందు 'య' కారం ఒచ్చి చేరింది. ఇదే పరిణామం 'యంట్ని', 'యెలెతవడ్కి' లో జరిగింది. మూర్ధన్యతా లోపంకూడా ఇతని వ్యవహారంలో ఎక్కువే. కానీ 'ళ'కారోచ్చారణ కేవలం 'వెళ్ళు' క్రియకే పరిమితం కావడం విశేషంగా కనిపిస్తుంది - 'హిమ్మాలయ్ కెల్తాడు' 'తీస్కెల్తంది','వెల్తుంటి', ఇల్తవ్డు', 'చెప్పెవడెల్లి', 'యెల్పోయ్ది'. ఈ మూర్ధన్య, తాలోపం (-ట- ⟶ -త-) 'యెలెతవడ్కి' (వెళ్ళేటప్పుడికి), 'చూస్తవడ్కి' (చూసే టప్పుడికి), 'పిలిస్తవడ్కి' (పిలిచేటప్పుడికి) వంటి పదబంధాల్లో చూడొచ్చు. ఇది జానపదుల భాషలో మనకు బాగా కనిపిస్తుంది. 'వస్సన్నాడో','రష్షించిన్తర్వాత' పదాల్లో 'త' కారం 'స' కారంతోనూ 'క'కారం 'ష' కారంతోనూ సంపూర్ణ సమీకరణం జరగడం చూస్తాం. అట్లాగే, 'ద' కారానికి 'య'కారం పరమైనప్పుడు 'ధ'కారం 'జ'కారంగా మారి, పరవర్ణమైన 'య'కారం పూర్వవర్ణమైన 'జ'కారంతో

సంపూర్ణ సమీకరణం చెందడం 'వృజ్జోగవ్', 'మజిధార్లో' కనిపిస్తుంది. వర్ణ సమీకరణం చెందని పదాల్లో 'రఘిస్దఁన్మాట' ఒకటి.

వర్తమాన క్రియారూపాల (present tense forms) ఉపయోగం ఇతని భాషలో ఒక ముఖ్యాంశం. 'తీంచ్కుంటంది', 'తీస్కెల్తంది', 'ఎస్టేట్కెల్తనారు', 'భయ్పడ్పొతనాడు' రూపాలు ఈ మాండలికాన్కి సమ్మందించినంతవర్కూ వష్టేతర వ్యవహారానికే పరిమితంగా ఉన్నాయి. అదికాకుండా ఈ రూపాల వాడకం బ్రాహ్మణేతర వ్యవహర్తల్లోనే కనిపించడం ప్రత్యేక పరిశీలనావశ్యకతను తెలుపుతున్నాది. భూతకాలంలో 'ఏ', 'ఏ' ప్రత్యయాల పర్యాయరూపత ఇతర వ్యవహర్తల్లోలాగానే ఇతన్లో కూడా కనిపిస్తుంది. ఉదా :- 'చేశేదుగుడా', 'వొకప్పుడేంజేసేడండి', 'రిటైరైపొయెదు', 'కనిపించేదు'.

భవిష్యదర్థకంలో దీర్ఘహ్రస్వాచ్చుల పర్యాయ రూపత గమనించాల్సిన విషయం. ఉదా:- 'హిమ్మాలయ్కెల్తాడు', 'చేస్తడు', 'ఇకిడ్కెలాగొస్తాది,' 'లొావ్చేస్తది'.

## వ్యవహర్త : 6
## ఉద్యోగి

కేంద్రం : అనకాపల్లి, కులం : బ్రాహ్మణ,
వయస్సు : 35 సం॥ చదువు : ఎస్.ఎల్.సి
వ్యవహారఖండిక: భాషారూపాలు-మార్కెటింగ్ సౌకర్యాలు.

డెయ్లీస్చదువ్తాను. పేపర్లో చదువ్తాను. తరవాత వీక్లీస్సు కుడ చదువ్తాను. వారపత్రిల్ చదువ్తాను. డెయ్లీవి డెయ్లీ పేపర్లు ఎక్కువ్ చదువ్తాను. ఎప్పుడేనా వారపత్రిల్ చదువ్తాను. అప్పుడప్పుడ్ నవల్ చదువ్తాను. రేడ్యో ఎప్పుడూ వింటుంటాను. సినిమాల్ చూస్తాన్ అపుడవ్డూ. ఇంగ్లీష్ కాకుండా తెలుగూ, హిందీ కొద్దిగా తెల్సు. కొద్దిగా అర్థవవ్తుంది. సోషల్ క్లోన్టేక్సూ ఏ ఎక్కువ్గాలేవు. ఆఫీస్ కాగానే లైబ్రెరీ దగిర్ కొచ్చిన పర్చేసుల్తోటి మాట్లాడ్డవ్ స్నేయితుల్ తోటి. తరవా టోఫీస్కూ

స్నేయితులు. తరవాత తెఁల్‌నున వాఁళందర్ తోటి మాట్లాడ్తుంటవ్ఁ అపుడప్డు. అక్లబ్బుక్ వెళ్తావ్ఁ. ఇఁ అన్నిరకాలవాళ్ తోటి కలుస్తావ్ఁ. అపుడప్పుడు మాట్లాడ్తాంటవ్ఁ ముఖ్యంగా వర్తకులూ రైతులూ. అఁ వర్తకులూ రైతుల్‌తో అఁ అప్డప్డు ఒస్తుంటార్. వార్ దెగిర్కి మనవ్ఁ వెల్తుంటావ్ఁ. ఇకడ అనకాపల్లొనె పనెండ్ సవఁత్సాలున్నాను. ఇక్డ కాకుండా ఇక్కడ కైకుండ కుడా ఉన్నాను. చోడవరొన్లో నాలుగు నాలుగు మాసాల్ నుఁచి ఉంట్నాను. వనియర్ కఁడడా అకడ తున్లో ఉన్నాను. తున్లో రొండు సవఁత్సాలున్నాను. అక్కడగ్ వేరే వ్యాపారొవ్ఁలో పన్చేస్తునవ్డు. ఉండేవాణ్ణి. ఇంకా వనీఁర్ కంటి ఎక్వా? వనీర్‌కంటి ఎక్కువ ఇఁం కెకడ్ లేను. వర్ ఉరట్లో ఉన్నాఁను. స్వస్తలంలోని, ఓ ఈస్తు వెస్టు గొడావరిస్‌లొ మాట్లాడే భాష్ చాలా బోవుంటుందని నా అభిప్రాయవ్ఁ. చివికి చాలాబాగా ఇని ... వినిపిస్తుంది. ఇగ్‌పోతే ఇంకా మీదక్ పోయిన్ దెగిర్నించీ ఉర్దూ భాష్‌తోటి కలిసుండడవ్ఁ వల్ల కొంత మాకూ బోగుండదనిపిస్తుంది. అక్కడ వాళకు బాగున్నప్పడకీ మాకు బోవుఁండదని అన్‌పిస్తుంది. క్రిశ్నే గుంటూర్ కూడా బానే అన్‌పిస్తుంది. కధరాయాలన్ కుంట్నపుడూ అగ్రాంధిక భాష్లోనే రాస్తావ్ఁ. వ్యావహారికవ్ఁ. ఇక్కడ ఇక్కడ భాష్లోనే రాస్తోవ్ఁ. రాస్తారు. రాయల్‌సీమ రాయల్‌సీమ్ భాష్ విన్నాను. అదిగూడ బాగనే ఉంటుంద్ అయితె కొద్దిగా అఁ కొన్ని పదాలూ వారూ ఎక్కువా అదోలాగ వాడ్తారు రాయెల్ సీమవారు. చెవుకీ బాగనే ఉంటుంద్‌గానీ ఏదైనా మొత్తమ్మీద మా భాష్‌కి దాన్కి తేడా ఉండడం చేతా సరిగ్గా ఉన్నట్ కన్పించదు. అది కొత్తకావ్ డవ్ఁ వల్లే అనుకోవాలి మనవ్ఁ. నాభాష్ చాలా మంచిదీ అని అనుకుట్నాను. ఇక్కడ విశేపట్నవ్ఁ జిల్లాలో మాట్లాడే భాష చాలా బాగానే ఉంటుందీ. అఁ యెజ్జుకేటిడ్‌కీ ఎప్పుడూ డిఫ్‌రెన్స్ ఉఁటుంది. యెక్కుడైనా సరే ఉంటుంది. ఎంచేతంటె స్ఫుటంగా ఉంటుంది భాష ఎజుకేటిడైనప్పుడు. లేపోతే స్ఫుటంగా ఉండదు. అదీనా అభిప్రాయవ్ఁ. తరవాత యెక్కువ్‌గా విద్యావంతుడైనపుడుండేదేటంటే సవ్ఁస్కృత పదాలు ఎక్కువ్ కనిపిస్తాయేమో అని అనిపిస్తుంది నాకు. సవ్‌స్కృత పదాలు కల్పుంటాయేమో అని అనిపిస్తుంది. తరవాత గ్రాంధిక భాషే యెక్కువ. వాఁ గ్రాంధికమ్ భాగా యెక్కువ్ కనిపిస్తుంది ఎడీవ విద్యావంతుడు మాట్లేడ్నపుడు. ఇప్పుడు స్పీచెస్తే ఇపుడు స్పీచెస్తూ ఇస్తునార్‌గానీ సర్యైన భాషా ఉప్యోగ్ పట్టంలేదేమో ఉప్యోగ్గించ్‌టవ్ఁ లేదేమోఁని అభిప్రాయ పడ్తున్నాన్నేను.

ఎంచేతనంటె భాషన్ని ఇష్టాన్సేరంగా ఉపోయ్యగించీషీసి మాట్లాడేస్తునారే తప్పించీ భాషాయుక్తంగా మాట్లాడ్డవ్ లేదేమోని అనిపిస్తుంది నా...నాభిప్రాయన్లోని. ఒకోవేళ సర్యైన ఇచ్చెయ్యాలన్కున్నప్డు మాత్రోవ్ భాష సరిగ్గా ఉపోయ్యగిన్చడవ్ ఒచ్చిన వాళ్ళూ చెప్తునట్వంటి ఉపన్యాసానికిన్నూ అ ఉపన్యేసవ్ వినాలనిపించదునాకు. రానివాళ్ళు చెప్పే ఒ ఉపన్యేసవ్ వినాలనిపించదునాకు. అంటె అదినా సొంతభిప్రేయవంకోండి. పొలిటీష్యన్సు వాళు మాట్లైడెదీ యెదో కొంతమంది మాట్లాడే భాష వినాలంపిస్తుంది. ఎంచేతా? చాలా బోగుంటుంది. కొంతమంది మాట్లేడేభాష అంత బోవుంటల్లేదు. వ్యవహారికవ్ మాట్లాడి వ్యవహారికవ్ మాట్లేడ్నప్పుడుకూడా బోగుంటల్లేదు కొన్నిచోట్ల. ఎంచేతనంటే వాళ్ పదప్రయోగొవ్ సరిగ్గాలేదు. ఉండటల్లేదు. సరిగ్గా పదప్రయోగంచేసీ వ్యవహారికవైతే చాలా బాగుంటుంది. సరిగ్గా పదప్రయోగొవ్. ఉనటువంటి వ్యవహారిక భాషైతే చాలా బోగుంటందనే నా అభిప్రేయవ్. వ్యవహారిక భాష చాలా బోవుంటుంది. ఆ చిన్నప్పుడేదో ఓట్ రెండు డ్రామాల్లో ఏక్ చెశేవ్ స్కూల్లోని. కల్చరల్ ఏక్టివిటీస్లో వున్నదల్లా యేంటంటే నేను వక్తుత్రొపు పోటీలూ గట్రా కొన్ని కట్టేవాణ్ణి స్కూల్లో ఉంటునవ్డు. తరవాత ఎస్సెస్కు అయెస్సె కాంప్టీషన్స్కి వాట్కీ యే వోట్ రెండు రాయడంగుడ జరిగింది. తరవాత ఒకట్ రెండిట్లో ప్రెయ్జుల్గుడా ఒచ్చేయ్ అనుకుంటూ న్నాగ్గేవ్కవ్. ముక్యేంగా బోంబే హుమెనిటేరిని వర్మ్మా ననూ చేసినటువంటి దాల్లో నాకూ వ్యస్టుపైజేదో ఇచ్చేర్ స్టేట్ మొత్తమ్మీద. చాలా గ్గేవ్కవ్. బోంబే హుమెని టేరియన్ లీగన్జెప్పి అప్పుడూ ఎస్సెకోంప్టీషన్స పెట్టేవారు. దాల్లో అనుకుంటాను నా గ్గేవ్కొవ్. ఇప్పటికి పదమూడు సవంత్సాలించ్ చేస్తునాను. పదమూడు సవంత్సాల్నుంచీ మార్కెట్ కమిటీలో చేస్తునాను. ఈ మార్కెట్ కమిటస్సలు ఎందుగూ ఏర్పాట్ చెసారంటే-దేశ్యవ్లో మార్కట్లిల్లైవూ, కావల్సినన్ని మార్కట్లేవూ, అందుకోసొవోని మార్కెట్లు అవసరవైన్ చోట కట్టాలీ అనే ఉద్దేశంతోటీన్ను ఉత్పత్తిదారుకి కొనుగోల్దారు చెలించినటువంటి అంటే వినియోగపదార్ చెలిచ్వంటి ఋపాయ్లో యెంత యెకువ్ భాగవ్ అవకాశవెయ్తే అంత యెక్కువ్ భాగవ్ ఉత్పత్తిదారికి అందజెయ్యాలనే ద్రుష్తోటీ-మార్కెట్టు కమిటీలు స్థాపిన్చేరు. .అంటే దీనర్ధవేవ్టంట మిడిల్ మన్ తాలూక్ ప్రోఫిట్ను తగ్గిన్చి ర్రయ్తుకే ఆప్రోఫిట్ని అందిచడవ్ అనే

ఉద్దేశ్యంతోటి మార్కెట్ కమ్టీన్ పుట్టేయ్. దానిక్కావల్సిన ఏర్పాట్లన్నీ ఏక్ట్లో చట్టంలోని రూల్స్‌లోనీ పొందు పర్చేరు. ఇదీ విషయవ్ఁ. డైయ్‌రెక్టుగా దీనె వ్ క్టేంటంటే వో ... ఒక మాఁర్ మార్కెట్లో ఉనటువంటి వ్యాపారోఁల్లో సరియైన ధరా వారికి రైతుకందజెయ్‌డవ్ఁ, అఁంద్ దాని క్యాఁంపిటీషన్ మీఁది కాంపిటొషన్ అవకాశవ్ఁవల్ల కాంపిటీషెన్ క్రియేట్ చేశి ఆ వారికందజెయ్‌డవ్ఁ. రెండోదేఁటంటె సరియైనటువంటి క్రొలతలు, తూనికలు-కొలతల్లేవనుకోండిపుడూ-థూనికల్లూల్లోని అతనికి అతన్ ... థా .... సరుకొక్క తూనికలు ఒచ్చేటట్టు చూడ్డవ్ఁ. అన్యాయఁంగాఁనూ అక్రమఁంగానూ మాఁర్కెట్ల్లో ఎవ్విదవఁయ్ నటువంటి అన్యాయేలూ జరకుండా తూకోఁల్లో గానివ్వండీ ధర్లో కానివ్వండీ ఎందులోకూ్కాడా అన్యాల్ జరక్కుండ చూడ్డవ్ఁ. ఉప్పుడూ శుగర్ కేన్ కంటే మాకు సమ్మందించినంత వర్కూ బెల్లవేఁ ముఖ్యవెయ్‌నటువంటి దనుకోండి. అంచేత బెల్లవ్ఁ ఉవ్‌డు ప్రెస్తువ్ఁ ఈ సీజన్లో సీజను. యేంటంటే ఒకోవేళ వర్తకులూ తగ్గించీ ధరకీ వాళు పడేస్కో వాళ్ళు వేసేస్కోఁకుండా ఉంచడోఁ క్రోస వేస్చె యాలంటే ఓ బహిరంగ వేలమ్ పెట్టి ఆ వేలంవ్ఁలో ఒచ్చినటువంటి ధర్ని రైయ్‌తుకి సక్రమంగా అందజేస్తునారో లేదో చూస్తూ ధర ఒచ్చేటట్టూ చూస్తూ మార్కెట్ కమిటీ చెయ్‌వల్సి ఉంటుందీ. తరవాతేంటంటే తూకాల్ సరిగ్గా చేస్తు నారా లేదా, యెక్కువ్‌గానే రైతు దగ్గిర్నించీ ఎక్కువ్ తూకొమ్ తీశేశ్‌కోన్ తక్కువ్ డబ్బిస్తునారా, చూడవల్సిన అవసరొవ్ఁ ఉంటుంది. తరవాత య్ ఇంకా ఏంటెంటె ఇదే కాకుండా మార్కెట్ కమ్‌టీ ముఖ్యోద్దేశాల్లో అవతల రైతుకీ అంటే ఉత్పత్తిదార్డ్‌కీ ఇవతల వర్తకుడ్‌కీ మర్యా ఉన్నటువంటి సుహ్రుద్ భావాని పెంపొందించవలసిందనేగానీ పూరు ... చెడగొట్టేయ్‌డవ్ఁకోసొవ్ఁ అన్ ప్రెయెత్నవ్ఁ చెయ్‌డమ్మాత్రమ్ మార్కెట్ కమ్‌టీ ఉద్దేశంకాదు. అంటే ప్లేస్ లెవిల్‌ని ఏవీఁ కంట్రోల్ చెయ్‌లేదు. అయ్‌తే యేఁవిటంటే ప్రెయ్‌సుని సరియైన ధరని వాతనికి అందేటట్టు సూడ్డమ్మాఁత్రవేఁ చేస్తుంద్ తప్పించీ ఇంత ధరకే అమ్మాఁలని గాని ఇంత ధరకి మేవ్ఁ కొంటావఁనికాని ఇంత ధరక్ కొనాఁలని కాని యేవీ లేదిందిలో. కాదు. అలా లెవిల్ చెయ్‌బడదు. లెవిల్ చెయ్‌వల్సిన అవసరంకూడా లేదు. ఎంచేతనంటె యీనాఁటి కునటువంటి పరిష్థితిలో ఆ సరుక్కి ఏంత ధరైతే అందవల్సునదో రైతుకి ఉత్పత్తిదాగుకి అంత ధరా అందేటట్టు చెయ్‌డవ్ఁ వరకే మార్కెట్ కమ్‌టీ తెలుగు బాద్యత. దాని క్కావల్సినటువంటివ్ ఏర్పాట్లూ. అయ్‌తే ఒకోవేళ రైతుకి ఇంకొక విషేషవ్ఁ

ఏంటంటే వొకవేళ రైతూ అతన్ తాలూకు సరుకు ఈవాళ ఆ తక్కువ్ ధరకి అమ్ముకోడంకి ఇష్టంలేకోపోతే దాచుకోడంకి కావల్సినటువంటివి ఏర్పాట్లూ మార్కెట్ కంటీస్ చెయ్‌వాల్సిన భాజ్యతకూడా ఉంది. అందువల్లఅదేకాకుండా ఇతరత్రా ఇతర మార్కెట్లో ఉనటువంటి భోగట్టాని ఎప్పటికప్పుడూ మార్కెట్ ...క... మార్కెట్లోని ఇవ్‌తల రైతులకవ నివండి అవతల వర్తకులకవనీండి తెలియ్‌జేస్తుండడవ్ఁవల్ల న్యూస్ ఏజెన్సీ వాలు తెలియ్‌జేస్తుండడవ్ వల మార్కెట్‌కమిటీకి ఆయివతల రైతుకీ తనకిష్టమైఁతే ఆవేళ అమ్ముతాడూ లేదా ఇంక మార్కెట్లో అవతల ఎక్కువ్ మార్కెట్లో ధరెక్కువ్‌గా ఉండేటట్టైతే అవ్వేళ్టికొదిలేస్తాడు. మర్నా డమ్ముకుంటాడు. మూడోనాడమ్‌కుంటాడు. పదిరోజుల్ లోపున అమ్ముకుంటాడు. ఇది మార్కెట్ కమిటీవారు ఆ అప్పుడూ దానిక్కావల్సినటువంటీ స్తలంగట్రా చూసి మార్కెటు దాచుకోడాంకి అవకాశంకూడా మార్కెట్ కమ్‌టీ కల్పించవలసిన బాధ్యతుంది. ఈ రకంగా అనేక వెనైట్‌వంటీ అవకాశాలూ ఉన్నఁయీ మార్కెట్ కమిటీ రూల్సులోనూఁ చట్టన్లో తయార్ జెసేవ్ఁ. అందులో కొత్తగా నూతనంగా ఓచట్టవోఁటొచ్చింది. ప్రైస్సుతవ్ఁ ఆ చట్టవ్ఁ అమల్లో పెడ్తునారు. ముఖ్యంగా అనకాపలి మార్కెట్లో ప్రెస్తావ్ఁ అమఁల్లో పెట్టాల్న అబిప్రాయంతోటున్నావ్ఁ. ఈ మార్కెట్ కమిటీసు ప్రతి తాలుకకీ ఇంతకు పూర్వోఁ జిల్లాకొకటుండేది కానిపుడూ కొత్తగా ఏమ్‌చెసేరంటే నూతనవైఁనటువంటి చట్టాన్ ననుసరించీ ఈ ఎగ్రికల్చరల్ అఁయ్ "ఆంధ్రప్రదేశ్ వ్యవసాయ వ్యవసాయోత్పత్తులూ మరియు పశుగణముల చట్టమ్" పందొమ్‌దొన్ద అరవయ్యారో...అఁమల్లో పెట్టేరు. దీనివల్లేవవ్ఁతుందంటే మనకీ ఆ ఒక్క రెండేసి మూడేసి తాలూకాలు కలిపి ఒకొ యూనిట్టుకింద చేసి ఒక మార్కెట్ కమిటీని ఆ నాలుగు తాలూకాల అభివృద్ధి కోసవఁనేను మార్కట్లు కట్టడంకోసవ్‌ని అందులో ఉనట్‌వంటి వ్యాపారాన్ని క్రమబద్ధన్చెయ్‌డవ్ కోసవఁనీ ఏర్పాట్ చేశేర్. ఇదీ దీఁల్లో ఉనటువంటి ముఖ్యమైనటువంటిది. ముఖ్యంగా ఆబ్‌జెక్టివ్సె ఏంటంటే ఈ మార్కెట్ల కట్టడవఁనేదీన్ని ధర జాగర్తగా సరిగ్గా ధరాయ్‌తేనేమ్ తూకముల్లోనైతేనేవిఁ ఈ వ్యాపారస్తులు అన్యాయన్చేశీ వాళకందకుండా చేకుండా ఉఁండడొవ్ఁకోసైవ్ఁనే చెయ్‌డవ్ఁ ముఖ్యవెఁయ్‌నటువంటిది. ఇప్పుడూ ఇంతవర్కూ చేశినంతవరకూ చాలావరకూ అనకాపల్లి మార్కట్‌కు సమ్మందించినంతొరకూ సాలావర్కూ చెయ్‌గల్గేవఁనే చప్పాలి. కానికముందూ ఇంతకంటే ఇంతకు ముందూ సట్టమ్‌కంటే ఇపుడున్న సట్టములో అనేకవకాశేలూ అనేకమార్గాలూ సరిగ్గా సూడ్డాన్‌కవ్‌కాశేలూ

ఏర్పోప్పైసై ఉన్నయ్. కొన్నెన్నధికారాలు ఎక్కువిచ్చేరు. అందువల్ల ఇంకా యెక్కువ ఉత్పత్తిదారుకి సహకరించడానికీ చేస్తూ ఉత్పత్తిదారుతోటి సాహకరిం డవేఁ కాకుండా మార్కెట్లల్లో ఏర్పాట్ చెశీ వారిక్కావల్సినటువంటి కేంటీన్లు వారిక్కావల్సిన విశ్రేంతి భవనాలు ఇంకోట్టి తరవాత వారిక్కావల్సినటువంటి అన్ని రకాలైనటువంటీ సదుపాయాల్ కుడా చెయ్డాన్కి మార్కె...ఇప్పుడవ కాశవేఁర్పడ్తుంది. ఇవతల రైతులకీ అవతల వర్తకులకీ కూడా అన్ని రకాలైఁట్ వంటి సదుపాయాలూ కాకుండా పై మార్కటుకు తాలూకు ధర్లు తెలీడవ్ఁ వల్ల రైతుల్ కేవో వర్తకులు రైతుల్ కెంతకుపయోగవోఁ అంతకంటే మూడిం తలు వర్తకులక్కుడా ఉపయోగవేఁ. ఆ పన్చేసేది మార్కట్ కమ్టీ చెయ్ డాన్కీ అవకాశవేర్పడ్డది. మాకూ అన్ని కమాఁడిటీలు మా యేక్ట్ కిందకీ ఇప్పుడు ప్రస్తుతవ్ఁ ఈ నూఁతన చట్టంల్లో అన్ని కమోడిటీలు అనగా సుమారు రెండు వందల కమోడిటీలు వర్కూ కుడా ఈ డిక్లేర్ చేశేరు గవర్మెంట్వారు. అంచేత అవన్నీ ఒస్తాయ్ మాఁ చట్టంక్రిందకి. అయ్తే ఒగొక్క మార్కెట్లోని వేరువేరు కమోడిటీలు డిక్లేర్ చేసోక్కని ఏయె మార్కెట్లోని యే వస్తువ్లు ఏదినుసులు తాలూకు వ్యాపారాన్ని క్రమబద్ధన్చెయాలన్ నిన్ నిర్ణయించు కోవల్సింది మార్కెట్ కమ్టీవార్కి ఒదిల్లీశ్శేరు. ఇదీ పరిస్తితి. అంచేత ఇపుడూ ప్రెస్తుతావ్ఁ ఈ అనకాపల్లిగ్ సంబంతించినంతె వర్కూ ఇప్పుడూ ఈ రూల్సూ బయ్లాస్ ఫ్రేమ్చేడవ్ఁ మొదలైనట్వంట్ చేస్తున్నావ్ఁ. బెల్లంధర్ తక్వువ్గా ఉన్నప్పుడే ఎక్కువ్ డిమేండ్ ఉంటుంది కాబట్టి ఎక్కువ్ ధర్ రాడాన్ కవకాశ వుంటుంది. ఇగ డిమేండ్ ఏండ్ సప్లై పొమ్ంననుసరించి కదా.ధర్లుంటుంది. అంచేత డిమేండూ ఎక్కువుండీ సప్లై తక్కువ్గా ఉండేటప్పైతే ఎక్కువ్ ధరొస్తుంది. ఆఁ ఒ సప్లై ఎక్కువ్గా ఉన్నప్పుడు డిమేండ్ తక్కువ్గా ఉన్నప్పైతె తక్వువ్ ధరొస్తుంది. అది మామూలు.

## వ్యవహారఖండికలోని వ్యాకరణాంశాలు

*ధ్వని విభాగం :*

మూర్ధన్యోచ్చారణనీ, మహాప్రాణత్వాన్నీ బాగా ప్రతిబింబించే ఈ వ్యవహారఖండిక ఒక ఉద్యోగితో జరిపిన సంభాషణ. ఒత్తులులేనివాట్లో 'బాషా యుక్తంగా', 'నా అబిప్రేయవ్ఁ', 'ముక్యెంగా', 'స్తాపిన్చేరు', 'బాద్యత', 'స్తలంగట్రా', కొన్ని పదాదిన కానీ పదమధ్యన కానీ 'థ' కారోచ్చారణ నిలవదు. మహాప్రాణతోచ్చారణ శిష్టవ్యవహారమని పరిగణిస్తున్నారని సూచించడానికి

'అతిశోధిత' రూపాలు నిదర్శనం. అంటే, ఒత్తులు లేని చోట్ల ప్రవేశపెట్టడం 'ఘూనికల్లోని', 'ఇప్పుడు', 'భాజ్యత' వంటి పదాల్లో చూస్తాం.

*వర్ణసమీకరణం :* ఉదా. 'ప్రెస్సుతవాఁ' ... (ప్రస్తుతం), 'దాల్లో (దానిలో)', 'దీఁల్లో' (దీనిలో), 'ద' కారానికి 'య' కారం పరంగాఉన్నప్పుడు 'ద' 'జ' గా గానీ 'ఝ' గా గానీ కింది పదాల్లో మార్తుంది - 'భాజ్యత', 'మఝ్యు'.

పదమధ్యన 'క' కార 'ఖ' కారాలు లోపిస్తాయి - 'పత్రిల్', 'విశేపట్నం', 'లేపోతే', 'ఒటి రెండు'.

క్రియారూపాల్లో 'స' కారం 'శ' కారం కావడం రూపాల్లో విదితం - లేశేశ్ కోన్, చేశేర్, చేశేరు, అన్యాయన్చేశీ, చేసినంతవరకూ, ఒదిలీశ్ శేరు. అక్కడక్కడా 'చ' కారం 'స' కారంగా కనపడుతుంది. కానీ ఇది వ్యవహర్త భాషా లక్షణంగా చెప్పలేం. పదమధ్యన 'య' కారం లోపిస్తుంటుంది - 'పర్ చే సుల్ తోటి' (పరిచయస్తులతోటి), 'అన్యాల్', 'చేకుఁటూ', 'చేడవ్ఁ', 'తెలీడవ్ఁ వల్ల'. అట్లాగే పదమధ్య 'వ' కారలోపం: 'అమ్ముకోడాంకి, దాచుకోడంకి, దాచుకోడాంకి, రాడాన్ కవకాశవుంటుంది'. పదమధ్య 'హ' కారం 'య' కారంగా మారుతుంది - 'స్నేయితుల్'.

భూతకాలంలో 'స్థాపిన్చేరు, ఫుట్టేయ్, అఁమల్లో పెట్టేరు, ఎక్కువిచ్చేరు, పర్చేరు' వంటి పదాలు కనిపిస్తాయి.

*పర్యాయ రూపాలు :* చివికి ~ చెవుకీ.

ఈ వ్యవహార ఖండికను మాడుగుల ఉద్యోగి వ్యవహారఖండికతో పోల్చి చూస్తే వీరిద్దరిమధ్యా భాషాభేదాలు పుష్కలంగా కనిపిస్తాయి. ఒకేవిద్యాస్థాయీ, ఒకేవయః పరిమితిలో ఉంటూ ఇంతటి భాషా భేదాన్ని చూపించడం ముఖ్యంగా గమనించదగింది.

వ్ఁనెదూ. యెలచ్చన్ గాన్ పెట్నట్లైతె యల్ట్రీగిల్ జేత్తరు. యల్ట్రీగిల్ గానైతె శీటుమీట్లు కడుగ్తరు. యవ్వళు చేశిన్ డిగ్నెస్ ఆళ్కేగనైతె పర్వాలేదండి. అనడిగితే అపుడేవఁతారు? "అలాగే, సరే, శూద్దావుఁ". మివేఁ శదువ్కోనన్ శదవ్ఁలేదుగనండి. నిజ్ డే మూణ్ణేరూ అలాగ పిలిశేరండి. మేనేజర్ ఉన్నారండి. "యేవ్ఁ శదువుకున్నవాంజు." శదువులేదండి. మాయమ్మకి శదువులేదు. మబోవ్కి శదువులేదు. మన్నాకెలగండి శదువొత్తది? ... ఏటీ మిన్నాకూ శదువుమర్ కమ్టీ నంబఱ నిలబడ్డవ్." కమ్టీ నంబఱ నిలబడ్వంతె నలుగుఱూ ఆమోదించి నలుగుఱూ ఉకో యాబయ్ మందున్నారు. యాబయ్ మందే. అవ్కోశొమ్మీద నిల్బెట్టేరు. మీనాటి పెద్దవోల్తోనూ కలిశీ మానాతోళ్వఁ కన్ దర్జాగా మాట్లాడి శుబ్బర్గావుఁ మీ వాళ్ళేతన్ పొర్వాటునా మావోళ్వాళ పొర్వాటుణె మీకి షెప్పనాన్కి ఆలకి శెప్పనాన్కి ఓ పెతినిదిగా మీకి డిపార్మెంట్లు పోరుమాన్లు మేనేజర్లెలల్గో మీ కమ్టీ నంబర్లోవ్ఁ గూడ అలగే ఉంతమని నన్ను పెట్టేరండి అని. మరి తమ్మారువ్ పెట్తవే అన్నడు. మర్ తమ్మారువ్ పెట్టకోప్తె ఎలగొత్తయండి? డొబ్బులెలగొత్తయ్? అప్డూ బీదస్తులుఁ అలాగా ఉన్నావుఁ. వుడ్ కంపినీలో పనొచ్చిందనెక్కడ చదువుకోల. నీ శదువు కోవల పని కోవలని అపుడా హడగ లేదు. పన్చెయ్డ్వేఁ కావాలా అని అపాయ్మెంట్ జేశెరు. ఉపుడ్ మీరేదన పంజేత్తనవ్. కష్టేవుఁందొకనా డబులివ్వండంటె మీకు శదువ్లు గావాలా మరి అలా గంతె మరవ్డు కంపెని ఆపాయ్మెఁంట్ చెయ్యికోప్తె బోగుండు పోనండి. ఏటీ అనంతె – "అలాగ నువ్ మాటళ్ నేర్కైకునవూ. నువెకడ పేటేల్ పంజే శెవ?" నేనేక్డ చెయ్లేదండి. నిల్లిమర్ల పేటేర్ గుడ మావూర్ దిగ్గ్రేగాని అక్కడ పంచెయ్లేదు. ఇకడా సింహ్యాలో పనొవ్తంది. బాగా వుంతది. బాగా బోగు పడ్డవూఁ. కూటికీ గుడ్డకీ నోటిక్ పత్తిగా వున్నవుఁ. అ పలెటూలంట ఎదో కంపినీ బుట్టింది. బోగుంతదిరా అనుకోని మీఁవొచోవ్ఁ. మమ్మల్ని పీడించడానికి మీరో చేర్ అండి. మోకిచిందే కొఁంత ఇజ్జెశిందే కంట్రాటోళు. మీరూ శెక్లా కంట్రా చొకళ్ళు ఇశ్ కంట్రాచొకళ్ళు రాంగుబుడ్లు కంట్రాచొకళ్ళు చిమ్మింట్ కంట్రాచొకళ్శిలా తీశ్కొని మీర్ మిల్లు మీరే శేశోక్న్ ఉంతరు. మాకింకలాటి వొచ్చీదేవిఁ లేదూ. దాసిగి మీవేటి జేత్తవ్ఁ? మీదెయ. ఎన్నాళ్ పీడించిచ్ తింతంరో అన్నాళ్ తినండి. యేవ్ఁ శదువుల్ శాంద్రాంలేదు. మీ కిట్ట వైఁయ్తె మీ వేపన్లమీదంతానూ ఆ పొన్లె మీ శైలుగాని ఇచ్చినట్లైతే అజ్జెప్ప

తవూఁ. మీరే కట్టపడ్తానని మీ అనుగుర్తివుఁండి మాకొాక అనాడబ్బుల్ వాడెత్తె బాగా పొాన్లౌతయి. లేదెంచే నువ్ శూత్తనవ్. నేనూ షూతన్ను. నువ్ వతనవ్. నీనూ వత్తునానే కుర్రోర్శిళ్ కూడ ఒగటో రొాండో తరగాత్లనున్నయండి పాటవూఁ అద్గి అలాగే మేవును అర్యంగోరు మీరేవాఁ బయింపడవల్సి న్నేదండి అని శెప్పడంజరిగింది. "ఐతే మరీ మిలీ మీటర్లేవ్ఁ తెల్సునా" అన్నరు మేనేజరి. అప్పుడుండోడ్నేండి. ఐతె అంగులొావాఁకి రేపుశైలని ఇయాల్ చెప్పేరండి మపోర్మని. మపోర్మన్ గుడ యెవ్డూ గజంబద్దాట్టుకోని గాని ఒమూడు మట్టవ్ఁ ఒటొాక్కనిగాని తిరడవ్ఁలేదూ. ఒక దాారొవ్ఁ కట్టోరండి బొాంబయ్ పోర్మని. వడాం బరంగాదు త్తోడే లెయూచాయీా తోడు కట్టీశువ్. శుద్ద ముక్కిచ్చేదు. ఇది మూడంగులాలు. ఇది నాలుగ్గొాంగులాలు. అది అయ్ ఐదొాంగుల్లోలు. ఇది ముప్పావ్తి క్లనె అద్దారవ్ఁ అక నిల్చెట్టడవ్ఁ, ఆ శుద్దముక్కిలా రాశియ్డవ్ఁ, మోఁవఁదే నేర్స్కున్నంగాని మినీమీటర్లంతె మోకూ తెలీదండి. పోరుమాఁల్కి సార్జి మాఁల్కి శూపెర్రియ్రు రాసవ్డు కూలోడ్కిలాగొత్తదండి. అంచేతన్ రేపూ షైలనియాల్ చెప్పేర్ కాబట్టి అంగులువ్ఁకి ఇరవయ్యేదు మినీ మీటర్లు. నిన్న జెప్పారు; ఇయాల్ నేర్చినవ్ఁ. అడుకెన్నొాందలంతయో అయ్ రేపూగాని ఒక వారొాన్రోలుగాని షైల్‌గానిత్తె చెపితనండి. అంతే ఉపుడ్ సదువ్‌నవ? శేశినవా? నీకేమొచ్చురా? మినీ మీటర్లొచ్చునా? అన్ అడుగ్‌తాన్రగాని ఈ మినీ మీటల్గాని మీరడిగితే పని మా ... మిలీ మీటర్లేవ్ఁ తెల్స్నానైండిగేరు. అడిగితె నిన్న రేవ్ మీ శెయ్‌లాన్కి యాలా చెప్పార్కాబట్టి అంగుళువ్ఁకి ఇరవయైదు మిలీ మేటలు. అడుక్కి యెన్నొాందల మిల్లీ మీటల్లుంతయొ ఆదుప్పుడ్కి నేన్ శదువు కోలేదు. నీక్కొాక్కవలిచ్చె వోట్లూవ్ఁ రోజుల్లోను, షైమ్‌గానిచ్చినద్దైతే దాన్ని మీఁ శెప్పితావూఁ, ఏటీ? అనీ ఈన్చెప్పేన్. శెప్పింతఱ్వాత పోర్మనన్నడు, అది మేనే జరన్నడు "ఇన్ని పెద్ద కొాబుల్లాడ్తవ్. పెద్ద లీడ్ అవుగదా! ఆపాశ్లేరొాచ్చ్కలెదా;" యెలా నేర్చ్కుంతవఁండి? మరి మీరొాత్తరు; అల్ల వోడా ఆ డోగంట ఈ డోగు లెల్లీ ఇలా చూశిశ్ ఎలొాప్తెతర్గని వోడ కింద పంపన్లౌవుతన్నయొ యేజ్జోవుఁ లెక్కడున్నయొ కల్లెక్‌డున్నయొ శైడింగ్ ఈచీ లెక్‌డున్నయొ శేండింగ్ ఈచీ లెక్డున్నయొ డ్‌టిబ్బఁల్లెక్డున్నయో యేంగ్లలెక్డున్నయొ ఇల్లాంచింగ్ తాాలూక్ మోపు ఈ గొాలిజెవ్ఁ యెక్కడ తగిలించాల? ఇమ్మూాడొాంగ్లోలు

ముక్కల్లూ రిబ్బన్లయ్ ఎక్కడ పెట్టాల? ఇలాటివేవీఁ తెలీదు. ఇపైపెనుంతరు. పైనుండె అది ఐపోయిందానడుగుతారు. ఐపోయిందంతె అన్నొపుని వొజ్‌కట్యీ లేబుఖుబ్ గదా హాక్క శెక్కీఁలాగ దుకాణ మోప్పన్న ఓపినంత అన్నోపులు మీవుఁంతానగాని వేశ్నెవ్ లేప్తారు. శైరోప్పయిందే వాడొంబ్రోవ్ఁ అని అంతారు పీశ్నెవ్‌లేదు. శూత్తాన్నఖు. మీవ్ఁ గాదూ దెబ్బత్తినే శీవిఁట్లూనూ నైటీగీ శ్లైక్కంట ఇలాగుంతాను మీర్శైశెది మావూఁ, అనుబ్‌గించేది మీరు. అఁల్లాఁట వ్‌డు ఇమీశెల్ల చెబితే నాబ్‌వేఁవుందంటె మీశెల్లే మీర్చెప్పావాళ్ళో లేదండి. మా మట్టుగి మీఁ ఎల్లిపోతవుఁ. ఇగో ముప్పైయ్ మందిని రామన్నార్. మందో చ్చావ్ఁ. నన్నె ననే ముందు పిల్శేవ్ కాబట్టి శెలుగా నైనడ్గైతె ఇంకడ శదువ్ కునొ్నడెవుడ్ లేడూ. అంచేతని నువ్వా అట్శెంటు పదొ్వళ్లయ్ ఇవొ్వద్దు. అశెలూ మాకివొ్వద్దు. అంద్రవ్ఁ ఎల్లిపోతావఁనీ ముప్పైయ్ మందివిఁ ఎల్పొ్వనొ్వవ్ఁ. ఎల్లి పోణ్ నేబ్రాపి ఉన్నారు. యెవల్కెజ్జైత్తంగని ఇతనికి శెప్పనివాన్క రొండు గోగులొట్కుండోడు. అతన్ బుఖతనే పొట్కుండోడు. "నబుర్ర పోడయ్ పెయ్..." ఎందుకు పోడై పోతుందండి? మాపని మేఁ చేశొ్కని కట్టపడుకోని చింతూన్నవ్ఁ. మా కట్టవ్ఁ శాల్దు; ఒకనా డొబ్బులియ్యఁడని మిమ్మల్నడూ చుంచె నివ్వింతెలీడ్ ఖవని అడుగుతాన్నవు, శెల్ అడుగుతుంతాన్నవు, ఈ శెల్లో శెక్కిన్ పనేవ్? నువ్ ఇస్తానవాంచెపగానె అయ్యూపునిమరిహానా పనేవ్ఁ చేశేరు? యేఁవ్ జేత్తరన్ను. యేవిఁజేత్తరు? మాకాశెల్ అక్కర్లేదండి. అట్శెంట్ పదఁవి నక్కర్లేదు. నైబరుపనే కర్లొంటోడంతె ఓటుకొత్తవ్ఁ. పరియంద్రంటె పడేత్తవుఁ. ఏటీ? శెలు మాకొష్కురివ్ఁ లేదండి అనీ ఒగ రొణ్ణెల్లు మన్నైబజ్ పనే జేశావ్ఁ. ఈ పొన్లు మనక్కర్నెదు. వొల్కొ్కడ్ తాలూక్ పనే అంస్కిళ్ల పనే జేత్తవఁని నైబర్ పంజేశేవ్ఁ. శెయ్‌పోతే యెక్కడ్వనక్‌డె పొడుకొందీ, మందస్వైఁ పైయ్. మందస్వఁవ్‌గాన అవ్‌డేవిఁ జేశేరు? అవ్‌డే వూన్యనుండేది... గోరుండోరు. సైయ్ కుడు. ఉన్నతరావ్‌త యేవింఁడీ!... గోరు! ఇలాగంతాన్ ఖు. ఏశైంది? సవ్వాశా రవ్ఁ మా శదువుల్ శావుఁల్లైవూ. శెలిగి రమ్మన్నరు. టయిలోన్ పిలిస్తే ఇలా మిలీమీటల్లడుగ్‌తారు. ఇంక నిన జెప్పేర్. ఇయాలిలగంతన్నరు. లేఁదంతె... గోరు ఎలిపొమ్మంతారంతె. శెమరి నీనేవ్ఁ జేత్తన్? మీర్ పన్ నేర్శ్కొయ్‌ల అన్నర్ ... పన్నేర్శ్కునవఁండి. శదువుగా మాత్రవ్ఁ లేదుగని ఊాతపోతక్ మెఁ ఆపిస్లో వున్నశైతె ఇ ఆపిసు లెక్కడుండండీలు వొడకిందుంతారు. టీల్

పెళ్లైయ్‌డాన్కి భేకులిరగొట్టొన్నావ్ఁ. మీఁవాపిసుల్లొ వుఁందువండి. అపుడు మా తలీదాండికి అవ్‌క్కోశావ్ఁ నైక మమ్మలి సదివించక మోకువ్‌డీ పోట్లండి, అనీ తర్వాత ఇక్డ మోఁవీఁ పొన్లు మీవ్ఁ చియ్‌వండి, మ నైబజ్‌పనే చేశ్కుంతవఁని ఈ ముప్పైయ్‌మందిని ఓపు జేశవ్ఁ. మళ్లేస్ట్రైక్ సమందించిన పైనేగాని వర్క తాలూకు పని మనొవ్ చెయొద్దని అనగానె అప్పుడొక రోణ్ణెల్లలా బాదలపడ్తె ఇజిగో రెండోనెల మూడోనెలా నాల్గోనెల ఉపుడ్ మన్ ... గోరు యెలాగైతె మనకి యేజిబోడ్ ఇదిగో అదిగో అదిగో అనే ఉట్టా పట్టా గంట్లోడెల్లా జెప్తన్ అలా జెప్తన్నె అదిగి అల్లాగే పొడిగించ్కొచ్చె. పొడు గోయించ్కొచిన్ తర్వాత అలాగ నాలుగునెల్లూ ఐదునెల్లూ గుడ ఆలకించైన్. ఆల్కించిన్ తర్వాతయ యేశిన్‌ఛేజీలల్ల కాల్లింటి పొగజూశీవాడొవుడూ లెదూ బొగ్గు జూశివోడే గనీ అనే టోపు జెయంద్రనె టోపు జేస్‌శవ్ఁ. టోపు జియ్‌గనె యైక్కడ పనక్కడ పడుకొంది. అపుడెల్లయ్ రావలల్లాగ యిలాగని మేనేజర్ గోరూ పోర్మాన్ల్ గోరూ ఆందరు పిలిశీ యిల శెప్పారు. శెప్పింతర్వాత యేవఁంత యెవఁంత యెల్ల య్యాంతె యేవఁంతరండీ? మ కొడుపునిండ అన్నవుఁంతె గద, గట్టిగ మీఁవ్ పన్చియ్‌డాఁన్కి? మైం కొడుపులో అన్నవుఁ లేది మాకొక్క్రాంది నువ్ పనెలా జేయింతవు? నివొ్వగ నాలుగొంద లైదొందలు ఒట్టూపోతాన్రు. పోర్మనై దఁయ్‌వాగ యే యింగిలీశనె నికొవ్‌రోదు; హిందీనొత్తది; పోర్మన్ సంత్కమ్ పెడ్తాడు. ఇంగిలీశ్ గనొచ్చె గుమస్తచేత సదివించ్‌తడు. అలా టోడు ఆఁ యినిమిదొందలరవై రూపాలవ్‌డు యెనిమిదొందలరవయ్ రూపాయ్లు తీస్కుంటాండు కదా! మరి మాకెంతుండాలండి? వొకనా డబులిబ్ ... యెవులైతె కోడి పిల్లితడొ ఓళ్ళకే పొయేశన్లివ్‌డవుఁ. యవుళ్కయ్ కైమా మాఁవ్‌సవ్ఁ గొటిచ్ తెత్తడొ ఆళకి పొయేశన్లివ్‌డవుఁ. ఇజో జాయింటైయ్ పోయింది. మరి చేసింది కూలిబతుకు. మీఁవెక్క డబ్బుల్ తేవాల? ఇయ్యేదంగా చేత్తాన్రండి అనోపుజెయ్‌గన అపురో రోణ్ణెల్లొ మూణ్ణెల్లొ వ్యాన్యన్ చెప్పైన కడ్న్ఁ యిన్నేఁదు. యినకలగ ఇజెయ్‌డం తొటీ అప్పుడు ఓ పదిమందికి సైల్లే కంట కార్పెంట్రుగా ఇచ్చేరు. ఓ పదిమందికి కలాసుగ ఇచ్చేరు. ఓ పదిమందికి శింగల్‌గా ఇచ్చెరు. ఈ కలాస్కి రొణ్ రూపైలె అశింగ్రీ రొణ్ రూపలె. అప్పుడు నువ్ మేనేజారివ్ కాబట్టి యిలగ లిడ్‌ఉ కాబట్టి అంచేతని నికొడుకి నేస్కా ని

ఉల్లుళ్ నేర్స్నకో ఈ వైజల్ గురించి నువ్ బాదపడొద్దు. నువ్ తాన్నవ్ జేశీ నువొచ్చీ అన్నవ్ తిని పొడుకో. బాగ ఓలోచించు అనడిగేర్. ఆతన్గుడా తెలు గొచ్చును. అతనుగ్గూడా నలభయ్యా ఐదులో యెప్పుడో వొచ్చేర్, జలవోశా వున్నవ్డు. మార్కెడ్‌గా వొచ్చేరతను. ఉపుడు మేనేజర. యేవెఁండీ … గోరూ మీరిలా జెప్తంరు. మీరపుడు యేయిదవ్ఁగొచ్చేరు? మార్కిడ్గ వచ్చేరు. మిఁ నైబగ్గొచ్చేవుఁ. అపుడు నువ్‌గూడెడిగేవ్ నిప్వేపార్టైననోరు. మావూళ్ళుంతె రోజుగోరం పార్టండి ఎడ్గెవ్ండి. మావూళ్గని కెల్లగానుంతె … గోర్ పార్టండి.… గోర్ లేపోతే.. పార్టండి. యిలగెల్తుండోల్వండి. అపుడు గురాఁ యేదో యిదైతె ఆఁ … గోర్ పార్టే ల్లేఁదండీ. మోకేవిఁ తెలీదండి. పాటీల్‌గిటీల్ మోకేఁవ్ తెలీదండి. పన్చేయ్‌నాన్కొచ్చేవఁండి, అలాట్ పఁన్చేయ్‌కండన. "అద్సరే ఈ లం దర్కి నువ్ లీద్రగుండొద్దు". నీకు ముఁాందావ్ఁ కావాల? హోర్పెంట్రు కావాల? నీయల్లుణ్ణేస్కో. నీ కొడుకుని అపాయ్‌మెఁణ్ జేశ్కో. ఈళందర్కి నువ్వెందుకు లీద్రపని చెయ్యాల? ఈలందర్నిక్ పెడ్తేత్తరేటి?". ఇటివోట్లో నన్చాల్ దిదీ తినోర్ది శాలా మాట్లు మానోట్ తొఁశే ఆల్కించావండి. నిధానవన్నెది మా పెదాన వఁండీ. ఆ నిదానవ్ఁ గనువఁ యెత్తే నలుఁర్కాడ గౌర్నంతదండీ. అన్నిదానఁ యెవ్‌డేత్ తప్పినవొఁయ్ దొంగోడు అలాగా ఇలాగా నోట్‌కొచ్చిన్ కూతల్ కూత్తరండి. ఏటీ, అందుగురించి ఆ బాదలేన్బరించనేనండి. యే ముప్పయ్ మందికి ముప్పయ్ అనాలివ్వండి. నాకొకనా ఇయ ణీ దయుంటె. నాకొడుకున్ గురించి సయల్లుణి గురించి రాలేదూ అనీ అనగనే అప్పుడు అండు "ఎళ్పొ ఎళ్పొ"అనడు. యెలిపోతన్. నువ్ రమ్మనవ్‌నొచ్చెనండి. యెళ్పొకికడుండి పోత నేటండి అంచెప్పేను. శెప్పింతర్వాత అదినీ కొటాంబవ్ చూశ్కో. నా కొటాం బాన్ గురించి గోద్దొండి అని ఆయూప్నినాగ యెల్పొమన్నర్. యెలిపొచేను. యెలిపోచిన్ తఋ్వాత ఈ ముప్పెయ్‌మంది ఇలాట్ సింగర్సు, పది మంది కళా సులు, పదిమంది క్లోరుపెంట్‌లు పదిమందానరు. అయింతర్వాత అప్పుడుమల్ల అరవైయ్ రొండ్లో మూళ్ళో సైకు జేశెవ్ఁ. అంతే అన్ని డిపార్ట్‌మెంట్లు కూడా మార్చేర్. ఇక్కడ్ శింగర్ లేరణ్. ఆఁ యికడెవ్‌డూ లేర్గద? నేౘ్రంతె అన్ని పొన్లూ చెయ్యాల. నేౘ్రంతి అన్నిపొన్లు చెయ్యాల అని డిపార్ట్‌మెంట్లెలాగిత్తాన్రు.

పొయేనోల్లుం సావత్రాన్నికి ఇద్దెర్కి ముగ్గుర్కి - అందర్కి వొద్దు - ఇద్దెర్కో ముగ్గుర్కో మీరు బోదపణ్ణోల్ కివ్వాండి. ఇయాల్లిద్దర్ కిత్తె మల్లి సయ్‌చర్లావ్ం ఇద్దర కొత్తదని ఆశ మీద పంజేత్తరు. నేతే పొడొచున పోదు జేశొళ్ మీరేనండి. దీనిక్కోర్కరుకుల్ మీరె. పోర్మాని మేనేజరి. యేటీ మాంవు కాదు. ఇయ్యాల మీ ఇంటీ శూడండి. పోర్మాన్నయున్నార్ మీరు. మీయింటికి కట్టొట్టుకొచ్చిన వంతె ఒకణా డొబ్లిస్తె అయనా డొబ్లు టీతాయ్‌నోరె పోర్మాన్నోరు అనా ఇది సారనోక్కండి. సర్దాగెత్తవుం. అయనా గానియ్యకపొ యకడ పడేయండి. యెల్లంద్రా సన్నగ్గైతె అల్లకడ్కెల్పోయ్ యేమంతవోం మీకే తెల్చును. మీకే తెల్చునండి, అదిగలాగె. రేబ్రొప్రేపేదో చెప్తైర్ గద. అడగంద్రని ఒకనా డొబ్లొగ్గేని సర్దాపారొవ్‌తవ్ం. నేపొతె నకొంట్లొ బోపులేదండి. మయాండొలెదో పొనుంది, రమ్మండని బొంకేత్తవండి. అపుడు మీరేంవ్ జేత్తరు? ఒకనా డొబులివ్‌ణవ్ రాసైవ్డు ముప్పావ్‌ల ఇచ్చిన మో మొయించొక్కర్టిట్టావొడైతె మెడ్లిరగొశేస్తడండీ. మీ సొంతపనోన్ని గాబట్టి మీకెలాగంతలా జేజీపోతున్నావండి.అద్కన్ జైగర్తగాలోచించొక్కన్ పంజేయ్‌లండి. మనవి చెప్పేవ్ం. శెప్పింతర్వాత అలాగే యిలాగా అననోక్కనొచ్చప్పుడేమిం జేశేరు? మునయ్ మందికి ఇచ్చీశేరన్‌మాట. ఇచ్చింతర్వాత యిలగె శుబ్రింగె అందర్నోక్ ఐక్యెత. చిప్పిరార్దు బర్తంత గుండుళ్ళున్నర్. గుండుకేయ్ యెలాడ్డొ శివ్‌రెడ్‌బర్త వొల్క అలాడ్డి. అయ్‌తె అపుడు దాన్నేంవి జేశేరు? ఈ ఓరంగుళాలు తొమ్ముద్దొంగుళాలు మూడంగుళాలు పదెంగుళోలు యిలాగ యెత్తి ముక్క లెసోళు. యేస్తె దీని కేంవ్ జేశేదువ్‌డ ఫోర్మన్‌గ వొచ్చేర్. యేవ్ం తెలీదు. అప్రంటిస్గొచ్చెరు. ఒచ్చింతర్వాత ఇయేమ్ డోకులెనోరు యెడప్పెడ్ డోకులంటె మూతిలు ఇటోఅటుంటయ్. సాదా డోక్లన్ని వేరే; యిలాట పొన్లు యిలచేత్తుంటె యేవిండి మిరెవ్ం శదువుకున్నరంటె శదువుకున్నన్, యెక్కనుంచొచ్చినవంచె మ నాన్న ... అల్దగ్గిరీ పీనిగా వుండోడు. మా వూంవ్ గుడ యల్లెయ్. మీనాటి వేదవోల్వొం ఉండూల్విం. మాయక్కజెలెలు మమంల్ని సైదివించి పెద్దోణి చేసింది. అన... సరే ఇలాగాని ఈ పని ఆపని టిబ్బను గిబ్బనని పేర్లుపెట్టి అన్నీ చేసేవ్ం. శేత్తేకిత్తను పోర్మన్ ఐపోండు. పోర్మన్ ఐపాయింతర్లోవ్ తేవండి...గోరూ యేదో కొంతే దైచేశి మీరేనా ముళ్లోడూ కొల్లూ పొల్లవుపడవు అలాంగ కల్లు పొల్లవుపాడ్లొ క్పొయ్‌న వోణ్ణు గుద్దుకోని ఎల్పేంనే. అడబ్బుల్ దొరుతన్నెయ్. యిక్కడేవ

షైనంబోతె యేవ్ఁ డొబ్ మన్కాన్ దొరూతదనే ఆశపెడుంతార్. మీరేనాకు
ఝ్జోళ్ ఐపొన్నరు. కొంత సదువుకొన్నరూ. మీరేనా కంత. మమల్ని ముందుక్
తెచ్చీ ఇజ్జేత్తె బోగుంతరనంతె ఇముజిలోడు ఇలాందర్గుడా కొంచేఁ జెపోడు.
‘‘అర్ తక్కవోడు కాదు. శానాఁ గెట్టి బుఱ్ఱ. ఆ బుఱ్ఱని నొక్కితేగాని నాబవ్ఁ
నేదని". అపుడీలందరు ఏయ్‌క్యైతాయి శాలా మాట్లాడేశి ఇజ్జేశ్నాడ్ గాబట్టి
ఇలాటోడ్ గేన ఇకడున్నగ్గెయ్‌తె లాంచిగ్ గట్రా ఐనవ్‌డు ఓపు జేత్తడు. అంచే
నిలాటోని జైన్రలికి కొట్టిత్‌చె బోగుంతది అని ఆవూన్యోని ఈలాంఁద్రు మొత్తమ్
పడీ ‘‘యెవోఁయ్? నువూయేరే డిపార్నెంటు మారిపోలా" అన... యేవండి?
యేరే డిపార్మెంటు మాలిపోలేట్నాక్ పన్చేతగాదా? నేన్ పనోణ్ కాదా? ఏటి మీ
వుద్దేశవ్? ‘‘ఆఁ లేద్లే. ఇకడున్నానిక్కల్లేదు. నువు పెదపెద్దోల్మీద తిరబయ్... యెలో
పెదపెద్దోలైన్ తిరబడ్తవ్ఁ’’. పంచేతేనెయ్‌నోడిక్క ఒకనా డబ్బులు కట్టబడి
జెయ్‌నోడిక్క ఇవ్వకాంటున్నరు. గుడ్ మోణింగ్. శైరంతె అలా ‘‘తిరిగిరారా
పరవాలేదు’’ యిల్శైతే పంజేయింతననే అల్లకీ ఇలాడి ఫోన్లు జేత్తరండీ? మాఁవు
యదట చూచ్చుండగ అలాడి పజ్జెయ్‌నోడు మాషైనవ్ఁ వొర్వోదు కదా అలాట
పుడు మీరాలోచించకపొతెలాగుంతదని అన్నావఁని ఈట్లి మీద సుప్రవొయ్‌లు
యీ ఎరచ్చన్ డిపార్మెంట్లుండతను సాచ్చిగయ్ బలిపీ పలికి ఓల్సెట్టింగ్లో యెకడో
ఉన్నడు పోర్మని. అతనూగూడ ‘‘యేవిండోయ్ ఇలారండీ’’ అన్నడు. కాలీ
యెల్డిన్ డిపార్మెంటు కాలి ఈలందర్ దెగ్గిరి కొచ్చెరు. ‘‘ఐతే యల్లయ్ యిల
రావోయ్’’ అన్నరు. ‘‘యేమ్ బోబూ’’ అన్. ‘‘ఇయ్యేడ్ కమ్టీ నంబ
ర్గున్నవా? దిగిపోనవా?" అన్నర్. "దిగిపోనన్ బోబూ! మరొగళ్ని నిల్పెట్టెడు.’’
పోఁ దిగిపోనవ’’? ఆశ దిగిపొనన్ ఆలకెవ్వలకిశ్టవ్ఁ లేదని దించీశేరు. మర్రోళ్కి
నేనే ఇష్టంలేనోణ్ నేనె. నువ్‌దీపోతెలగ? ‘‘యేఁవండి! ఇబ్బరంగోరు! యిలా
రండి... సాహెబ్ తెల్సునా?’’ కాళన్నడు. ‘‘మాడిపార్మింశేనండి. అతన్ నలప
య్యేళ్ళొ అపేయ్‌మెంటు. అతనెత్త పెద్ద’’ లా ‘‘మా డిపామేఁణిచె చిప్రెడ్
బర్త్ కెల్లేడండీ అంజెప్పారు’’. ‘‘యెంషాదువుకున్నరెల్లయాఁన్’’... యేవిఁ
శదువులేదండి. పెద్ద ‘ల్లా’ అండీ అన్నరు. యవుశూ? రోవ్. ఏతే సీనేగాని
‘లా’ సదువుకున్నడ్లెయ్‌తే ఇయ్యేదవేశ్కాలు పదవులు నీన్చేయనండీ. ఎలి పోతే
రాష్టపతికో ముక్కమంత్రికో మా ... కాడికో యెలిపోదును. యిలగే చెప్పే
నండి. ఇయ్యోదవ్ పదవులెఁయ్ చెయ్‌నండి. సీనే యేమేఁన ల్లాగానుంతే మా...

కాడి కెలిపోదునండి. ఇయ్యాదౌపదవులు నె చెయ్‌నండీ...''ఖూడండోయ్ అమ్మో! అహాఁ'' అనవ్‌డు ర్రోవ్ చెప్పేరఁడి. శెప్పింతర్వాత ఈలంద్రూ ఖూడా ఐక్యేతాయి అపుడేవిఁ జెప్పేరు: ''యిలాటోడుంటే ఇక లాబవ్ఁ లేదండి. అంతలోఁకి ఒక లాంచిఁంగ్ కొచ్చెరు కొటాంబంతేస్కొని. అల్లాంచికేఁవి చేశేరు? లాంచింకో అప్పుడు కూడా కమ్‌టీ నెఁబరవ్ నేనే. ఉపుడు పష్షైన్మ్రదో పందొమ్మ్రిది శవఁ స్రాల్ బటి. ఐతపుడ్‌గుడా లాంచింగ్ మోపలా చేత్తుండగ ఇదిలా నడుస్తుంత అదలా ఒగ్గీశేరు. ఇకనీ ఇకణీ ఒచ్చింది. యేవఁండోయ్! ఇ కమ్‌టీ నెంబర్‌గుంతే వోడలాగండి ఇలాగండి పర్వాలేదండైన్ ఐతవ్‌డు ఈ లాంచింగ్ చేశింతర్వాతే వఁన్...గోరొచ్చేరు. అంతహ్ముందు వోడ దిగిపోనవ్‌డు మూడు గంట్లు ఓట్రేమి చోచ్చేరు. ఆ సవ్ఁసొవ్ఁలో కొటాంబందీస్కునొచ్చి వోడ దింజవ్ఁకొది కమ్‌డోర్ వుండోడు. మేనేజర. ఐతే అవ్‌డు లాంచింగ్ అవ్‌పోతే ఇకేవ్ఁ అవుతుంది. మూడు గంట్లు ఓట్రైమ్ ఎగ్గొట్నన్ జూశెడు. అందర్ పొగల్ దింస్తె అతనేశెవ్ద్ పొదుపొదులోపుడ్ దించొడు. కమ్‌డోర్ మేనేజరి. పొదుపొదు ల్డోప్పు తొమ్మ్రిది గఁంట్లకి ఆరున్నరకి దించోడు, వోట్రైవీఁ ఇయబడ్తదని. అఁ సరేనలా బాదలు పడ్డావ్ఁ. ఒకో వోడే వైఁంది? అత్తెల్లోగ్గల్ల ...... గోరొచినవ్‌డు తెల్లోరో మూడొక్క నాలొఁ యేడున్నఁర్కి దించేవ్ఁ. దింస్తె దానికేవైఁంది? మూడు గంట్లోట్రేయ్‌విఁ. వోట్రైఁవ్ఁ ఇయపోతె మెఁ దించవనీశెవ్ఁ. దించవనిఁయ్‌గొనూ అపుడ్ ... గోరే వున్నరు. అనీ యిలగ ఇయ్యీదవ్ఁగ వున్నవ్‌డు యేఁవ్ చేశే వుఁ? అంద్రూకుడొచ్చోర్...''మరి కొవ్వెయ్యాల. రిగ్గర్లి లాంచింగ్ ఇపొద్దీ ఇ కొవ్వెయించిశే అన్నడు. కొవియ్‌వంతవి మ మూడు గంట్లోర్ సైవిఁచ్చేస్తె కొవ్వపుడ్‌గాదు. ఐనా డబ్బాల్తో నొట్టుబొయ్ పశేత్తవుఁ. ఆ మూడు గంట్లో వట్రైమిచ్చియ్యండి. మెవ్ఁ కొడుపుకి బాద పడేది. మూడు గంట్ల ఓవర్‌శేవెఁ. మేవుఁ వందల్వేల్ అడగలేదండి. అనట్ చెపోవ్ఁ. శెపింతర్వాత అప్పుడేవిఁ జెప్పేరు? యెదో ఇంగ్లీశ్లొ మాట్లాడొక్క...మరి నాకు ఇంది ఇంగ్లీశ్ రాదులెండి. తెలుగుమాత్రవ్ఁ వొచ్చును. వొచ్చింతర్వాత యేవిఁ జెప్పెనూ? న చెప్పిం తర్వాత యేవన్నరు? లేదు. మీ ... ఉపుడే ఎల్లెరు. వత్తరు. సరె పొద్దుట్రొని య్యండి ... తెల్సెండి. దిన్ దుగాడ మోపూ లేబ్రార్తొటిపుడూ యింట్లో ఆడోశ్

ఉన్నారనుకోండి. యేదో నెక్డో వాద పడీ అప్లోడ్ కప్లోడు మనొల్డు కుంతె అయేది మీదొ త్తవుఁ నాడ్దానల్ టి పెట్టి కొశ్తేస్తవూఁ. నినె త్తిగొట్ట నిబుట్టగొట్టా నివ్ అప్పుళ్లెస్కానొచ్చి నను గొటిస్త్ నీనేవ్ శెయ్యాలంత? ఆ వూవ్నుండన కొండల్ చితగ్గొట్టేత్తవుఁ. అలాఁ లేడినాగుంతదండిదీ. లాంచింగ్ ఐతె ఇపుడేటి విదవ్ఁ? మా మూడు గంట్లు ఓట్రైమ్ ఇచ్చిచ్చానన్ నీన్ చెప్పొను. చెప్పింతర్వా తేమో ఆయాల ఇవ్వననీసేర్. ఇవ్వననిచ్తె యెగిల్మెంట్ ఆపీసర్లొచ్చేర్. అలా గుణ్ణియండి. అలాగుణ్ణి తరావ్తేవైఁంది? తొముద్ గఁంట్లకి యిలాగెని ఈ వున్యా బవ్నవ్ఁకాడా మీటింగ్ బెటొక్నవ్ మేవంద్రూను. యేవఁయా? నోవ్ కెలిపోతే త్లొప్పా? పైనుండిపొతే యెవీఁ మీ యుద్దెశాలూ అని అడిగినారు. లేదండి. ఆనాడు ... గోర్దున్నవ్డు... గోర్ ఒచ్చేరండి, ఒకొళ్న దించనాన్కి. మావ్ఁ అంద్రవ్ఁ పైనుండిపొతే ఎగిల్మెంట్ ఆపిసర్ల్ బటి ఈ యెర్గొళ్ కిటారా వాళ్ళను చిల్లాంద్రగట్టా బొజ్జాల్న బెటి మోశ్నేరండి. మోశీ ముక్క ముక్లు శెక శెక్కల్ దానిగి తెగ్గొడ్ పారెశేటి దోస్శెరు. శాలా కాడిక్ పీక్వొ ఇ నడుఁవ్ కడ్వొ దెబ తగిలింది. దాన్గెళ్ యాళ్డింగ్ దెచ్చి అదొప్ప దీర్కుకున్నరు. అదే మోకు శానిబూతిగ దించ్నోడె మోకు శూపించింది. అదికలాగె దీనికేవొఁ ఇద్తెతదేవొఁ దనిగి మీవూఁ శెప్లెవూఁ అనేస్ ఓపుజెశేవ్ఁ. ఓపు జేస్తర్కపుడే వైఁంది? అ త్తెల్లోటి ఇంద్గని యెగ్రిమెంట్ ఆపిశర్లు మూడున్నర నాలుగంట్లకి ఎగిర్మెంట్ ఆపీశర్లొచ్చియ్శెయ్డు. పేఁంట్లిప్పిశేరు. మరి బుషొక్డ్ల్ తీశ్నేరు. దాయిర్లొటున్నారు, లాంచింగ్ మోపి. పైనుండి పోతరనొక్ద్రని ఇకడడీనాడ్. పైనుంద్ర? నోపికెల్ద్ర? ఒవ్డగ్లె దెబ్బ తిన్నవండి. పైనుండాలి. నోవ్ కెళ్ళొ తవ్ఁ యెవళ్ళ పనిమీద అళ్ళుంతవుఁ. యలాటోడ్ ఒస్తడ్ చూద్దఁవన్న. యవళ్కి ఆ ఇడియా దాలేదు. శివలింజ్లిర్ పంపిఁచ్చేన్ నాతొట్ అతన్నాను. ఈలె ద్రుంచి ఇకడ మోర్పొర్గుఁని. అతనన్నడు నోవ్ కెళ్ళొతే బొగుంతదండి. పైనుంతె మనవేఁవ్ చెయ్నేవండి. అత వొండెశి వొడ్డించేశీ ఆడోళ్ కొట్ స్త వొయ్యా? ఆళూ వొడ్డించొక్న్ తింతర్ మగోడు నేప్తె. నేప్తె ఇదీగెలగ వొండీ శిన్ వొడ్డించొక్ తినొచ్చు, నేప పొనాడు సొడ్డించుక్ తినుతాది, కోపవ్ఁ పుటు కొడు మంద్తె నేశొ త్తది, నాగు రెండు మెటీ దిడ్డవాలేహ తినికెన్ అన్ అడుగు తది. అలాపైర్యా వుందఁన్ పోవ్ కెల్లిపొతే మంచిదని జెప్పావ్ఁ. అనగనే ఐతె అలాగే ఎళిపొండనీ ఎలిపోనవ్ఁ. ఎలిపోయ్ యవ్వడు టియ్యా టిఫ్ఫీఁ తినొద్దు.

పన్నెండ్ గఁట్లదాక ఉనండి. వాంటి గంట మాత్ర విలిత్తడు. ఒంటిగంట మాత్ర పిల్చింతర్వాత టియ్యా టీఫ్నూ రమ్మంతరూ. యేఁవఁండీ! మమూడు గంట్లో టైమ్ ఇవ్వలేదు గాబట్టి టియ్యా టిఫిన్ గుడా మేవ్ చినవూఁ. మావాక్కో శిప్పని మావోక్కా బౌసెచ్చు మీద మేవుఁ దించ్ కోచ్ తవఁంగానె అట్టియ్యా టిప్నూ మ క్కొవ్ శొవ్ఁ లేదనీశేవ్ఁ. తింద్రాంతె తిన్రట! మావుఁ తినవన్గానే అ శివలింజ్ లేరు శెంట్రీ అందర్గుడా తిండమ్మానిశేర్. అఁయ్ తినపాత్ తినక్ పోనీ. నేవూ వోళ్ తెత్తన్నవ్ఁ. నెవళోళ్ దెత్తనాలో వోళ్ మీదునోన్లల్ తెత్తన్నవ్. ఎగిమెంట్ ఆపిజెల్ దెత్తవఁన్నవ్ డూ తీసొక్కచ్చెర్. యెవడు దీసోక్కనాడు ఇకడ రారండీ. మావుఁన్ మాఁ పని మీద మాఁవుంతె యెవడొత్తడు? మా పై నున్నఁడ్గైతే ఏదొంగోడొ నెందుకు దూర్తడు? మావుఁ ఇంట్లో ఉంచోళకింకె వడూ నోపుక్ రాలేడని ఎగిన్మెంట్ ఆపిసర్లు ఎపుడైత్ డాయర్లూ కట్టుకొనీ యెల్దావఁంటె అరె అంపమ్ పటొక్కడా అని ఒకడికి, అరె గొన్ను పటొక్కరా అనొకడికి, అరె బ్రోకల్ కర సద్దుకోరా అని అనబోసర్కి యెవళ్ పనాల్ పట్కుంతన్ ఈలే … యీ ఎగిన్మెంట్ ఆపిసర్లు యిడాయిల్ గట్రా యేశి శోక్కని మల్ల పేఁంట్లు తొడొక్కని ఎలిపోన్రు. ఎటీ దండెయ్ గోరు చేశినార్గాద వోడ. ఆలాగ చేశేద్ద వఁనుకొన్ఉు. ఆవ్ పొతె మరవలేదు. అవపొతె గతెల్లోం దాక ఉండిపె. పొద్దున్నేశి అలాగా యిలాగాన్ తిరిగేడ్. మరింకేవ్ఁ అవనేదు. అప్పుడ్ … గోరు కొబుర్బెట్టి యేవఁండెల్లయా! మరి కాయతమ్మూమైంగ ఏదు శెప్పితాన్నరు. ఆ మాత్రిచ్చేత్తమంతాన్రు. యిలాటి మాత్తర్లెనొన్న మాయ్పు టాలు నేశినారీ కంపినిలో. జలవోశా కాణించ్ దించినావూఁ వోడల్ని. ఈ మాయ కొబుల్లెవ్ డూ నమ్మొద్దు. కాయితమ్ మూఁలంగిచ్చినడ్గైతే దించటవ్ఁ; నైపొతె లేదనీశేశ్ఁ. అన్న తర్వాత అయాల్ టోప్ అపెంది. అమర్నాడు వోడ దించ్యేలంతె దించ్యాల్, మూడు గంట్ల ఓర్ టైవ్ఁ ఇచ్చేనని సంతమ్ బెట్టి కాయ్తమ్ మూలాంగ్ ఇచ్చేర్. ఇచ్చింతరవ్త అపుడు …… గోరొచ్చేరు. ఇలగ మూడుగం ట్లోర్ టైమ్ ఇచ్చేత్తరట! మరి యెకడో మనోళ్ పిలిపించి వోడీ రాత్రి లాంచింగ్ చెయ్యాల. పోట్లేపొయ్ నచరే చేశేద్దవఁండి. మంచేతిల్లో వుంది. ఇచ్చిసేరా ఇదిగో కాయ్తవఁనీ శూపించెర్. శూపిఁస్తర్వత పర్వాలేదండి అనవ్ డు ఊరూర్కొలి మీర్ పిల్చిక్రావాలా అన్నారు. ఊలూర్కి యెల పిలిస్త

రండి? మా బార్యా పిలలంత వూళ్ళోవున్నార్. నేన్ మొక్లేస్కొవునండి. ఇక డుండి పోనాన్కి వొండుకోన్ తింతాన్ను. పోన్నూరోల్కల్లి వొకు వోషు మాన్ని ఒకో బష్షు ఒకు మన్శిని పంపితా గోపాల్ పట్నవ్ ఆసైడు ఒక మన్శొత్తరు. యిలాగే అనకాపెల్ రోడ్ని నంకిలి పాలెవ్ ఆసైడు ఒగ మన్శి యిలయిటో మన్శి యిలా పంపండి. నీను కోఁన్లేరి చుట్టిని చెప్పొత్తనని జెప్పేన్. మన్నవ్ గందిడి కాదండి. వొంటశేశ్కొనికడ చెప్పియ్యవచ్. ఆయా ఈ రాత్రిర్ లాంచిగ్ అయ్పోద్ది, మూడు గంట్ల ఓట్రేమ్ ఇచ్చేన్ రండన్ చెప్పిశేవ్. శెప్పిం తర్వాత అద్దెలగో ఆయాల్ రాత్రదెయ్పె. అయిపెందండి. అయిపోంతరాత అవ్ డీ మూడు గంట్లోటైవ్ ఇచ్చిఁడఁవైపోయింది. ఈ కమ్డోర్ గోర్ కుడా ఎలొప్పడం జరిగింది. జరిగింతర్వాత యెదో అలాగ కాలాశవ్ చేస్కొచ్చేవ్. కాలాశవ్ చేస్కొచ్చిన్ తరోవ్త అవ్ డేమ్ మల్లేదో మరోక్ వోడదిగింది. దిగిం తర్వాతేంచెల? అప్పుడొక రోజు మత్తరగోశర్ మాకు. అలాంచింగ్ చేశిండని ఆపుజేశేవఁన్. మల్ల అరవయ యెనిమిదో తొమ్మిదో దిగింది. దిగింతరోవ్త అవ్డిలాగే పేచీల్ పడ్తఁ ... యేఁవండి? అమత్రిచ్చేర్ కాదంతె యిదిగో యిత్తర్, అదిగో యిత్తర్ అదిగో యిత్తడన్ నాటకఁవాడించేర్, రొండ్రోళ్ దిగిపోయిందాకూనూ. మూడో వోడవఁల పట్టుకోండ్. యేంటా రోజు మాత్రవ్ ఇవలేదంతే. యేవెఁల్లయ్ నాతో వుండు. కమ్టీ నెంబర్లంద్రూ అన్ని డిపార్మెంట్ డబ్బెత్తిచినార్. మనువ్ డబ్బివలేదూ. అంచేతన మనకు ఒచ్చొక్ ఆర్గొండ్లూ యెంతో పదిహేనొందల్గాలొత్తన్నయీ. ఈ డొబ్బులూ గోర్కిచ్చిత్తె బోగుంతది. మన్కేవెఁనె ఉపకారంగుంతది. నువ్ ముకందవ్ అవొచ్చు. అల్ అదెవ్వచ్చని మళ్ళ చీ తిరిగినారు. యేటండీ కమ్టీ నమ్బర్లకి మనల్లెందుకు పెట్టేరు? పెజలకి యేమేన అన్యాయవ్ జరిగితే యెదుర్కొ నడ గనాన్కి పెద్దవోల్తోటి అందరైలిపోకంట దానికి పెతినిది గైవళయ్తుంతారో ఆపె తినిది యెల్లి ఆ పోర్మంతొ సంపట్ దింపుల్ చెయ్నాన్కి ఆ పోర్మాన్కి మనకి నత కుదట్టుక్పోతె ఆళ్ళు మేజెంటుమెంటుతో శెప్పనానికి మనఁవూ, మన్ వూన్యాతో తల్లెంతొ తండ్రెంతొ అలాగే వూన్యని. వూన్యాతో మనవ్ చెవ్ నాన్కి. లెదు. చిన్న చిన్న సమస్సలేతే పోర్మాను మనొవ్ తెగ్గొడు పోద్రోవ్. అనీ చెవ్ డంజరిగింది. జరిగితే ఆ వోడెంత దిగింది? అరవయ్ నాలుగులు కద!

యేడూ నలపై ఐదు నిమిసాలకు దిగింది. దన్ పేరు నాకు దెలీదునెండి యేడూ నల్పై ఐదు నిమ్సాలకు దిగింది. అరవై నాల్గులో అరవై నాల్గులో అర్వాయ్ ఐదులో ఫైండుగ దగ్గిరె. యేడూ నల్ప ఐదు నిమిసాలకుదిగింది. ఐతె యేడువ్వ నలపై ఐదు నివంశాలకు దిగితే, యెప్పుడూ శనివారొవ్. యేడూ నలపై ఐదు నిమిశాలకు దిగితే శుక్కోర్రార్నాడు కొంతమంది గంటన్నర్లో ఆపులైలిపోతే ఎనిమిది గంట్ల మాత్ర సరిపోతంది. యెప్డూ పన్నెండ్ గంట్లకెళ్తనవ్. వొంటి గంటకు మత్తర బిలత్తాస్ను. ఒంటి గంటకి టైము. పన్నెండు కెల్లిపోయిన మాకు టైవుం లేదులెండి. ఐతె ఈ యేడూ నల్పై నివ్శాలకు ఎంతవుతుంది? ఆడుగంట్లో ఆరున్నరో అవుతాంది. ఐతె యేవండీ? మాకు రొండు గంట్లిదులో డిఫరాన్స్ మాక్ కనపడ్తాంది. యేడూ నలపైయిదో నివిశాలక్ దిగుతాంది. మరి దీన్ తాలూకు నట్ట పలాలవ్ ఒంకలండిత్తారూ అన్నేనెడిగేను. ఒవ్లు పెసిడెంట్ని, సైవరాపిస్ని అడిగేను. మాం వోళుక్కుడ చెప్పేను. నిబ్బగనే టిల్లయ నిబ్బగనే. ఐతె ఇటువోర్లో యెన్ని యెన్ని వోళ్ళు దిగినయ్ శెనివార్నొ? చెనివారవ్ మూడు శిప్పుల్ దిగినయ్. చెనివారవ్. ఇది నాలుగో చిప్పి. ఐతేనే అన్నడ్. అది కాదెల్లయ! అప్పుడు లాంచింగ్ది ఐతె వోజెన్వాంలా ఉండిపాయెరు ఆడి మొత్తమ్మీద. ఉప్పుడూ యెనిమిది రోజులు చిక్లీ మీకిచ్చేరు, లాంచింగ్ శెలవనీ. అంచేతన్ దెన్లో యెగిల్మెంట్ కట్టేర్ కాబట్టి అయెగిల్మెంట్లో ఇది పోయిందని ఈ లేబ్రాపిస్గోరు చెప్పేరు. సరె యాలు యెగిల్మెట్ దేనిక్ కట్టేరండి? లాంచిగ్ ఱోజుని శిప్పియాడ్ ఆపకంట వోరకు శెయ్మని ఒవ్కొనోడ్. ఇవ్వోటుకు చేశినందుకి పదిరోల్ చిక్కలీవ్ వున్నెదని మూడ్రోల్ దెచ్చెండ్ర? ఇయ్యో మూడ్రోలు మాత్రవ్ ఎనివ్దిద్రోలు మాకు కేజుల్ లీవ్ కింద ఇచ్చేరు. అది మేజెంట్మెంట్కీ వూన్యాన్కి జరిగిన సంపజ్దింపులు. అంతేగని మా రోజైభవ్లోనూ రొండు గంట్లు తీసుకుంటనొవ్డూ యెగిలిమెంట్ కట్లేదు. రావ్ సైచ్చిపోలేదూ. అడగండి. అడిగి యెవేన పొరపాటుంతె నాకు తగిన పంచెయ్యండి. అంతె మా డబ్బులైలా పోనిత్తవండి? అని శెవ్డం జరిగింది. అంలేద్దిల్యా నీకు తెలీదు అన్నడు. నాకు తెలీపోడవ్ ఏటండి? యేవండి...గొరూ? అప్పుడు ఎగిమెంటు కట్టేరా? శెనివారొవ్ యేడూ నల్ప ఐదు నివంశాలకు దిగితే ఈ రొండు గంట్లు డబ్బులిలా దీస్కోమనీ యెగిర్మెంట్ కట్టేరా? యవ్డూ అంతరో రమ్మనూ అన్నడు. లేదెండి, యిలా జరగదంపి, అనీ శవ్డవ్ జరిగింది.

శెప్పింతర్వాత అపుడేవిఁ జెశేరు లేబ్రాపిస్ గోరు నికేవ్ఁ 'తెలుగునా?' తెలుశునండి. అదినీకెందుకీ బాదల్ల? యేహ్‌దో అలగ్గిలగనిచెప్పి చేశి అయి మూడు, ఇది నాలుగో శిప్పు. అయినవ్‌డు ఏవిఁజెబితరు? "ఒరేయ్! ఇదిగాని ఇయ్యోపోతే-ఏటి? ఈ రోజు మాత్రగాని ఇయ్యకో్వతే-దీనికి దెబ్బ తేద్దవ్ఁరా". అల్లా మాత్ర వొచ్చిందాకిలా సూద్దవఁన్ చెప్పివ్ఁ. చెప్పింతర్వాత అవ్‌డేమైంది? "ఇలాగా" అన్నరు. యేంది? ఇలాగాని అప్పుడేవిఁ చేత్రీఇది. యేడూ నైల్పి నిమ్‌శాలై ్కంది, ఐతే రోజుకెన్ని గంట్లు పంజే్త్తన్నవూ అన్నడు. యేడున్నర జేత్తునవండి. అవ్‌డేడున్నర డున్నర కొచ్చేల్. యేడున్నర కొచో్చల్విఁ. యేడున్నర్ కొచ్చే శుక్కుర్ వారవూఁ ఐదుగ్గాలైలావ్ఁ. ఐదున్నరో్క ఎంతగ్గిలోలవిఁ. చనివార్రొవ్ఁ వొంటిగాంట్‌కి ఎలిపొచ్చెళవిఁ. ఐతె ఉప్పుడు ఎంతకొ త్త్రనండీ. ఐతె ఉప్పుడెంతైందన్రను. ఉపుడెంతైందండే! న్రుపో్వు దక్కువ ఏడుకొ త్తనవ్ బెట్న సైవుఁ. నాల్గున్నర్కి నాలుకొ్క నాల్గున్నరొ్క ఎలిపోవచ్చేది. అంచైతని యెలా సరిపెడ్తర్? సరిపెట్టండీ అని. అఁ మరేఁవ్, మరి ...... యెనివిఁది గంట్లు సైవుఁ సరిపోయిందేన్నరు. ఇతె సైరెండి...గారూ! లేబ్రాపీస్‌గారూ! దనికి యెనిమిది గఁంట్ల మత్ర సైరిపోయిందని మీర్ శెప్పితట్ కాబాటి ఒవో్వజోవ్ఁ మొత్తొమ్మిద పంజే్త్తన్నవ్ఁ కాబట్టి ఈ యెనివిఁది గంట్ల మత్ర సరిపోయిందం తాన్రు కాబట్టి కూడుకులోనూ ఈ చూటాంవ్‌లొనూ ఇయ్యెనిమిదిగంట్ల మత్ర సూపెడ్తరా పర్వాలేదు. చూపెట్టకపొతే చూడండి యలగుంతదొ. అది కొంచొవ్ఁ ఆలోచించండి. ఐతె అప్పు శ్శైబ్రాపీస్ అన్నరు. నీకేవ్ఁ వాళ్ చెత్తంరేల్లైయా? చెప్పలేదు...చెప్పలేదూ ... చెప్పలేదు. మావొకు బర్త్‌లోను కారిఁకులూ చెల్లై. నాయావ్‌కవ్ఁలొ పుట్టిందండి. నానాలోచించ్‌కోనండి. హనీ శొదువులేదు. శదువు లేపోతే ఈ యెంట్కల్ చూడండి! యెలగుందొ బుజ్జొమీద రోమవుఁ. ఆటిశెవ్ ఒ త్తయండి. చదువుకోఁంగన శంబరొవ్ఁ కోదండి. కొంచొవ్ఁ ఆలోచించి, కొంచువ్ఁ ఇదై నడ్గైతె అదే పుడతది. శదువుకోగాన ఫైద్ద ఇదై పోతరునుకోకండి. అనీ శెప్పగాన "ఎయ్‌తె మరేటంతావ్". ఏటంతొవ్ఁ? ఎనివిఁది గంట్ల మత్ర మాకు శరిపెట్టండని. "అన్నివెన్ని గంట్ల కొత్తన్నవ్ఁ". యేడున్నఅకి. ఎన్ని గఁట్లఁకది. పలాన్‌సైవుఁకి. అఁసరిపెట్టండి. సైరిపోయింది. యెలా సరిపోయింది? పన్నిండుకొతనవ్ఁ; వొంటిగంటక్ మత్ర బిలిస్తన్నవ్. యేడూ నలపైఐదు నివిఁశాల్ దిగితంది, చూడండి! యెల్లగ సైర్‌పరేశరోఅన్న. అప్పుడు ఒల్లకు న్నడు. అపులింగ్లీళ్ల మాట్లాణ్ణర్. యెవలూ?...గోరూ, లేబ్రాపీస్‌గోరూ.

"యేవాఁండో! మరింగ్లీష్ మాట్లాడ్తె నాకేవ్ఁ తెలీదండి". తన్ తెలిగిన్ చప్పం డనీ అపుడు ... గోరని శెకరెట్రిగోర్ ఉండోరు. "ఆఁ పరవాలేదూ. అదోహ్ మాటాడ్రను". అదోమాటాయ్తె పొని, పొనియండి. పొన్ చప్పకపోతె ఏటిపో తంది? ఇందులోన్వేఁ కొంపమునిపోతేవిఁ లెదూ అన్న. యేఁవ్ ఇటు వొర్లొపుడూ ఇటువొర్లొమూడు ఇది నాల్గో శెనేవ్రొవ్ఁ అంజెప్పేను. ఏయ్తె అతడ్ జూశి "యేవ్ఁ మరంతెనా"? అంతేనండి. మరి మీవోలుకు నువ్ శెప్పవా? పెత్తందా ర్గున్నవు. నువ్ కమ్టీ నంబరువ్. యి...గుడ వున్నరు. ఇక్కన్నించేదో ఆలోర్చ కొనీ ఆలోచించ్కొని యల్దవఁయ్యా. ముగ్గురవ్ఁ కమ్టీ నంబర్లవఁంతే. నాతో ఉన్న కమ్టీ నెంబర్లన్నరూ 'మర్ నీకడ చపొద్దు. ఆపేట్గనీ మయబ్బాయ్ని ఏయుంచ్కొలన్ నేబెత్రిపీస్గర్ తిరుగుతన్నను. రాజా! నాకు మహామాటవ్ఁం, మరేవ్ఁలేదు'. అనొక కమ్టినవర్. ఒక్కమ్టీ నవ్ఁబరంటవ్ఁ "మరేవ్ఁలెద్గని మతమ్ముణి గురించి నీను అడగనన్ కొంచువ్ఁ శొవ్ఁశాయెవ్ఁ." ఉఁవ్ సరు మరి మీరు మీ నువ్కీ శావ్ఁశాయవ్ఁ. నీకు శావ్శా అఁయతె నాకు శొవ్ఁసాయంలెదూ? మాయమ్మ మఁతండ్రిగూడ ఈకంపినీ పుడ్తదని నన్ పుట్టించలెదూ. నా యదు ట్టువ్ఁ కొద్ది కూలి పందొరికింద. నా బిడ లదుట్టమైతె దిరితే నేవ్ అదుకక్కత్తింతరు. నేవ్తె కోటీశ్వర్లౌతడ్. గానీ నాకాడ మాత్రవ్ఁ ఆ లాలోచి మాట్లాడద్దు. ముగ్గురువ్ఁ ఒ తోవనెల్తనవ్ఁగటి ముగ్గురువ్ఁ ఆలోచించేకుందవ్ఁ. అక్కడ వొకోకళ్ళ పిలిశి అడుగుతరుగాని అందర్ని అడగరు. అంచేతన్ ఉప్పుడే ఇక్కడాలోసన పడీస్తే బోగుంటదబ్బాయ్! ఉవ్ఁమీఁవ్ అడగవుఁ. అదంద్రు యెగిల్మెంటుకట్టిస్తే పర్వాలేదుగనీ నేపోత్ మనవ్ఁ దెబ్బ తిన్తవ్ఁ అడిగితే. హారెరే! నిన్నిందుక్రా పెట్టేరు. ముగ్గుర్నెందుకు పెట్టేరు? ఆళుండడాంకి పెట్టెరా? ఈరు ముగ్గురూ సెరెయ్నోలద్ర? రామనచ్వుఁనా తయార్ ఆనరు. బోగ ఒడుగుతారనే మన పెట్టేగ్గెనీ మ తఁమ్ముడున్నడు మ కొడుకున్నడని పెట్లేద్రా మనల్ని. అన్నేనట్నించి ఎల్లొచ్చిన్ తరావ్త ఈల్తోం జెప్పేసనయ్యా యిలగిలగ తమ్డున్నడని అతనొవ్కొలెదూ; కొడుకున్నాడని ఇతనొవ్కొలెదూ; అకడ నీఁనూ అడుగుతాన్న పతీదన్న నానసీత్తారవ్ఁ పొంతనను ఇతను కమ్టీ నంబరుకూడా వొద్దని తీసి పారెయ్మంతాన్రు. ఇగెన కాణిస్ గుడా నేబ్రాపిస్గొరు ఆల్తొన్ నెనూ సంపర్దింప్లుకు జరగ యెల్లనూ. మీరొవ్శో యెల్లండి. మీతల్లితండ్రికో నవఁస్తనీలందర్ని దెగ్గిరీ పెట్టి ఒంటిగంటకు మీటింగు పెట్టి అక్కడే చెప్పేశేను. ఎత్తే ఇతనే

యెల్లాల్‌గాని రెండోవోడ్ ఒవుడ్ రోడు అన్నడు. అప్పుడు మనోవ్ం పిలక పంతులాళు యల్డింగ్ డిపార్మిం ట్లుండోరునెండి. ఆళుగూడన్నరు నువ్ చోర్లో నొద్దూ. నేశెల్పో అన్నరు. నేశెల్పోనోనుక్ కాదండి. నువ్ శెకెట్రిగ వున్నవండీ. యెల్డింగ్ డిపాట్మెంట్లో సెకరట్రి ఏటీ నీను కమ్‌టీ నంబర్ననుకోండి. నన్ను నిస్పాకారవ్ం చూడకండి. కూలోడ్ సైనున్నూ పోరుమాన్కి ఎంతుందో మేనే జర్కి వోద యెంతుందో నాను యాబై మందికి తాలుకు పెతినిదిని కాబట్టి నన్నెల్నిపోమండవ్ం అచ్చాలా పొరపాటండి, పంతులుగోరూ! అజ్జెగత్తగ ఓలోచించండి. నీనవ్ నాకూ చీటు దొరుకుతాంది కాబట్టి నివ్వెంతో నీనంతె. పైన నువ్వెవళో నీనెవళో తెలీదు. అంచేత నాది చాలా పొరపాటండని శెప్పడం జరిగింది. ఉప్పుడుగుణ్ణానండి యల్డ్రి పంతులు. అన్ని తరావ్‌త అవ్ డేవైంది? సైరెనియేదో ... జేసెరు. చేశిన్‌తరాత అప్పుడు దిన్ని ఫర్వాలెదూ. దిన్నిలగ జేద్దవ్ం, అలాజేద్దవని ఒవ్ డు దీపించొచ్చి మల్ల శుక్రోర్నడు ఈరాత్రికి ఈశెలాగా బొందు చేత్తర్రా అనీసి శినేర్నాడు శుక్రోర్నాడు తెల్లోత్తె యెల్లండి. మల్లర్జంటుగ రమ్మన్నారు లేబ్రాపిస్. పొంచింగ్ జేతె నెల్లయ్ నీను బేగి రమం ట్రెళ్ళెను. యేవ్ం? ఏవైంది? మివుళ్ ఒవ్ కున్నరా? ఎనిమిది గంటలనఅ మత్తర గని యేమైన తక్కువైందా? నీబీపిమూనయ్ మోతొదుల్‌కునదుదంతవ్ం రా అని కమ్‌టీ నంబర్ అంచెప్పేరండి. ఆలంద్రు ఒవ్‌కుంచె నీనోవ్‌కుంతన్ బోబూ! ఒకనా డొబులొచ్చింది ప్రోంగొట్నానిన్ రాలేదండి. మన్ననుదంతరాలు మీరే చెప్పండీ? అన్నను. "ఏయ్‌తె నువ్ రావొద్దు. నువక్‌డ ఉండిపో" అన్నరు. నన్నాక్ శోట్నుండిపొమ్మన్ను లేబ్రాపీసు. ఉండిపోత నన్నను. ఉండిపోతన్న ముందొచ్చెన్ ఇలగ చెప్పేన్. 'ఒరేయ్! ఇలఇలా జరుగుతాంది. నన్ను రావొద్దం తాన్రు. మీకోళ్ళు అవ్ జెవ్‌కుంతరట! నను జన్‌నవ్ జెవ్‌మన్రూ. నీన్ చెప్పేననీ శేను. ఐతె రానే ఇలగిల చెప్పేనండి. ముందిలాచెప్పేను. చెప్పింతరావ్‌తీలోచ్చేర్. మాకమ్‌టీ నెంబర్ యెవ్‌రైతె మీవ్ం నిలబెట్నావ్ం ఆపెతినిదే మీతోని మాట్లాడల గనీ మీవంద్రవ్ం మీతో మాట్లాణిక్ రాలెదు. అనగాన అవ్‌డితన్ ఔకాళ అతనోవ్‌కాళ అతనోకాళ యెళ్ళొయియా రమ్మను కబరు పెట్టేరు. న రమ్మనగాన అప్పుడు మల్ల యెల్లేను. పెద్దోళ్ రమ్మనవ్‌డు యెల్లాల్‌కద బాబు? యెల్లేను. యెల్లింతరావ్‌త యేవ్ మరేవ్ం అంతె మిరేవిం జెప్తె అదిగని ఇంక నాను ఊళ్ళో యేవీ యెలకిచ్చుకొని పల్దొవుంలిచ్చుకొని బార్పోడు యెలాగైతె

అంబల్ జేవడుకోక్ను పొందుగుల్ పరమాణా అప్పుడేదో ముద్దామత్రా అడుక్కొంతడు, అలాగే కమిటీ నంబర్ పదవులంతె. మీ మాటొట్టూపొయ్ ఆలకి చెప్నానికీ ఆలు చెప్పిన మాట మీకి చెప్పనానికి దణ్ణేవెేన్ సైందోవ్ ఒత్తె, మీకూ మీకూ శెప్ప్రానికి మీరు మీరూ ఇన్కుంతె నాపెత్తనం. ఇన్కోపోతె నాపెత్తనవేం పంజెయ్దు. అందుకేగన్నీ ఒరె కంపినీ బోగుండాల. మనల్ని పీడించిక్ తింతరు. మనింట్లో శంవ్శర్ గుడ మేపల అనే చెపనానికుండలేదు. అంజెబ్బొతె కపుడు యేవంరంటరు? యేవంతర్ చూడండి! అపుడ్ ... పిల్గాండు. ఏంబాబూ? త్రేబాఫ్గ్గారు పిలిత్తాన్రండి అన్. "అలాంచింగ్ తాలూగు రికాడొట్రావయ్" ఆన్ ... ఒట్టుకొచ్చేరు. ఇటు వ్వోర్లో ఎన్ని శిప్పుల్ దిగినయ్ శూడండీ అన్... "మూడు శిప్పుల్ దిగినయ్, ఇది నాల్గో శిప్పు." "సరే! వ్వోర్ క్లైమ్ చెయ్యండి. ఆపుల మరెల్లద్దు. వోర్ క్లైవ్ం డబ్బిచ్చెత్తవ్ం. మరేట్ అనుకోకు. శొంతుర్తా యింందా? నీవ్ బోదనా"... అది మియ్యిశ్టవండి ఇచ్చిశేవ్ం! "యెల్పొ. యెల్లేయ! మత్ర అన్"... అచ్చించేర్ బాబు! అనిలాగే దణ్ణవ్ పెట్టేను. ఎలిపొంతరత మాంనె కునికింకన్నుండు. అమ్మన మత్రిచ్చేశేరు. అలాగా యిలాగన్కొని సర్దాగా పో! ఒళూ ఉల్లాసైనగ ఒచ్చి చెప్పొదు. శెబ్బొతర్కి అకడా ఇవ్డూ నామీదెగానిట్టా ఒకైదుగ్రో ఆరుంద్రా ఆతనికి తెల్సు. ఎల్లిం తర్వాత అజితాలదెగ్రి లాంచింగ్ అయ్పో నరవ్తైన అనుకొనాండి, చెయ్యండి, ఉప్పుడుకొచ్చియిరవై మూడు శవ్త్రాల్సలయింది. ఒకణా టిక్కడు గూడా ఒవుళ్ కానీ నడగను. ఉంతే తింతాన్, డబులెటోంన్ కొనుకొనీ. తేపతె అలా పత్తే వొత్తన్గని మరింక ఆ పద్దతేమ్ పెట్లేదన్. ఐతే అపుడుకేవిం జేశేరూ? అతిమనవుండ్ అంద్రేవి జేశేరూ? కూలోడ్ అయ్న ఆనదే! శదువ్ శొంగుడలేదూ! మంచి టొంగ్గ దెబ్బాడి పతీదన్నన్ కుడా కలగ జేశ్కొనీ మనకోకో ముంజంజ్ అడుగేత్తనడూ అని అల సొంతుళ్ళు బెట్టి పిల్లల్తొని జరకకంటుంది, గుడ్డ ముక గట్ర నారింగ్లేదూ అనొక పేంటునూ బుశ్కోటునూ కాకీ బట్ట తీసి కుట్టించేరు. ఒకిర్వయో ముప్పెయో యెత్తి నాకిచ్చేరు. అయాం! ఇది నంచవ్ం తించుకొనానకి అనుకొంతరు. నేనిపోని చికాకుల్ పడ్తయంతె "లేదెళ్లెయ్య! నీమత్రే ఇజ్జె శ్నావ్ కాబట్టి ఈ డబ్బు పొతే మాకొవ్ డిత్తడు? మాక్ శొంతోశ్టంగ ఇదిగో ఈ బట్లు కుట్టించేవ్ం. ఇవి తీశ్కో" అనిచ్చేరు. యేవండోర్...గొరూ! మనొక డబెత్తమంతె యెప్పుడు జీతాలకి జీతాల్ కెత్తోదు కాదు అంచేతని ... కో

షేంటూ ఒబుశోక్కటూ ఒ పాతొక్క ఇఅపియో ఇచ్చేరు. అంచేనిలా ఇన్నా శైతె లాభవ్ లేదని మన్ శూప్రోర్కు శార్జిమన్ కందర్కి గేల్ దిత్తడని అపుడీలంద్రు నైబర్ వుయ్యాన్ గల్పి సంతకాల్ పెట్టి నను జెన్రల్కి ర్యూపై-తొమిదనాల్ ఉండేదప్డికి- జెన్రల్కి పంపించేర్. ఇయెళిపోతవాంశె మరి మీ దియండి. మీలో ఈ న్యాయడు నెనూ మీకన్యేవ్ శెయ్‌లేదు. నాయింగ మీ పదురోక్క కోలు పని బొట్లు కుడా కూర్చి వోక శైమాపిన్కు అక్రమానైంగ యెల్లకంట నా ఒకి దీనిగ్గుడా వుండి బాగా పంజేశైను. యింతుళ్ళో మీ నలుగుర్లో నన్నిడదీసి పంపించినప్డు మీరంద్రకు ఒక ఐయ్క్యతగావుండి మా పెతినిది యేవ్ కార్నంచేత పంపిందన్ శేశిన్ తప్పేటి? మీరే నిలబడినప్పుడు మా వోర్తో నటుగ మమ్మల్లూ పంపించండి అని మీరెప్పుడైతె నాకొక ఐదు నిమశాల్ శైమిచ్చేరో నావొక్కొ బొవశెక్చ ఇక్కడ శూపింశ్ చూగొలుగుతాను. లేద నవ్‌డు మీరు శేశీదేవ్ లేదండి. నీన్ శేశీదేవ్ లేదన్... యేవ్ యిలా గౌతందేటి సంగతన్న. మీ కోలుపెంట్రు చెశనాల్గా నిలబడై మీవేవో నిలబత్తవని తన ఆమి ఇచ్చేర్. ఇచ్చింతర్వాత ఆలేవిజేశైరు? ఊర్పై గోల్లవుతే... నంబర్స్. రూపై పాల్వ యెవశైతిత్తరో ఆశే నైంబర్స్. తకినోళ్ అళు. ... తరావ్‌త మరుదినువ్ శందాలు. ఉప్పుడు ఇన్ని శమశ్రాలయింద్ళి చిప్పియాడ్డి శందాలైతె బొక్కుల్ తెచ్ కోడవ్, శందాల్ కట్టడవూ, వూన్యాకి పండోవర్ శెయ్‌డువ్. ఆ రోడు శవశ్రాలు అలాగ్గాదు. పారాలాలు శైప్ గొట్టివ్వడవూ, ఆ పాలాల్ మీద సంద్కమ్ పెట్టి ఈలిచ్చేత్తే ఆ పారాలలా గుండవు. ఈ డబ్బిల్ జోబిలెశోక్కన్ యెలోప్డవు. మరందులో పారాల్లేవు. ఈవి శీట్లు, గచీదులు. నా కొల్లకాడ్జ మవ్ పారాలొట్టుకెల్వండి. మీకణా మా మీద కడతారని అనుగ్రవుంతే బొక్కులివ్వండి. ఇటుగు ముందున ఇత్తవ్. కంపినీ పుట్టింది; మేమ్ పుట్టైవు. యెప్పుడ్ కూడా కంప్నీ చైత కోయించడవ్ మేవెర్గవు. బుక్కుల్ తేవవవు, రశీద్లు తీశొక్కడవ్, డొబ్బు పండోవర్ చేశొక్కడంగనీ. ఇలా చైవ్‌డంతొటి సైరేని అప్పుడు మానెశైడు. ఇగనిలాగ్గాద్ర. యిలా గని అదీ ఇది చేశీ ఈ ర్యూపై తొమ్దనల్ అయింతట్‌వాత నీవూ మంచి డిపాడ్‌మెంటుండి ఎల్లిపోతవా? అన్నరు నై బ్రాపీ. మిదయండి! మీరెక్‌డుండ్‌మంతె అక్కడే వుంతాను, దానికేవ్ పర్వాలేదు. యేవయ్యంతె ఆ అడుంతె ఇకడ్ శైన్లు ఎక్కడికక్‌డ ఆపేత్తడు- యెంది యెవుళ్ళు చేశిన్ డిగ్ని శైశ: శేజింగ్

ఉండోడు. ఆ శేజింగ్ లెకడవ్ పొడక్‌పొతే మనేబర్ చేతే అశేజింగ్ పని చెయించోడు. ఈ నేబర్ నొట్టుకెల్లి ఆశేజింగ్‌లో పంజేయించొడు. ఆ శేజింగ్ పనై పొగనే నేబర్లో తెచ్చిపెట్టోడు. యేమంయా? మీవ్ం చేశింది అన్‌స్కిళ్డు. కిళ్డు పంన్లో పెత్తన్నవు. అక్కనించి అరవైయ్ డబ్బైయ్ అడుగులు పైనించి పడితే మా తాతైవడ్ దిక్కా? మా బార్యాపిలుక్కు మీవేం దూరమై ముకముకలెగి ర్పొయ్ శత్తవుం. ఉవుడ్ రొండో మూడు కేశులలా జరిగినయి. మాంవ్ చేశింది లేబర్‌పని నువ్ జేయించింది కొళ్డుపని అపైకెక్కింతాన్నవు. మరి మీరొవ్‌శేన్ ఎక కూడదా, మీయంబ్‌డి? మీవెక్వ మీరూపడై మావూం పత్తవ్ం. నేపాతైవళ్కి లేదు. ఇదా పని? అంచెబ్బోసర్కి అప్పుడు శేజింగ్‌కి లేబల్‌కి కన్సక్‌చన్ నేకండ చేశెరు. అడగండ్ ఆ పెద్దమనిశి. నేతే అప్‌డీ లేబర్ చేత శేజింగ్లొ పంజెయించారు. పన్నేనవ్‌డలాక్కు కడ్ శదువుకోమనడ్. మల్ల లేబర్గా తెచ్చి ఇకడ పంజేశెవ్ం. శేజింగ్ అనే శేజింగే నేబర్ సందతి నేబర్సె అని పెట్టాలగనీ, ఇలా చెశిశెయ్‌నాన్కిల్లేదని అదో కంతల్‌బ పెట్‌గానె అపుడయ్ యేర్పాట్లు జేశశి యీలు బోగు పణిచ్చి ముప్పైయ్‌మంది బోగు పణిచ్చి ఒపుణున్న జెన్రలగ పంపించెశిఅబవై రొండ్లగాల్ ఇచ్చేర్. ఈయాన అరవై నాలుగులో పొండుగ జేశ్కొనొచ్చిన్ తరావ్ తిక్కడకి కనోన్నరింటికి పంపించెశి ఈయనా కటింగు జేళశి అలా నైబర్గా వుంచినారు రూపై నెర్లొ. యేవండీ? అవిశేర్ ఒళ్ళున్నవ్‌డు అవ్‌టింగ్ ఉండీదండి. డాలీమన్ ఉండోరండి. గీజర్లుండోరండి. అరివిట్టోళ్ లేషయ్ వెల్డింగ్ వోళ్ళొచ్చినయ్ అనుకోండి. వెల్డింగ్ వోళ్ రాగన యేరే డిపార్మెంట్లో పంపించేర్, ఇకడ పన్నేదని. ఆళ్ళొకడబ్బులు కోశ్కి పంపించెరా? నేతె అదే రేటు మీద పంపించెరండి. నేబ్రాపీని ఈలంధర్ని కుడ అడిగేను. వూన్యానాయ్‌గుల్. అనినోగు తెలీదంటె నోగు తెలీదు. నోగు దెలీదంటె నోగు దెలీశ్నంశ్. ఉవుడున్న ఉపుడున్నానెండి శెకరట్రీగోరు. అతనన్నాడు నువ్ నన్ను నిలబెట్టవేటన్. నిన్ను నాను నిలబెళ్లేదనుకోండి. నిలబెట్టేరనుకొండి. శొంతాన్ నువ్ ఇంట్లో పంల్లి గురించి నివ్ నిలబెట్టెడ? యీ నోలుగువేల్ కోర్మికుల గురించి నిన్ను శెక్రెట్రీగ నిల్బెట్టెడ? నీనడగడవ్ం జరిగిందండి, జనట్టోర్ దెగ్గిర. పపావ్! నువ్ నన్నేంవి నిలబెట్నేదు అనిస్తె మరేవ్ం జేతనండి? మీ నాటోళ్కి పదాలొస్తె మానాటోళ్ పొంన్లె ఇలాగే వుంత్యండి. శెరే అనేశేను. ఆ జనట్టోర్ కానించి ఎలిపోఒచ్చేన్. లేబ్రాపీ నడిగ్‌నాను. అదిమీ వూన్యనడుగూ అన్నడు. యేవంండీ!...ఆశీర్మెట్టు కెల్లేవ్ం. "అబెబె! అది నాకేవ్ం తెలీదెల్లయా! అది మీవోల్కెగాన్" అన్నడు.

యేవండని ఇంక శెకరట్రీ ఇంక పెజెంట్లు ఇలాంద్రున్నార్నెండి. అడిగేన్. అడీయ్తె నాకూ తెలీదంటె నాగు ...... పోని యెలాగొచ్చిందో అలగే పోయింది. నాపైనవ్ బవ్లు తేశీద్గద! అంతె. అపుడ్ లేబ్రాపి పిలిపించెడు. ఉప్పుడైనచరె, ఈ డిపాడ్మెంటుకి ఇడిశిపెట్ ఇడిశిపెట్టీ శిక్కడ రోజకియమ్ మానియ్. రోజకియమ్ మానిస్తె బోగుంటెదని, లేపోనగ్గెయ్తె నీ పనీగూడ తీశియ్మని చిపరెడ్ బర్తీనించి కాయితవ్ ఒచ్చిందీ. అన్నలుగురైదుగురు పనీగూళ్ళకంట్ తీశియ్మన్నర్. ఉవ్డియ్న నారింగ్ నోర్మూశ్కొనుంతవా? అన్నర్. నోరెలా మూత్తనండీ? నన్నోర్మయ్ మతె నే చొప్పూనేరవ్ చెయ్లేదుగదండి పంచేచె నొకనా డొబ్లియ్మని దెబ్లాడ్తు నగనీ నీన్ రోజకియవేవ్ లేదండి. బాబూ!...నానా బీక్మీదగాని మా యింట్లోన గాని మా యొంట్లోగాని యెకడో రికాటవడంగాని లేదండి. పెజల్ గురించి...చే వాదనవ్ చేత్తన్. నయోప్కునంతవరగు. అల్నిల బైటమన్ బెత్తినె నీన్ నిలబడ్డన్. నాయంతలో నిలబడనేద్ కదండి? మీరెందుకడిం జన్రలోం కొద్ది కమ్టీ నెంబర్గాళ్ నిలబెట్టమని కొత్తకుఱోళు మాకేవ్ తెలీదయ్యా అన్ననుబవించి నోడ్వని ఓళ్ళుండమాంతే, వొజ్జని మీరు శేత్తు, నీనేవ్ శెయ్యాలండి? చేమోయ్! మీరొవుళ్ళుంద్ర ఆలంద్రు ఎనిమిదేస్ ఒందొలొచీ ఇచ్చీ వున్నలె. ఆయవ్కు శిపోయ్ ఇంటిపక్న గొల్లవీధినుండగద శిపు. అశిపోద్దెగ్గిర్ దాపులోళ్ళ అల్ల యేశేర్, ఆరొండ్లు యెనిమిదొండ్లు. యెనిమిదీ తొమ్మిది గంట్లొపాయ్మెంటు. ఈలూగ్గూడ మంచోడని ఆడు మొత్తొమ్మిద ఒకల్లాటోడ్ గాదూ, ఒకో అనా డబ్లైన ఒకళవ్ తిండు. ఆడ్నారంతె. యెదార్దంగాత్తడని ఈల్ పెట్టీ శెవ్గనే పెట్టేడు. పెట్టింతరవ్త అకాయ్తవ్ చింపెయండ్. ఆడొద్దు. ఆళ్ళోన్ తిరితాండ. అయ్తె శరెండి......! ఇయ్యాల పెజ్డెంటుగా మీరున్నరు. ఒప్పుకోన్నవ్. దణ్ణవ్. ఈ పొద్దున్నర్ ఈంతివోండ్లో మీరెకడున్నరో మీ మొగవ్మైకు తెలీదు. మా మొగొవ్ మీకు తెలీదు. ఉవ్డు మీరొచ్చేరు. ఆల్తో మాట్లాడమ్ మానెస్తాను. ఉవ్డూ మీర్ పెజ్డెంటుగున్నర్. పర్వాలేదు. నవుస్తె బాబా! అంత్... ఎవ్డైన మీర్ దిగిపోతరు. యెకడైన వునన్నడ్డూ టూవ్నే వత్తనేదో బాజర్కి యెకడో అవుపత్తరు. తెలిసిన మొకాలండి. నవుత్తని బోబని అనాలా? నేతె తలదించ్కోని యెలిపోల? నా కోశే మాట చెప్పం

డన్నాన్. ఎకడా? ఆలింటికాడె. "అరె!" నివెవ్‌డు ఆ పోల్నాడుత్త వెల్లయ." పోల్ని కాదండి. మీ రెరిగినోళ్ చేతని ఇన్నాల్ మిఁ(రాగుంతె యెవరో నినెవణ్ణో తెలీదు. ఉప్పు డెరింగించేతనీ యెకడైన వపన్నవ్‌డు నవఁస్తె బోబనాలా? మాని య్యాలఁ? అంతేగాని మాట్లాడ్‌కొంతన చిన్న చామ్నల్ బటల్ లాగెత్తవ్ఁ. కోయించ్‌నార్ కాబట్టి యేవఁండంతె యేపండనుకొంతనవ్ గానీ ఆలింటికాడ నీన్ తిన్లేదు. నా యింటికాడ ఆల్ తిన్లేదు. మరీ మాట! మీరు పెద్దవోలు కాబట్టి మీకూ కూడా తెల్సున్ గదాండీ అన... "ఏయ్‌తె మరి మి దేవూరూ?" మాది తూర్పండి. ఇయ్యేనరవ్ఁ అవతల. నెలిమల్ల గరివిడీ మొయ్యెదా ఇయన్ని కళ్ళి శాగేమైలండి. హాఁ! మీది మల్కాపురఁవ్ గాదా?...లేదు. బాబు! నాది మల్కాపురవ్ఁ కాదండి. ''మల్కాపురవెఁ నెల్లయ్య''. లేదండి. పలాన్ ఊరండి కెల్ల. యేవూరేవూర్తున్నయీ అన్నరు. కెల్లా శోడోవరోవ్ఁ ముయిద నాఙాయణ పట్నవ్ఁ గుల్లా గుజ్జింగోల్సా దమల్‌సింగీ వోల్లాపురవూఁ గెరివిడీ గెడ్డపలసా చోంౘ్రిడింకీ. ఇయెన్ని శాగేమాలండి. ''అయ్‌తె వోల్లాపురెవ్ఁలె రోజులున్న్లు పంచెవ్ఁలున్న బూవుఁలు గురించి దిళ్లాడ్‌కొౘ్రను. నీకు తెలుశునా'' అన్... నాకు తెలుశునండి. మా చుట్టాలెనే. అలింటి పేరేంపెరూ? తలేవూలండి. ''మరింకెవుళ్ళేరా?'' మిరే, వోళున్నారండి? మీరేవోలు తలేవోలూ రోజులు. ''అయ్‌తె ఆ బూవుఁలు ఎవళ్కానయి?'' రోజుల్కో కోట వొచిందండి. మావోలుకు రొండు వోటా లొచ్చేయండి. ''అయ్‌తె అప్పుణ్ణినొచ్చేనెల్లయ, అ చెరువ్ గొట్టంట.'' ఆ చెరువే పెచ్చెరువంతరండి. అదే మ వూరండి. అ కొసేనే యిల్లే మా యిల్లండి. ''అలాగా! అౘ్రను.'' అవునండి. ''శొంతూరు నీది కెల్లేన?'' కిల్లేనండి. శొంతూరు. ''అయ్‌తే ము .... తెల్సునా?'' తెల్సునండి. ఉపుడతనే మా శెమ్‌తి పెశిడెంట్గా వున్నారండి. అందున్ గురించి ఆ వూరే గాని నాది మల్కాపురవ్ఁ కాదండన్. ''నేదు. నీది మల్కాపురవెఁ నన్నారు. అదే నే నన్నాను.'' నీను మల్కాపురోవ్ఁ కాదండి. తూరుపు సైడంతను ఉప్‌డిదియున్న భార్యా పిల్లూ చాల దిగబెడ్తె నె ఇలాగెచ్చేనండి. ఆహాఁ అన్ .... అణ్ణి తరావ్ తదే సైరె శూద్దవ్ఁ. యెల్లు మాట్లాడ్దవ్ఁ అన్నరు. మాట్లాడ్దవఁని అదీ ఇదీ అల్న పోగ్ జేసి ఇయ్యేదవ్ఁగ జేసాయ్ అనా కొయించెశీ ఉప్పుడ్కి అరవై నాలు గుల్న కాదు బాబు అరవై నాలుగ్లు. ఉప్పుడ్‌కొచ్చి అలాగే వున్నవ్ఁ. ఉప్పుడ్ కైన అప్పుడవ్‌డు నేౘ్రబాపి పిలుత్తుంతరు. ''ఉప్‌డైన రాజ్కియవ్ఁ మానెయ్ మేవంౘ్రదవ్ఁ సవ్ఁసార పూటింగ్ బతుక్‌తన్నవ్ఁ కదా, నువ్ కమ్‌టీ నెంబ

గైన్నాలుంతవూ? యేట్నీ వుద్దేశ్వనీ'' అడిగేరు. నోకు రోజకియవేటండి? మిరేపంజెప్తే ఆ పనే దాసీవోణ్ణాగ నేంజేత్తుంతె నాకు రోజకీయవేటండి? మీకు మరీ బుద్దిబుఅ లేకంట ఉందండి. నాకేవిః రాజ్కీయవండి? అపుడు నలపియ్ పళ్ళో ఇల్లిచ్చినవ్డూ ఒకైదు రూపాలీస్కుండోరు. ఒకో ర్పుంజెం తీస్కుండోరు. కల్లు పాకలకాణించి మావిక్లోటూర్సు వొచినవ్ డు మాః కిల్లియ్క న యన్ననీ నన్ను ఆ పాకలో ఒగ్గిశేరు. ... గోర్తోటి మాః యన్నియ అరవన మాట్లాడితె యిలగిలగ చేత్తండనగన అపుడ్ పిలిపించి అయిల్లిచ్చినారు. క్వోటల్స్ చినగిల్లు. యిలాటివన్ని యిలాగోడుగ్ తరే టండంతె-నువెన్నాలుతవన్? ఉన్న అన్నాలండీ అనన్..మొన్న అరవియ్ యెనివిదిలో. యెన్నాలో యేల్తవ్? యేల్నల్లాలండి. ఒకో గడియైన చేనండి. యేవిః యెవ్డూ వొచ్చి గాని మీకడేవ్ః వోకనాడబులివ్వండి. శెయండి. అన్గేనా? యేఃవెన అక్కర్మాలఃగానూ నా పన్నేన్ చేచుకోడవ్ః. అకి9మా లింగ నీన్ తిరగలేదండి. అని అనగానప్పుడాలకి శిపోక్తోవచ్చును. గాంకిలోనూ ఉవ్ డిక్కిదర్ద్ కుర్రోళుస్రు. మాలోనే ఒకనాయ్కుడున్నానెండి.

## వ్యవహారఖండికలోని వ్యాకరణాంశాలు

*ధ్వని విభాగం :*

జానపదభాషా లక్షణాలు ఇతని భాషా వ్యవహారంలో పుష్కలంగా కనిపిస్తాయి. సాంఘికస్థాయి భాషావ్యవహారాన్ని ఏవిధంగా ఇంఫ్లుయెన్స్ చేస్తుందో తెలుసుకోడానికి ఈ వ్యవహారఖండికను ఏటీచర్ లేదా లెక్చెరర్ వ్యవహారఖండికతో పోల్చిచూస్తే. వైవిధ్యం కొట్టొచ్చినట్టు కనబడుతుంది.

ఒత్తులు లేకపోడం ఒక లక్షణంగా చెప్పాలి. 'అగోరించక', 'బారెంగ', 'బార్యా', 'మొగవ్ః', 'నలపయ్యోళ్ళా', దారబోత్తనవుః' ఉదాహరణాలుగా చెప్పచ్చు. మూర్ధన్యోచ్చారణ 'మళ్ళింకా', 'ఆఃళ్కి', 'తొమ్ముదంగుళాలు', బేగిరమ్మంటెళ్ళేను' వంటి పదాల్లో కనబడినా మొత్తంమీద మూర్ధన్యోచ్చారణ తక్కువే అనైప్పాలి.

'స' కారం 'శ' కారంగానూ 'చ' కారంగానూ మారింది. 'చ' కారం కూడా 'శ' కార 'స' కారాలుగా మారింది. ఈ ఆసక్తికరమైన మార్పులు కింది పదాల్లో చూస్తాం:

'స' → 'శ' :- 'జేశి', 'శంపాదించింద్', 'శింగ్‌పూర్', 'తగిలీశేరు', 'చేశేరు', 'కనీశవుంచే'.

'స'→'చ' : 'కల్చి', 'తెల్చునా', 'చనివారవ్ఁ', 'రచీదులు', 'చింగ పూరు', 'చరే'.

'చ'→'శ' : 'శిన్నతనొవ్ఁ', 'శాల్దు', 'శదువ్‌నేన్నేతను', 'పిలిశేరండి', 'సవ్వాశారవ్ఁ'.

'చ'→'స'. 'సచ్‌పొయ్న్నతరావ్'ది, 'స్తోవుల్లేకండ', 'సదివించక', 'సూపె ట్టరా', 'ఇక్కడాలోసన'. శిష్టేతర లక్షణంగా చెప్పదగిన పదాది 'వ' కారలోపం ఈ ఖండికలో ఎక్కువగా కనబడుతుంది. 'ఆణ్ణి', 'ఈడు......నాగుంది', 'ఎలిపోంతరత', 'యివాగొంచేసున్'. పదమధ్య 'వ' కారం 'ఒ' కారంగా మారడం: 'ఉండోడు', 'చదువుకోల', 'తెలుగొచ్చును', 'సొంతపనోన్ని', 'ఉండూల్వి'.

'ల' కార 'న' కారాల పర్యాయరూపత ఈ మాండలికంలో శిష్టేతర లక్షణంగా చెప్పాలి: 'పోర్మాఁల్కి', 'నేదండి', 'లాబవ్ఁనెదూ', 'మినీమీటర్లంతె', 'మిలిమేటలు', 'నేబ్రాపి (లేబర్ ఆఫీసర్)', 'నోవ్‌కెలిపాతె', 'అవనేదు', 'కొంప మునిపోతే', 'నంచవ్ఁ', 'శదువ్‌నేన్నేతను' నిదర్శనాలు. రేఫ 'న' కార పర్యాయరూపతకూడా 'ఎగినెమెంట్' పదంలో కనిపిస్తుంది. 'పాలాల్', 'డాయిల్ గట్రా', 'యెలచ్చన్' (ఎరెక్షన్) 'ఇంకిల్‌మెంట్లెవ్ఁ లేవండి' వంటి పదాల్లో రేఫ 'ల' కారాల పర్యాయరూపత చూడొచ్చు.

*వర్ణసమీకరణం :-* 'స' కారానికి 'త' కారం పరమైనప్పుడు 'స' కారం 'త' కారంలోకి సంపూర్ణ సమీకరణం చెందడం కింది పదాల్లో గమనించాలి. 'అలా గొత్తది', 'మీవ్ఁ'. 'శత్తానవుఁ', 'సైటలీ పిలిస్తడన్‌కోండి', 'ఎలిగొత్తయండి' మొదలైనవి. 'ష' కారానికి 'ట' కారం పరమైనప్పుడు 'ష' కారం 'ట' కారం లోకి సంపూర్ణంగా సమీకరణం చెందుతుంది: 'కట్టపడ్తన్నయ్', 'కట్టపడుకోని', 'యదుట్టువ్ఁ', 'నట్టపలాలావ్ఁ'. ఏవర్ణానికైనా 'య'కారం పరమైనప్పుడు ఆవర్ణం తాలవ్యీకరణం చెందడం జరుగుతుంది: ఉదా. 'మజ్జెనీ (మధ్యనీ)', 'మెజ్జెనున్నయ్ గద'. ఈ ప్రయోగాల్లో 'య' కారం (జ) కారంగా సమీకరణం జరగడం కూడా చూడొచ్చు.

'ఫ' కారాలు 'ప' కారాలుగా మార్తాయి : 'ఆపీశర్లు', 'నేబ్రాపి' (లేబర్ ఆఫీసర్), పేటీల్/పేశేర్ (ఫ్యాక్టరీలు). పదాదినా పదమధ్యన సంయుక్తాక్షరాలు సూక్ష్మీకరణం చెందడం ఇతనిభాషలో విశేషంగా కనిపిస్తుంది. ఇది ఇంగ్లీష్ పదాలకి

కూడా వర్తించడం గమనించదగింది. ట్టోవ్ ఒయ్‌పోండు (స్టౌవ్ అయి పోండు). 'తలిదాండికి', 'పెజల్'(ప్రజల్), 'పీనిగా' (ఫ్యూనుగా),'రాష్టపతికో', 'యెంటికల్', 'కిల్డు' (స్కిల్డ్), 'పెతినిదిగా', 'హాయేశన్లివ్‌డవుఁ'.

ప్రవృత్తిరీత్యా ఇంగ్లీష్‌పదాలవాడుక ఎక్కువ్‌గా కనిపిస్తుంది. అరువు పదాలన్నీ కూడా స్వభాషా ఉచ్చారణ పద్ధతిలోనే ఇమిడిపోవడం గమనించాలి. అంటె హలంతాలన్నీ అజంతా లౌతాయి. ఉర్దూపదాలు కొన్ని ఇతని వ్యవహారంలో కనబడడం ఆశ్చర్యం : ఉదా. 'జూటాకారి', 'అమదాన', 'శాగేమేలు', 'ఉల్టా పల్టా గంటొడెలా' ...

ఉత్తమ పురుష ఏకవచనంలో 'నీను' (నేను), బహువచనంలో 'మాఁవ్' (మేం) వాడుక శిష్టేతర వ్యవహార లక్షణం. అదేవిధంగా 'నీవ్వు' (నువ్వు).

భూతకాలంలో భిన్న ప్రత్యయాల వాడకం ఇతన్లో కూడా కనిపిస్తుంది : 'తీశ్నారు', ఒచ్చేవు, పిలిశేరండి, చెప్పేరండి, ఇచ్చేరు, ఒగ్గీశేరు, చేసొక్కచ్చేవ్ఁ.' ఏ, 'ఏ' ల పర్యాయరూపతకు కొన్ని నిదర్శనాలు: 'నేర్చినవ్ఁ', 'అడిగినారు' లలో 'న' కారం నిలపడం ముఖ్యంగా గమనించదగింది.

తద్ధర్మంలో ప్రథమపురుష ఏకవచన అమహత్ ప్రత్యయం 'త' ఉండి 'తున్' ప్రత్యయం వాడుక అసలు లేకపోడం ఇతని వ్యవహారంలో విశేషంగా చెప్పాలి. అదేవిధంగా వర్తమానకాలిక రూపాల ఉపయోగం 'పీడించితింతాంఉు, లేప్తాను, అంతాను, అడుగుతుంతాన్నవు, పనావ్‌తంది, తీసుక్కంటాండు, శెప్పి తాన్నరు, సరిపోతంది, అవుతాంది, కనపడ్‌తాంది, దిగుతాంది/దిగితంది'.

క్రియాపదాది 'పరుషాలు', 'సరళాలు'గా మార్తాయి : 'అటీటుబోండ్ఉు, పంజేత్తన్నగాని దారబోత్తనవుఁ, మీఁవేటి జేత్తవ్, దెలీదునెండి, మత్తర బిలితాను.' పరవర్ణం అనునాసికం అయితే, నాదత నిత్యం.

పదమధ్య 'క' కార 'గ' కారాలు తర్చుగా లోపిస్తుంటాయి. లేపోతే, హొరూతదనె, ఇయ్యోపోతే, తిరితార్ కాదండి, దిపోతెలగ, అడీయ్‌తె, ఇయ్యే వరవ్ఁ వంటి పదాలు ఉదాహరించవచ్చు.